


## శ్రావణము: స్త్రీ

"తలిరుమంకెనచెంగావిలేస్కు లెసఁగు
పూసపారాణిఁబసపుక్రొంబూతసిరుల
దర్శనీయంబులగుచును దనరు పేర
టాంబ్రచివురుపాదాలు పూజ్యంబులౌర."

చిట్టితల్లీ! బొమ్మరింట బొమ్మలపెండ్లిసందడిలో ప్రొద్దుపోగొట్టుచున్నావు. 'సహజ సుందరతాప్రశస్తమై భవ్యమై శ్రీమీరు ఖద్దరుచీరగట్టి', 'మైకాబుటాతళుకుగల ఖద్దరు రైక దొడిగి', 'ఫాలభాగమునందు ప్రవిమలద్యుతులొల్కు లలితార్ద్రచందనతిలకముంచి', 'చిగురాకుమెత్తనిచేతుల బంగరుపలకలగాజులు తళుకులీన', 'నడుచునప్పుడు పుడమితాకునజేసి కాలిమెట్టెయలు ఘల్లుఘల్లుమనఁగ', 'వలతినెన్నడుమున వలయితంబగు జిగిపసిడివడ్డాణమ్ము మిసిమినీనఁగ' ఆమె ఎవరో కరకమలమున 'పసిడికుంకుమభరిణను పాదుకొల్పి' మీయింటికి వచ్చియున్నది. గమనింపవేమి? క్రీడాచాపల్య మింకను ఎన్నినాళ్లు? కుటుంబమును, కులమును, దేశమును ఉద్ధరింప ఉదయించిన దేవీమూర్తివి నీవు. చిన్నతనమును పోనాడుము. రేపు తానుచేయబోవు మంగళగౌరీవ్రతమునకు మిమ్ములనాహ్వానింప ఆవ్రతశీల వచ్చియున్నది. పొమ్ము. ఆమె ఇడు బొట్టందుకొని ఆహ్వానమంగీకరింపుము. కొద్దికాలములో నీవును పూనవలసిన వ్రతదీక్షకు ప్రథమపాఠములందుము.

క్రొత్తపెండ్లికూతురా! 'చైత్రమాసమున నీపెండ్లిముచ్చట' తీరినది. మెడతిరుగని నగలు నీకాసమయమున అత్తవారుంచలేదు. శ్రావణపట్టీలో బంపుదుమని ఆకట్టియుంచిరి. ఓర్పునభూదేవిని మించునీవు ఆభూదేవితోపాటు శ్రావణముకొఱకు స్వాగతగీతములు పాడుచు ఇన్నాళ్లును వేచియుంటివి. మీయిరువురికోరికలను ఇప్పుడు పచేళిమములైనవి. శ్రావణపట్టీలో నీకు ముత్యాలహారము. ఆమెకు 'శ్రావణమోహనాంబుదపరంపరలన్ మెలమెల్లజారిన ముక్తావళులు.' నీకు పచ్చనిపట్టుచీర. ఆమెకు పచ్చికపచ్చడము. ఆమె కడిమిపూలతో,

గులాబిరేకులతో, సంపెగపుష్పములతో, మొగలిపూలతో దేవి నర్చించుచున్నది. నీవును చెదరని చిత్తముతో ఈశ్రావణశుక్రవాసరమున వరలక్ష్మినిపూజింపుము. ఉపాస్యదేవత వరములనొసంగు లక్ష్మి. నీహృదయమున 'ఏయమృతదివ్యవాంఛగలదో?'

"అన్న సర్వకళాశాలయందు పట్ట ముద్దుచెల్లెలు మగనికై మొన్నదనుక
భద్రుఁడై చేయుపనికేగ పవలు రేలు తిరిగి వేసారి నీతండ్రి దిగులుపడిరె;
తిరుగుగాలికి వానికే తెరవునైనఁ యింటనుండిరె నీవు నయ్యొమ్మె కాని
జాపుమనికో రవాక్కకై యోసుందరాంగి! పట్టిపిలిపింతో దేవతావరము చేత?"

ఎట్టికోరికలు కోరినను, ఎన్నికోరికలు కోరినను తీర్చుటకు అదుగో భక్తురాంద్ర ముంగొంగుపసిడి దేవి నీయింట సాక్షాత్కరించి నభదీర్చియున్నది.

క్రొత్తకోడలా! శ్రావణమంగళగౌరీవ్రతము ఐదేండ్లలోను మొదటివత్సరము పుట్టింటనే నోచుకొంటివి. ఈ రెండవవత్సరమున నీనోము తనయింట నిర్వర్తింపజేయవలయునని మీయత్త నిన్నిచ్చుటకు తీసికొనివచ్చినది. నీకెంతయు క్రొత్తగానున్నది.

"పరిచితముకాని యేసంద్రభాగమందొ దారులాడుచు ముగ్ధనేత్రాలవింత
నల్దెసలఁగళవళపడు సాకభాతిఁ తోచ విభుగేహమం దోవధూలలామ!"

తిరుగుచుంటివి. పూజావసరమున ఈకళవళపాటు కూడదు. వేలమెఱుగని భక్తితో, వేఱుకాని మనముతో గౌరీదేవిని కొలువుము. ఘనఘోష మృదంగధ్వనిగా, మెఱుపు దీపముగా, వర్షధారలు అభిషేకముగా, పటిచినపచ్చిక వస్త్రముగా ప్రకృతికాంత దేవి నుపాసించుచున్నది. ప్రకృతి ననుకరించు కళాప్రియవు నీవు. కావున గౌరీపూజామగ్నవు గమ్ము. పూజాంతమున

"శిరమునదాల్చినట్టి తులసీదళ మేనియు జారలేదు, తా
కరమునగట్టుతోరము వికారమునొందదు నుంతయేనియున్,
చెరుగదుకుంకుమమ్మ ముఖసీమను, మాయవు చీరబెళ్కు ని
ద్దిర! తరుణి ప్రశాంతకమనీయవికాసము నెల్వరించెడిన్."

అనెడి పేరు అత్తమామలచేత గొందువుగాక!

బిడ్డలతల్లీ! పసుపుకుంకుమలకై పోవుటకు పదియామడలదూరమునైనను పాటింపని దానవు నీవు. కావుననే గంపంతకామాటమును సరుదుకొని ఈశ్రావణమంగళశుభవాసరమున ఇతరసమయములందు ఇల్లుమీదఇల్లుబడినను ఇల్లుకదలని నీవు పేరంటమునకై బయలు దేరితివి. చంకలో చంటిబిడ్డ. చేయిపట్టుకొని ఎడపిల్ల. 'మగవాడవు, ఆడువారితో పేరంటమునకు రాకూడదు' అనినయముననను, 'ఆడంగి అబ్బాయి అందురు' అని భయముననుచెప్పినను వినక నేలజీరాడుచున్న వదులు ఇజారుతో, ఎగుడుదిగుడుగా పెట్టబడిన బొత్తాములుగల కోటుతో వెంటవచ్చుచున్నాడు పోతుపేరంటాలు తొలికానుపుపసనతోన. ఇట్లు పిల్లలకోడివై వాయనములుగొన

"పొరుగిండ్లన్ జని సంఘజీవనపు నేర్పుల్ రీతులెన్నింటినో
యరయన్ జాలెదు; జ్ఞానకాంతికిని సౌఖ్యస్ఫూర్తికిన్ సుందరీ!"

'ఇంతికి స్వాతంత్ర్యమే లేదటంచు చింతించు సాంఘికులు శాంతించు'నట్లు పొరుగిండ్లకు జని సంఘజీవనపు నేర్పులు రీతులు ఎన్నింటినో అరసి అనుభవసారమునందిన నీకు

"ఇరుగమ్మకెంతయదృష్టమో పెనిమిటి
కొనిపెట్టె బంగారుగొలుసులజత
పొరుగమ్మ యెంతటిపుణ్యమో మువ్వల
యొడ్డాణమును కొనియిచ్చె భర్త
ఎదుటింటిసీతమ్మపతి పెప్లీడరుగుమా
స్తాభార్య నానుముస్తాబునొందె
సందాకయేల వయస్సుమీరినది మా
మేనత్త కాసుల పేరుకొనెను
దిగదుడుపురీతి నాకట్లొ తెగువచేసి
కాసుకొనినారు, చాలు, పెబోసటంచు
దిగులునొందకు భర్తపై, మగువ! గేహ
లక్ష్మికిదుకాన్క యొకయనురక్తియొనుమి."

అని ఒరులుపదేశింపవలసిన యవసరముండునా?

పెద్దపేరంటాలా! 'ఆషాఢమాసమున గోరింటఆకు పెట్టుకొనిన అయిదువతనము' అనుపురాణవచనమును పూర్ణచిత్తముతో విశ్వసించి ఆషాఢమాసము అతిక్రమించకుండ రెండుచేతులకు గోరింటఆకుపెట్టుకుంటివి. పతికి శుశ్రూష చేయుటలో శ్రమయెట్టిదో యెఱుగక ప్రాయమువాసినను పరువముదప్పని నీకరములు పెట్టినగోరింటఆకుచే దొండపండ్లయినవి. కాగా కుంచమంత కసగలమాటను మోయుటచే నీకరములు ఎంతఎఱ్ఱగ కందినవో ఎవరు చెప్పగలరు? చెప్పగలరో, లేరో, చెప్పుటకు అసలు ప్రయత్నమేది? ఆషాఢమాసములో గోరింటఆకు పెట్టుకొనుట ఎఱుగరు. పేరంటమునకు వచ్చినప్పుడైనను పసుపుపూయించుకొను అభిలాషలేదు. పసుపుపూతయే లేదు ఇకదానిపై పారాణిచికిలీపని లేకనేల? కాటుకపై కన్నుపడదు. కంటికి కాటుక ఎట్లువచ్చును? 'వస్తువాహనముల పరీక్షలు. చీనిచీనాంబరముల ఎన్నికలు. ముమరులేతరంగుల వ్యత్యాసములు.' ఇంతియే. అమ్మా! ఆపకుచుల తీరువ ఇట్లున్నది. నిన్ను వారు కడగంటనైనను చూడకుందురు గాక! నీవు వారిని మాత్రము విడిచిపుచ్చకుము. నీకున్న అనుభవములో సగమువయసైనను లేని వారిని నీవు కనికరించి ఇట్లు బోధింపుము:

"కనులదీర్చిన నీటుకాటుకరేకలా యవి?
సర్వదృష్టిపీడాహారములు
పదపద్మములగల పారాణియా యది?
పూతసౌందర్యసమ్మోహనమ్ము
హస్తభూషణమా తోరమది యనంత
నిర్మలాంచితప్రణయబంధితజగమ్ము."

అజ్ఞానముచే పెడత్రోవనుబట్టినవారేగాని అహంభావముచే తలతిరిగిపోయినవారు గాకుండుట వారు నీమాటవిందురు. ప్రబోధవిధేయమతులగుదురు.

"ఎచటజూచిన పూజలే ఎచటగనిన
లక్ష్మికై చేయువ్రతములే లక్ష్మిపూజ
లిన్నిటనునోచినమ్మల కేమిసుకృతో
సంపదాకరమైనట్టి శ్రావణమున."

# శ్రావణలక్ష్మి

శ్రీమతి లలితాకుమారి గారు

౧

మోవిపైఁ దాగు మెరపుల మొలకనగవు
భుజముపై వ్రాలు మొయిళుల ముద్దుకురులు
తనువునిండిన పూల యందంపుసొగసు
వరలనేతెంచె శ్రావణమాసలక్ష్మి.

౨

కొండయండలనాడుకొను నల్లమబ్బులమాటున వెల్గుశంపాకుమారి
పూవుడొంకల నాకుపొత్తిళ్లనడుమ క్రొంబసపులఁజల్లు సంపంగికన్నె
కెంపులదానిమ్మగింజలఁ గొరుకుచు పిలపిలమనికూయు చిలుకపడుచు
ఏటిచెంగటిగాలి కెగిరెడి ముంగురుల్ మెల్లసవరిచేయుపల్లెపిల్ల
ఎంతటి అమాయికమనఃప్రవృత్తితోడ
స్వాగతస్నేహగీతముల్ పాడినారొ
బాంధవప్రేమసూచకబాష్పసమితి
వరలనేతెంచె శ్రావణభాగ్యలక్ష్మి.

౩

బంగారుజలతారుపైటచెంగావియంచులు గాలితాకున మెలితిపడఁగ
నీలాలమీల చిన్నెలవన్నియనింపు చిన్నారిచూపులు చెమ్మగిల్ల
పగడాలపెదవి గేదగిరేకు సన్ననిమొలకల చిరునవ్వుమురువుసూప
చిగురాకుమెత్తనిచేతుల బంగరుపలకలగాజులు తళుకులీన
లోలకులు చిన్నిచెవుల నుయ్యాలలూఁగ
మోమునంగుంకుమపుబొట్టుముద్దులొలుక
నడలుతడబడ క్రొత్తసందడులు మీఱ
వచ్చువేడ్కఁ మావదిన శ్రావణముతోడ.

౪

ద్వారములఁ జాతపత్రసూత్రముకట్టి
పసపుకుంకుమ గుమ్మమ్ముపై నిబూసి
శ్రావణశుభోదయమున ప్రశాంతరక్తి
పంచెదరు శనగల నైదువలు ముదమున.

౫

క్రొత్తకోడండ్రు తెలియని కోర్కెలలర
వచ్చి మెలఁగెదరెటొ యత్తవారియింట
అప్పుడేవిచ్చిన గులాబియలరులల్ల
నల్ల సిగ్గున వాసనలంపు కరణి.

౬

వీథివీథుల ముగ్ధవీక్షాపరంపరోన్ముక్తనిస్తులభావచూక్తికములు
బాటబాటల యౌవనాటోపపరిజృంభితాధరోష్ఠాధరహాసరుచులు
పథపథమ్ముల వయఃప్రౌఢకాంతాస్మేరసహితవాక్యారావసముదయములు
జాడజాడల బాలజలజాననాపాదకంకణకింకిణీక్వణనగతులు
ఎచటఁజూచిన కేరింతలే బెడంగు
నడకలే క్రొత్తక్రొత్త సందడులచవులె
నిండి మాచిన్నపల్లె నెన్నండులేని
సంపదల ప్రతిధ్వనిజూపె శ్రావణమ్ము.

౭

సంపంగిపూవుల సంతరించిన దొక్క నీలవిశాలమదాళికేశ
చెవులకుఁగమలముల్ దవిలించినది యొక్క హేలావిలాసమత్తేభయాన
కాటుకరంగులు కనులఁదిద్దిన దొక్క కమనీయకోమలకమలనేత్ర
గుంకుమపుంబొట్టు కూర్చితీర్చిన దొక్క సంపూర్ణపూర్ణిమచంద్రవదన
పసపుపూసిన దొకక్రొత్తపడుచుపిల్ల
కనకసన్నిభనిర్మలగాత్రమందు
అఖిలసౌఖ్యసంపదల కుయ్యాలతీవ
సకలసౌభాగ్యచిహ్న మీశ్రావణంబు.

౮

పాటలఁబాడువారు చిరుపైటల నల్లన సర్దుకొంచు న
య్యాటలనాడువారు పరిహాసములన్ జిరునవ్వువారు మో
మోటమితోడ నేమనక యూరక కూర్చొనువారుసిగ్గులన్
జాటునకేగువారయిరి శ్రావణగేహాలలన్ గుమారికల్.

౯

జిలుగుల్ నింపెడు మేల్బనారసుజరీచీరల్ విడంబించి క
న్నులకున్ గ్రొత్తరకంపుటందములఁగాంతుల్ నింప మైకాబుటా
తళుకున్ ఖద్దరురైకలందొడిగి సీతాకోకముల్ వోలె సొం
పులెరూపంది చరింతు రబ్జముఖు లీపున్నెంపుమాసంబునన్.

# శ్రావణప్రకృతి

౧

### శ్రీమతి తుమ్మల వసంతాదేవిగారు

శ్రావణమాసమాసరలసత్ప్రతివాసరసవ్యవర్షధా
రావళిఁజేసి శ్యామలములై పొలుపొందెడి మార్దవార్ద్రిస
స్యాళిహళ్లి వస్త్రధారణమహామహిమన్ హావణించు ధారుణీ
దేవికి స్వాగతప్రణయదీక్షల నేగృహలక్ష్మి మ్రొక్కదో?
ప్రాణము లేచివచ్చెఁగద! పాడయిపోయినమందు లెండ ని
ద్రాణమె యయ్యె చరాచరవితానము కెల్లను; పృథ్వి నిత్యక
ళ్యాణముపచ్చతోరణమెయయ్యెఁగద; యింకమఱేమి? శ్రావణ
ప్రాణసఖిన్ బొటింపారి ధరన్ గృహలక్ష్మి సమాదరింపదో?
వాలుతటిల్లతాతతిని; వ్రాలుననంతసువృష్టిధారలన్;
రేలుపవల్; పవల్ మిగులరేలుగఁ జేసెడి యుష్మదీయమహా
లీల మహావిచిత్రము బళే! యిఁక శ్రావణదివ్యలక్ష్మి! ఏ
లాలితచిత్రయైన గృహలక్ష్మి నినుంగని పుల్కరింపదో?
కలకలలాడు నవ్యజలగౌరవపూర్ణతనెల్ల వాహినుల్;
కొలకొలమంచుమించెడి శకుంతతతృప్తిని జాతకావళుల్
కిలకిలమంచు సల్పెడినిగ్రీడలు సర్వపతంగసంతతుల్;
వెలసెడి, శ్రావణాననిటువిశ్వము, యేగృహలక్ష్మి యుబ్బదో?
మెఱుపులె దీపమై, స్తనితమే మఱిదివ్యమృదంగవాద్యమై,
పఱచినశాద్వలమ్ములు తివాసులుగా వెలుగొంద నందు మై
మఱచి మయూరపాత్రములు మంజులనాట్యముచేయ నొప్ప నీ
మఱిపెపు శ్రావణప్రణయమోహిని, నేగృహలక్ష్మి కొల్వదో?

౨

### శ్రీమతి ఓలేటి నిత్యకల్యాణమ్మగారు

(కాళిదాసుని భావములననుసరించి వ్రాయబడినవి)

నవనవచ్ఛవులఁ దృణాంకురపాళులు వైడూర్యశకలాలువలెవెలుంగ
ప్రోత్థితకందళీస్ఫురితదళంబులు నీలాలమొత్తంపునీటుగొల్ప
హృద్యసాంద్రారుణార్ద్రేంద్రగోపవితతి పద్మరాగంబులపసలునించ
నీటుగానటియించు నీటిబుగ్గలచాలు ముక్తాఫలంబులమురువుఁజూప

మహితనిత్యసౌందర్య సంపదలొసంగు
మణివిరాజితనవదివ్యమండనములు
దాల్చిహసియించు ప్రేమసుందరివిధాన
దనరు నీశ్రావణంబున ధరణికాంత.

బింబాధరమునందు ప్రిదిలి విలోచనేందీవరోష్ణాశ్రులు నేలరాల
కటికచీకఁటిపూత కబరీభరమువీడి యంసభాగమునవ్రేలాడుచుండ
వరకాంతియుతనవ్యబహురత్నరాజితమండనశూన్యమై మైచెమర్చ
కస్తూరికాగరుగంధాధిలేపనశ్రీలేమి గాత్రంపుజిగినశింప
జిలుఁగువసనంపుపయ్యెద మలినమొంద కమలనేత్రాలఁ గావిరక్తిమలునిండ
ప్రాణనాథాగమము దుర్లభంబుకాన కుములుదురు ప్రవాసిప్రియప్రమదలిపుడు.

శుభ్రనీలోత్పలస్తోమవిలాసభాగ్యోన్నతిఁజూపించి యొక్కచక్క-
రేజవరాలిమైలీలల కాటుకనోసరించుచునుండి యొక్కమూల
పసిమినీలిమసొంపు మిసిమిరేకలచాలు నోడిగిల్లుచునుండి యొక్కదెసను
శక్రచాపపుఁగళాజాల మధ్యంబున వికచరోచులనీని యొకపథాన
చాతకహృదంతరంబులఁ బ్రీతినించి వింతవేసాలతోడ త్రుళ్ళింతలాడి
సొరులనునించు నీరదసమితి సతము శ్రావణవిలాసలలితవాసరములందు.

సంపూర్ణ పూర్ణిమాచంద్రాననమునందు పసిఁడిచాయలనీను పసుపుసలది
జఘనవిలాసవిశాలభాగమునంటు వాల్జడ హేమపుష్పములుతురిమి
ఫాలభాగమునందు ప్రవిమలద్యుతులొల్క లలితార్ద్రచందనతిలకముంచి
పన్నీరుతావిగుబాళింపఁజేసెడు జిలుఁగుజల్తారంచు చీరెఁగట్టి
కరమునపసిఁడికుంకుమభరిణనూని పేరఁటాండ్రఁబిలువనేగు ప్రేమవతులు
చెలువముచునింత్రు మాపల్లెసీమయందు శ్రావణపవిత్రశుక్రవాసరములందు.

తొమ్మితలనాట్యరంగమున కమర్చిన నీలిడేరావోలె నింగిలినర
చిమ్మచీఁకటిరేయి బమ్మరక్కసియులివట్లు మేఘారవంబతిశయింప
నీటిమబ్బులయందు నిల్చికన్నులమూతపడఁజేయుశంపలప్రభ లెసంగ
పిలపిలమనిపారు పిల్లకాల్వలచెంత ఝిల్లీస్వనంబులు చెవులఁబడఁగ
హృదయమునునించుకేని జలింపఁబోక
మోహమునఁ బ్రియుసంకేతభూమియందు
నరయఁగా నభిసారిక త్వరితగతిని
తరలు శ్రావణశర్వరీధ్వాంతవీథి.

# శ్రావణము : గృహలక్ష్మి

జమ్మలమడక రామమూర్తిగారు

మంగళదాయకవ్రతసమాజరహస్యకథావిధానలీ
లంగను శ్రావణంబు గృహలక్ష్మికి శోభ ఘటించినట్లు, స
న్మంగళదాయకవ్రతసమాజరహస్యకథావిధానలీ
లంగనఁ శ్రావణంబు గృహలక్ష్ములకింపొనరించుటబ్రమే?

గృహకృత్యభారదుస్సహజీవులగు గేహినుల జీవితోత్సాహకలనకొఱకొ
ధనలోభులగు భర్తలను సద్వ్రతవ్యాజమున ధార్మికులఁ జేయు ఘనతకొఱకొ
విద్యావిహీనులౌ వెలఁదులుగూడ సద్భక్తిప్రపత్తులఁ బడయుకొఱకొ
ఇంతికిస్వాతంత్ర్యమే లేదటంచు చింతించుసాంఘికులు శాంతించుకొఱకొ
పూరుషుల జీవితంబులు పుణ్యసతుల
హస్తగతములటన్న సత్యంబు లోక
మునకు బహిరంగముగఁ జాటుపనికొ నిన్ను
శ్రావణంబ! సృజించె రాజీవభవుఁడు.

తెలతెలవారకుండ నిలుఁదీర్చి మనోహరరంగవల్లికా
కలితవితర్దికాతలసుఖస్థితభాస్వదుమారమాకళా
విలసితదివ్యవిగ్రహపవిత్రసమక్షముఁ జేరునాటి నీ
యలఘుతరప్రవృత్తిఁ దరమా నుతియింపఁగ పుణ్యగేహినీ!
ఐదువలెల్లనూత్న వివిధాంబర భూషణభూషితాంగులై
యేదెసఁ జూచినన్ కనులకింపుజనింప నిలింపచంపకా
మోదలోకోయటంచు జనముల్ భ్రమియింప, స్వతంత్రజీవనా
స్వాదనమాచరింత్రుఁగద! శ్రావణభౌమదినాంతవేళలన్.

అతివ లేవేళనిట్టిసద్వ్రతములెల్ల
భౌతికసుఖాతినీచలంపటతవీడి
ఘనతరాధ్యాత్మికజ్ఞానకలితులగుచు
నాచరించిన గృహలక్ష్ములగుదు నిజము!

# శ్రావణపట్టీ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

౧

పాపయ్యపంతులుకు డబ్బుకర్చంటె ప్రాణం అవిసిపోతుంది. ఉండటానికి రెండు లక్షలున్నాయి. కాని ఏమిలాభం? ఆమహాలక్ష్మీదేవియొక్క క్రీనీడైనా అతనిమీద ప్రసరించలేదు. మోకాళ్లుదిగని అయిదుమూళ్లఅంగవస్త్రమేగాని యేడుమూళ్లధోవతి ఆయన జన్మమెత్తింతరువాత కట్టియెరుగడు. అరిగిపోయిన చెప్పులైనా, విరిగిపోయిన గొడుగైనా, చిరిగిపోయిన గుడ్డయినా అవతలపారవేయాలంటే ఆయన విలవిలలాడిపోతాడు. పక్కను రెండవవిస్తరిపడ్డదా అంటే ఆయనకు కంపరమెత్తినట్లుంటుంది. సాధ్యమైనంతవరకు చెప్పుకాలువాడు యింట్లోకిరాకుండా విశ్వప్రయత్నంచేస్తాడు. పప్పూ, కూరా, పులుసూ, పచ్చడీ నాలుగూవిస్తర్లోచూస్తే అమ్మో! యిన్నిసాధకాలు చేసుకుంటే కాపురంచేసినట్లేనని గుండెబాదుకుంటాడు. ఆయనయింట్లో ఇద్దరు బ్రాహ్మణులు ఔపోసనపట్టడం అబ్బ తద్దినం నాడే.

మహాలక్ష్మమ్మ అయినింటపుట్టింది. పరువుమర్యాదలకోసం పెనుగులాడుతుంది. ఇంత పూజాపురస్కారం, నోమూవ్రతమూ, దానంధర్మం చేసుకోవాలని దేవులాడుతుంది. ఏకాదశి నిట్రుపాసాలకైతే నాఅభ్యంతరం లేదంటాడుగాని ద్వాదశినాడు ఒక్కబ్రాహ్మణునికి ఔపోసనవేసుకుంటానంటే ససేమిరా అంటాడు పాపయ్యపంతులు. రంగుచీరలు కట్టుకోవాలని ఆమెకు మనసు. కాని చవకగావచ్చే కోరాతానులకు అంచుకమ్మీలువేయించి ఆమె మొదానపారవేస్తాడేగాని ఒక్కచక్కని నేతచీరకొనిపెట్టడు పాపయ్యపంతులు. భార్యాభర్తలిద్దరూ ఉదారులైనా ఆకాపురానికి సౌఖ్యమే. ఇద్దరూ పిసినిగొట్టువాళ్లయినా సౌఖ్యమే. కాని వారొకదోవా వీరొకదోవా అయితే అది నిష్ఫలకుంపటే. వారిద్దరికీ ప్రతివిషయంలోనూ కరిమకరిసమరమే. బ్రహ్మదేవుడికదేమివినోదమోగాని యిరువురి మనస్సులూ ఒక్కలైన సతీపతులను వేయిజంటలకొక్కజంటనైన సృష్టించడు. "ఇదేమిటండీ! యీఅన్యాయం? మనఅన్యోన్యం వంటిదిగాదా వారి అన్యోన్యం? మనకాపురంవంటిదిగాదా వాళ్లకాపురం? భిన్నస్వభావాలవాళ్లను ఆలుమగలుగా చేస్తారేమిటి? ఒకదానికీ జతగూడ కాపురం కల్లలేచేసుకోరా? ఇటువంటి దంపతులను యెక్కువగా సృష్టిస్తే మీకు మాత్రమెంతఅప్రతిష్ఠ? బ్రహ్మకూర్చుడు, బ్రహ్మకూర్చుడు అని మిమ్మనేదూషిస్తారు. కాస్త ఆలోచించి ముడివేయండీ!"అని ఆవాగ్దేవైనా మొగుణ్ణిమందలించదేమో! బ్రహ్మదేవుడు ముప్పాతికమువ్వీసం ఇటువంటిదంపతులనే సృష్టిస్తుంటాడు.

పరబ్రహ్మానికి ఈయేడే పెళ్లయింది. ఒక్కగానొక్కపిల్లవాడనీ, రెండులక్షలరూపాయల ఆస్తిపరుడనీ, తండ్రి యెంతపిసినిగొట్టువాడైనా ఆముసలివాడుకాస్తా రాలిపోయిన తరువాత తమకొమార్తె లక్షాధికారిభార్యయై సుఖపడుతుందనీ గుంటూరులో న్యాయ

వాది ప్రముఖుడైన సుబ్బారావుపంతులుగారు అయిదువేలుకట్నమిచ్చి పిల్లనిచ్చేరు. వియ్యంకుడు డబ్బుపిక్కినచోటునల్లా సుబ్బారావుపంతులు సర్దుకోవడంచేత పెండ్లి దివ్యంగా జరిగింది. ఆషాఢపట్టీ నెపంబెట్టి తనకు కావలసిన వ్రాతబల్లా, కుర్చీ, బీరువా, షెల్ఫు, ల్యాంప్, ఫౌంటెనుపెన్, రిస్టువాచీ, సైకిల్ వగైరా లేవేవో జాబితా వ్రాసియిచ్చి ఒక్కమాటే సంపాదించేడు పరబ్రహ్మం. ఆషాఢపట్టీకి గూడా రెండుమూడువందలు కర్చుచేసి ఘనంగాయివ్వడంచేత తాము శ్రావణపట్టీ కోడలికి గొప్పగా తీసుకపోవాలని మహాలక్ష్మమ్మ మహాఉత్సాహపడుతున్నది. కాని పాపయ్యపంతులు తానుకోరినంత కర్చుపెట్టడనీ తానుయెట్లామర్యాద దక్కించుకొంటానో అని ఆమెయోచన.

౨

ఒకవైపు తీగతోనూ, ఒకవైపు దారంతోనూకట్టిన పాతసులోచనాల జోడు ముక్కుమీదనుంచి జారిపోతుంటే మాటిమాటికి మీదికిలేసుకుంటూ పాపయ్యపంతులు ఏవోకాగితాలు చూచుకుంటున్నాడు. ఆవారంలో వాయిదాలు వెళ్లబోయ్యే ప్రామిసరీనోట్లు విడిగాపెట్టుకుంటున్నాడు. డబ్బురాని మొండిబాపతులు తలచి వ్యాజ్యాలు వెయ్యాలి కాబోలు దీనికి జోలెడుసొమ్ము కర్చౌఅనుకుంటూన్నాడు. ఎల్లుండే శ్రావణమంగళవారం కాబట్టి ఆరోజున శ్రావణపట్టీ కోడలికిపంపే ప్రస్తావనచెయ్యాలని సమయంకోసం మహాలక్ష్మమ్మ వంటజేస్తూ వంటయింట్లోనుంచి వాకిట్లోకి, వాకిట్లోనుంచి వంటయింట్లోకి తిరుగుతున్నది. పాపయ్యపంతులు కాగితాలు చూచుకోడం అయింది. దస్త్రంకట్టుకుంటున్నాడు. ఒంటరిగాఉన్నాడు. ఇదేసమయమని మహాలక్ష్మమ్మ "ఏమండీ! యేమంటారు? యెల్లుండి మంగళవారంగదా? కోడలు కొత్తగా నోమునోచుకుంటుందిగదా?" అన్నది.

పాపయ్యపంతులు ఉలికిపడ్డట్టయి 'అయితే?' అన్నాడు.

"మనం శ్రావణపట్టీ తీసుకపోవాలె."

"ఓహో మళ్లీ యేమిటోపెట్టవే?"

"ఏమిటో పెట్టడమేమిటి? మొన్నవాళ్లు రెండుమూడువందలురూపాయలు కర్చుపెట్టి ఆషాఢపట్టీగూడా యిచ్చిపోయినారు గదా? మనం శ్రావణపట్టీ తీసుకపోకపోతే బాగుంటుందీ?"

"బాగుండకపోతేపోనీ. వారుతెచ్చేరని మళ్లీబదులు తీసుకపోవడానికి నావద్ద యెఱ్ఱని యేగానిలేదు."

"లక్షాధికారులమని పేరుపెట్టుకొని యెఱ్ఱనియేగాని లేదంటే యెవ్వరైనా నవ్వుతారు."

"ఎవరు పెట్టుకున్నారుపేరు? ఊరంతా చూడిగేనంటే తానుపాడిగేదె అనేపెళ్లానివి నీవుతప్ప మరెవ్వరూ నావద్ద డబ్బున్నదనరు."

"అబ్బాయికి అయిదువేలకట్నం లక్షాధికారులనేగా పుచ్చుకొన్నారు?"

"నేను లక్షాధికారిననీ, నాకు అయిదువేలు కావాలనీ నేనేమి అడగలేదు. వారు యిస్తామన్నారు. నేను సరేనన్నాను."

"అంతటితో పోయిందీ. మొన్న ఆషాఢపట్టీకి యెన్ని తెచ్చుకున్నారు? తెచ్చుకున్నప్పుడు యియ్యక్కర్లేదా?"

"ఏమీ యివ్వాలని రూల్సా?"

"రూల్సేమిటి? తెచ్చుకోడం యెప్పుడునేర్చుకొన్నామో యివ్వడం అప్పుడేనేర్చుకోవాలె. మనకు రావలసిన సదుతులు రాబట్టుకున్నప్పుడు వాళ్లకివ్వవలసిన సదుతులు యివ్వవద్దూ?"

"వారిదినుయిన్నా, మనదిచేదా. యెంతైనా చేదుకుంటాము. కాని మళ్లీ యెదురు పెట్టడమేమిటి? పెడితేమనకు లాభమేమిటి?"

"లాభమో గీభమో నాకుతెలియదు. ఈయింగ్లీషుచదువు వచ్చిం తరువాత ఈ కట్నాలూ, ఈ అషాఢపట్టీలూ పుట్టుకొచ్చేయిగాని క్రొత్తగా పెండ్లయిన సంవత్సరం కోడలు తొలిసారి శ్రావణమంగళవారం నోమునోచుకునేటప్పుడు ఇన్ని ఆకులూవక్కలూ, కొబ్బరికాయలూ, అరటిపండ్లూ, శనగలూ, పసుపూకుంకుమా, తల్లికీపిల్లకూచీర రెవికలూ, ఒకటోరెండో నవరున్నలూ తీసుకపోయి 'శ్రావణపట్టీ' అని యివ్వడం అనాదినుంచీఉన్నది. గొప్పవాళ్లు గొప్పగాతీసుకపోతే కొద్దివాళ్లు కొద్దిగాతీసుకపోతారు. కాని అసలు శ్రావణపట్టీ తీసుకపోకపోవడం యెక్కడాలేదు. నాకు మీఅమ్మగారు తేలేదా?"

"చాలు కట్టిపెట్టు యికనీ సోది"

"నేను మాట్లాడితే మీకుసోదగానే ఉంటుంది. సోదె అని ఊరుకుంటే జరగాలిసిన వేడుకలు జరగొద్దూ?"

"నీవేడుకలన్నీ జరపడానికి యిక్కడ జాలెలునింపుకొని యెవరూకూర్చోలేదు."

"ఈకాస్తవనికేమి జాలెలుకావాలె? ఏభై రూపాయలు కర్చుపెడితే సామాన్యం. నూరురూపాయలు పెడ్తే గొప్పగా."

"నీకేమి అట్లాగేఅంటావు. మోసేవాడికితెలుస్తుంది కావడిబరువు. తెస్తేతింటాను, చస్తే ముండమోస్తానసే ఆడచెత్తకేమితెలుస్తుంది? ఈడబ్బుకాటకంరోజుల్లో రూపాయి అంటే మహామేరువుగాఉంటే నూరురూపాయిలుకర్చుపెట్టి శ్రావణపట్టీట. శ్రావణపట్టీ, నీమొఖంపట్టీ, నీమోరపట్టీ, నావల్లగాదు. ఫో."

పెనిమిటిచేత చీవాట్లు సర్వసాధారణమే అయినా మహాలక్ష్మమ్మ కెందుకో ఇప్పుడు కళ్లనీళ్లొచ్చేయి. దుఃఖభారంచేత అక్కడనిలువలేకపోయింది. కన్నీళ్లు పమిటతో తుడుచుకుంటూ "యెల్లకాలం మీతోయిదేపోరు. రాఅమ్మేగాని పోఅమ్మలేదు. ముద్దూముచ్చటా

మొఱుగరు. మర్యాదామన్ననా అసలే అక్కరలేదు. డబ్బొకటి కర్చుకాకుండాఉంటేచాలు." అంటూ గిఱ్ఱునతిరిగి పడమటింట్లోకివెళ్లిపోయింది మహాలక్ష్మమ్మ. "ముద్దూముచ్చటాట. సొమ్ముపాడుచేసుకునే ముచ్చటేమిటి? దీనిముఖం"అని సణుక్కుంటూ ఆమె దృష్టిపథంనుండి తొలిగేదాకా చుఱచుఱా చూచేరు పాపయ్యపంతులు.

3

భార్యాభర్తలకు పైసంభాషణ జరిగినతరువాత శ్రావణపట్టీప్రస్తావన లేకపోవడమే గాకుండా మామూలుమాటలు గూడ జరగలేదు. ఆయన వాకిట్లోఉన్నప్పుడు ఆమె సావిట్లో, ఆయన సావిట్లోఉన్నప్పు డామె వంటయింట్లో పొద్దుపుచ్చేరు. భార్య కోరినకోరిక న్యాయమైనా డబ్బుకర్చుపెట్టాలెనే అని దిగులుపడిపోతున్నాడు పాపయ్యపంతులు. "డబ్బు కాపీనంతో దేవులాడేభర్తను గట్టుకొని నాజీవితేచ్ఛలన్నీ చంపుకొంటిని. పెద్దతనం పైబడే యిప్పుడైనా ఆయనకింత తెగువపుట్టరాదా? కొడుకూ కోడలు ముచ్చటలైనా చూచుకో వాలనే కుతూహలం కలగరాదా? నిర్జలభూమిలో చల్లినవిత్తనములలాగా మామొదలోని కోరికలు ఎల్లకాలం నశించిపోవలసినదేనా?" అని కోపంతో కుమిలిపోతున్నది మహా లక్ష్మమ్మ.

సాయంత్రం అయింది. గోనెపట్టాముందువేసుకొని చుట్టలు చుట్టుకుంటూ పాపయ్య పంతులు వాకిట్లోకూర్చున్నాడు. పొరుగింటి సుబ్బమ్మగారొచ్చింది పెత్తనానికి. సుబ్బమ్మ గారిని చూడగానే వాళ్లపిల్లవాడికి గూడా ఆయేడే పెండ్లిగావటం జ్ఞాపకంవచ్చి "సుబ్బమ్మ గారూ! మీకోడలికి శ్రావణపట్టీ తీసుకపోరా"అన్నాడు పంతులు.

"మాయింట శ్రావణపట్టీ లేదండీ!"అన్నది సుబ్బమ్మగారు.

పాపయ్యపంతులు కామాట ఆప్యాయకరంగా వినిపించింది. "ఏమిటీ? మీయింట శ్రావణపట్టీలేదూ? లేకుండాఉండటం కద్దూ?" అని సంతోషంతో అడుగుతూ "ఏమేవు! విన్నావా? వీరియింట శ్రావణపట్టీలేదుట. విన్నావా?"అని భార్యకు కేకవేసిచెప్పి "ఏమండీ! మీకెందుకు లేదండీ?" అన్నాడు సుబ్బమ్మగారితో. "ఏవో పెద్దకాలపు వాళ్లదంతా అమా యకపుపనులుగావండీ! పూర్వమెప్పుడో మామామగారి మేనత్తకు మూడేండ్లదానికి పెండ్లి చేస్తే ఆమెచేత నోముపట్టిద్దామని అన్నీయత్నం చేసిందట తల్లి. అత్తవారు శ్రావణపట్టీ గూడా తెచ్చేరట. ఈ విధంగా మంగళగౌరును పెట్టుకోవాలనీ ఎంతోమురి పెంతోఉంటే ఇంతలో యింకానోము పూర్తిగానోచుకొని ముత్తైయిదులకు వాయినాలైనా యివ్వకముందే – చక్కగా తలంటిపోసుకొని ఆడుకుంటున్న పిల్లకు - ఆకస్మికంగా యేదో వాయువువచ్చి మెలికలు తిరిగి క్షణంలో చచ్చిపోయిందట. సరిగా శ్రావణమంగళవారం నాడే, శ్రావణపట్టీతెచ్చినప్పుడే యీఆపద తటస్థించడంచేత అప్పటినుంచీ మాయింట శ్రావ ణపట్టీ కోడళ్లకు తీసుకపోవడంగాని, ఆడపడుచులకు తీసుకోడంగాని మానేశారట. పిల్ల

# గులాబీల శ్రావణంబరుగుదెంచె

కర్రా వేంకటసుబ్బారావు చౌదరిగారు

సీ. పవలె చీకటియనుభ్రాంతి కాటుకపొగల్
దలపింపఁజేసెడి జలదములును
జలదసంఘర్షణజనిత ఫెళాఫెళా
ర్భటికి నాట్యముఁజేయుపక్షిగములు
పక్షిగములగని భయమునతారుచు
బారుచుండెడు త్రాచుబాముసమితి
త్రాచుబాముసమితిఘాటికోర్వక హద్దు
మరచిబర్వెడు పిల్లమారుతంబు

గీ. మారుతంబేగుదెంచి నామదిగలంచి
పరిమళంబుహరించి నన్ భంగపెట్టు
ననెడిభీతిని గృహలక్ష్మి నాశ్రయించు
అల గులాబీలశ్రావణంబరుగుదెంచె.

సీ. తనమహోజ్జ్వలకాంతికిని సిగ్గుజెంది శం
పాలతాంగి యదృశ్యఫణితినేర్వ
తనరెమొయారపునడల్గని మరాళంబు ది
గ్భ్రమను భారతభూమిబాసిపోవ
తనతనుమధ్యమంబునకు నసూయ కే
సరి యాఫ్రికాటవి సంచరింప
తనగానరక్తిమకును దద్దరిల్లి పి
కాంగన గొంతుకకట్టుబడగ

గీ. తమకమున వరలక్ష్మివ్రతమ్మునర్ప
చెలులజేరెడు గృహలక్ష్మి చెంతజేరి
కమ్మతావులజిమ్ముచు గరువబడెడు
అల గులాబీలశ్రావణంబరుగుదెంచె.

# శ్రావణప్రకృతి

## చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

పరాత్పరుడు నిష్పక్షపాతి. ఆతనిపరిపాలనము క్రిందనున్న ప్రతివస్తువు కాలానుసరణముగ మారుచుండును. ప్రతిజీవితము కష్టసుఖముల కాలవాలము.

అది శ్రావణమాసము. కాలము సాయంసమయము. మంగళవారము. ఆర బూచినగన్నేరులట్లు; చిగురుచేలాంచలములు ధరించిన మామిడిగున్నలట్లు; రంగు రంగు చీరెలుగట్టి, రమణీమణులు పేరంటమూడ వీథిని నడయాడుచున్నప్పుడు:— వసంతునికౌగిట వన్నెలు జిల్కుచున్న వనమే కదలిపోవుచున్నట్లు దోచెను!— అరుగుదెంచుచున్న అరుణకిరణుని కాతిథ్యమీయ పశ్చిమదిశాంగన చెంగావి చీరగట్టి శృంగారించుకొన్నది. పక్షులు ఐక్యకంఠమున మంగళహారతి పాడుచున్నవి.

నాల్గునిముసములు గడచినవి. చక్కదనమునకిరవైన చందమామ కానుపించెను తూరుపుకనుమయందు.— తెల్లచీరెగట్టి కుసుమకోమలి చిట్టచిటారు కొమ్మపై గూర్చుండి చిరునవ్వునవ్వినది. చిగురుటాకులు సంతసమున చిందులు ద్రొక్కినవి. ఎచటగాంచినను కోలాహలమే—ప్రకృతికాంత ఇపుడొక సౌందర్య దేవత—ఇది శాశ్వతమా?

నాల్గునిముసములు గడచినవి. సుధాకరునిపై కారుమబ్బుగ్రమ్మినది. వియోగభరమున ప్రకృతికాంత నల్లనిముసుగు పెట్టినది.—ఇంతలో ఝంఝా మారుతము—చిట్టచిటారుకొమ్మనున్న కుసుమమునకు దళములూడి పోవుచున్నవి. —ఒకటివెంట వేరొకటి—వృంతము బీటువారినది—శిరమున ధరింపవలసిన పుష్పము మంటిలో మాయమైనది—వెన్నువిరచి నిలచియున్న వృక్షములు మన్నుగరచినవి—జోరునవర్షము—చిమ్మచీకటి—ప్రకృతికాంత ఇపుడొకశోక దేవత.

మానవుడా! ప్రకృతిమాతకన్న నీవు ప్రజ్ఞావంతుడవా? నీజీవితమను నౌక కడ్డముగా కడగండ్లగుండ్లెన్ని కాలవాహినియందు గలవో చూచితివా?

రెప్పపాటుకాలములో రానున్న శుభాశుభముల నరయలేని దేహికేటి కీమిడిసిపాటు?

లందఱూ ముచ్చటగా నోచుకుంటుంటే మేముగూడ నోచుకుంటామని చిన్నప్పుడు మా పిల్లలూ, మామనుమరాళ్లుగూడ గోలచేశేవారు. కాని నేను నోమించలేదు. ఏనోమన్నా నోమించుగాని శ్రావణమంగళవారం నోముమాత్రం నోమించబోకని మాఅత్తగారు చచ్చేదాకా పదేపదే చెప్పుతుండేవారు. నాకూ అదే అనుమానం. పెద్దవాళ్లమాటకాదని నోముపట్టిస్తే కాలునొచ్చినా కన్నునొచ్చినా అదిగో చూచావా అచ్చుబడిగాని నోముపట్టించింది, వాళ్లకిట్లావచ్చిందని లోకులు నన్నుదూషిస్తారు అని ఊరుకున్నాను." అన్నదామె.

"ఎంత అదృష్టవంతులండీ! సుబ్బమ్మగారు! మాకుగూడా యేయిబ్బందిచేతనైనా యీశ్రావణపట్టీ లేకుండాపోయిందికాదు. చస్తున్నాను మాఆవిడచేతులో. ఇప్పుడు నూరు రూపాయలు కర్చుపెట్టి శ్రావణపట్టీ తీసుకపోతేనేగాని వల్లగాదని కూర్చున్నది." అన్నాడు పంతులు.

మహాలక్ష్మమ్మ సావిట్లోకూర్చుండి పెనిమిటిచేసేప్రసంగమంతావిన్నది. ఆమెకు ఒళ్లు మండిపోయింది. "ఉప్పో ఊదురో అంటూ ఒకబిడ్డనుపెట్టుకొని కాలక్షేపంచేస్తుంటే మీ శ్రావణపట్టీకోసం యేయిబ్బందైనావచ్చి మాకుగూడ తప్పలేదంటున్నారా! మీరు పంపితే పంపండి లేకపోతేలేదు. కాని ఇటువంటి అవాచ్యాలుమాత్రం పలుకబోకండి. ఏమి? సుబ్బంపిన్నీ! శ్రావణపట్టీ యింటఉన్నవాళ్లు పంపుకోరూ?" అన్నది మహాలక్ష్మమ్మ. "పంపుకుంటారు. ఉన్నవాళ్లుపంపుకోక మానుకుంటారా? ఎంతవైభవంగానైనా పంపుతారు. మొన్నఅబ్బాయికి ఆషాఢపట్టీగూడ పంపినట్టున్నారు. శ్రావణపట్టీ పంపకపోతె బాగుంటుందా?" అన్నది సుబ్బమ్మగారు.

"నేను చెప్పేదిగూడా అదే, సుబ్బమ్మపిన్నీ! డబ్బు చూచుకుంటే మర్యాదయెట్లా దక్కుతుంది?" అన్నది మహాలక్ష్మమ్మ.

మహాలక్ష్మమ్మాసుబ్బమ్మలమాట ఒక్కటైంది. పాపయ్యపంతులు కిక అవును కాదనడానికి అవకాశంచిక్కలేదు. అందువల్ల బొమలుముడివైచుకొని విసుక్కుంటూ ఊరుకున్నాడు.

౪

మాయింట శ్రావణపట్టీలేదనే ఒక్కమాటతో శ్రావణపట్టీ సున్నచుట్టుదామనే ఆలోచనతో పాపయ్యపంతులూ, ఏవిధంగా శ్రావణపట్టీ కోడలికిపంపించి మాటదక్కించుకుందామనే యోచనతో మహాలక్ష్మమ్మా ఆరాత్రి వేగించేరు. తెల్లవారగానే వియ్యంకుడికి ఉత్తరం వ్రాయడానికి కార్డుతెచ్చి దగ్గరపెట్టుకున్నాడు పాపయ్యపంతులు. మొగుడు కార్డుతేవడం చూచి యికశ్రావణపట్టీ పంపించడం పట్టిదనుకున్నది మహాలక్ష్మమ్మ. ఆమాట తలుచుకుంటే ఆమెకు సహింపరానివేదన కలిగింది. మొగుడిమీదకోపంవచ్చింది. ఆయన లోభగుణంమీద అసహ్యంవేసింది. కోడలికి శ్రావణపట్టీ పంపవలెననే తలంపు రెట్టించింది.

"కాని యెట్లాపంపుదాము? ఏమిపంపుదాము? నగదుగానా? వస్తురూపకముగానా"? అని యించుకయోచించింది. పాపయ్య పంతులు యేదోపనిమీద అప్పుడే బయటికివెళ్లేడు. ఇనుపపెట్టెతాళంచెవులు గదిలో మూలగా వంకెనే ఉన్నాయి. దానిమీద యీగగూడ యెప్పుడువాలియెఱుగదు. మహాసాధ్వియగు మహాలక్ష్మమ్మ వాటినెప్పుడూ స్పృశించి యెఱుగదు. ఆనమ్మికచేతనే పాపయ్యపంతులు వాటిని యింట్లోనే ఉంచుతాడు. మహాలక్ష్మమ్మవాటిని తీసిచటుక్కున యినుపపెట్టె తెఱచి తటుక్కున యేదోబయటకుతీసింది. తలుపుమూసింది. తాళంచెవులు యథాస్థానం చేరినాయి. మహాలక్ష్మమ్మ దొడ్డిదోవను అన్నగారియింటికి వెళ్లివచ్చింది.

*

శ్రావణమంగళవారం వెళ్లిపోయింది. దానితో శ్రావణపట్టీ గడబిడగూడా వెళ్లిపోయింది. మాయింట శ్రావణపట్టీ యిచ్చేమర్యాదలేదనీ, మేముతెస్తామని యెదురుచూడవద్దనీ, ఇష్టమైతే మీకొమార్తెచేత నోముపట్టించుకోవచ్చుననీ పాపయ్యపంతులు వియ్యంకుడికిపేర ఉత్తరంవ్రాసి పాఱేసి నిశ్చింతగాఉన్నాడు. మహాలక్ష్మమ్మగూడా కలకదేఱిన చిత్తంతో నిమ్మళంగాఉంది. ఆమె ఏమిపంపిందో? పాపయ్య పంతులు ఎన్నాళ్లకు తెలిసికొనగల్గెనో?

## వధూశ్రీ

వేంకట కాళిదాసు కవులు

౧

కలువలనేలుకన్నుల వికాసములేర్పడ, లేఁతనవ్వుపూ
మొలకలు మోవిపై సొగసుపూయ, నవారుణకాంతి పూవచె
క్కులమెరుఁగొంద, మార్గములకున్ జెలువమ్ములఁగూర్చుచున్న యీ
యలరులమేలుబంతుల రొయారపుఁజిన్నెలు దర్శనీయముల్.

౨

శ్రావణమోహనాంబుదపరంపరలన్ మెలమెల్లజారు ము
క్తావళు లీసుధాప్రణయహాసినులం దొలిముద్దువెట్టి తృ
ష్ణావివశంబులై యిలకుజారునొ, కాక తదీయకంఠమా
లావలయమ్ములై తళతళల్ గలహారములందు దాఁగునో.

౩

ప్రేమతపస్వినుల్ మొగలిరేకులనల్లిన మోహనాంబుద
శ్యామలకోమలాలకము లందమునింపఁగఁ, బాదయుక్తభూ
షామృదుమందగానములు శ్రావ్యములై ప్రమదంబుఁగూర్పఁగా
నోములునోఁచుకోనరుగు నూత్నవధూజనముల్ శుభాకృతుల్.

# ఇంకెందుకు ఇల్లు?

కవికొండల వేంకటరావుగారు బి. ఎ; బి. యల్.

"శెనగలు అంగడిలో అమ్ముతారు. శెనగలు పొలంలో పండుతాయి. శెనగలు నీవట్టుకొచ్చేదేమిటి? నేనేకొనుక్కొని నేనేపండించుకొని ఏపకోడీలో, ఏపాళోళివో చేసికొని నీకు పెట్టకుండా తింటానుచూడు" అన్నాడు త్రివిక్రమరావు. అంటే అతనిభార్య విజయలక్ష్మి "నేను తెచ్చే శెనగలకు మీరు తెచ్చే శెనగలకు సహస్రంవారుంటుంది. వెళ్ళి తెచ్చేబుద్ధి పుట్టాలినాకు. ఎంచేతో ఈ యేడు పేరంటానికి వెళ్ళడమంటే బుద్ధి పుట్టడంలేదు. మీరు వండబోయ్యే పిండివంటతిని యింట్లోనే కూర్చుందామనివుంది" అంది.

అపొద్దు శ్రావణమంగళవారం. అంతకుపూర్వం ఎంతసేపట్నుంచి భార్యాభర్తలిరువురూ అలాతర్కించుకుంటూ కాలంవెళ్ళబుచ్చేరో ఎవరికీ తెలియదు. అప్పుడే తపాలాబంట్రోతు "ఉత్తరాలొచ్చాయండో" అని తలుపుసందంట పడేసి వెళ్ళిపోయినాడు. ఆ యుత్తరాలు మూడోనాల్గో విజయలక్ష్మి తీసి తిన్నగా తెచ్చి త్రివిక్రమరావు చేత పెడుతూ "దీనికి బిళ్ల లేదేమిటండి?" అని అడిగింది. "దేనికి?" అని త్రివిక్రమరావు "తపాలాబంట్రోతు ఉత్తరాలుతీసికొనివచ్చినాడూ అంటే 2 ఘంట లపరాహ్ణంతిరిగిందన్నమాటే. కాఫీకి 'స్టవ్' అంటించేవుకావింకా?" అని "దీనికా?" అని ఆమూడునాలుగుత్తరాల్లోనూ ఒక కవరు తీసి ఇటూఅటూ చూచి "బిళ్ల లేకపోవడమే కాకుండా అసలంటించినూడాలేదు. బహుశా ఊళ్లోవాళ్లెవళ్లో టీకి పిల్చివుంటారు" అన్నాడు. "మిమ్మల్నీ నన్నూ గూడానా? మిమ్మల్నేనా?" అంది విజయలక్ష్మి. "నన్నొక్కణ్ణే అయ్యుంటుంది. నిన్నుపిల్చేవాళ్లంతా నన్ను పిలుస్తున్నారా? నిన్నమధ్యాహ్నంనుంచి చూస్తా గుమ్మంఎక్కేపడుచు దిగేపడుచు నీకు బొట్టెట్టి శెనగలకు రమ్మనమనడమేగాని నన్ను పిలవడంవుందా? అలాగే నన్ను పిల్చేస్నేహితులున్నా" అన్నాడు త్రివిక్రమరావు. "ఇంతకూఅది పిలుపవునో కాదో చూడండి. వట్టినాటకప్పేపరేమో? అప్పుడే ఆనేసెయ్యకండి. ఆఁఏమి ఆకులుకు?" అంది విజయలక్ష్మి. త్రివిక్రమరావు మందహాసంతో "నీవన్నాక 'టీ' కి కాక చుట్టోఅందు కవుతుందా అది?" అన్నాడు. "అయితే 'స్టవ్' వెలిగించనక్కఱలేదు. నేను పేరంటానికి వెళ్లిపోవచ్చునన్నమాటే" అంది విజయలక్ష్మి. "అయితే యింటికి తాళం నువ్వేసుకొనివెళ్లి నాకు తాళంచెవి యివ్వడమా? లేక తాళం నేనేసుకొని వెళ్లి నీకు చెవియివ్వడమా? యోజించు" అన్నాడు త్రివిక్రమరావు. "ఎవరిముస్తాబుముందైతే వారు ముందువెళ్లి పోవడం. రెండోవారు తాళంవేసికొని తాళాలుకూడా పట్టుకుపోవడం. తాళాలుపట్టుకుపోయినవాళ్లు తిరిగి వచ్చేదాకా తాళాలు పట్టుకెళ్లనివాళ్లు కనిపెట్టుక్కూర్చోవడం" అంది విజయలక్ష్మి.

"మొగాణ్ణి నాకు ముస్తాబేమిటి" అని త్రివిక్రమరావు చెవులపొట్టిమెడచొక్కాతొడుక్కొని దాని మీద్నోఖండువావేసికొని కాళ్లకో అకుచెప్పుల్జోడు తగిలించుకొని చేతిబెత్తం మూలనున్నదాన్నట్టే అందుకొని రంయిని వెళ్లిపోయినాడు తనకొచ్చిన తక్కిన వుత్తరాలు చూచుకుంటూ, చేతులూచుకుంటూ.—విజయలక్ష్మి ఆవడుతూవున్న భర్తకేసిచూస్తూ "మొగవాళ్లెంతకైనా స్వేచ్ఛావిహారులు. పక్షుల్లాగే ఒక్కనిముసంలో ఎగిరి పోగలరు. ఆడవాళ్లు కబుర్లేగాని కాళ్లగొలుసులు, చేతుల వంకీలు త్రిప్పుకుంటేనేగాని సరుదుకుంటేనే గాని కదల్లేరు." అంటూ తలుపులోపల గెడపెట్టుకుని గదిలో పెట్లోచీర తీసికోబోతూంది. చటుక్కున వీధితలుపెవరో గాజులమ్రోతతో తట్టినట్టయింది. "ఎవరమ్మా?" అంది విజయలక్ష్మి. "నేనూ" అంటూ దీర్ఘంతీసింది అవతల ఎవరో. విజయలక్ష్మి సరభసంగా వీధితలుపుతీసి "ఓసి! గోపీ! నువ్వాటే? ఎవరోఅనుకున్నాను. శ్రావణమాసం శెనగలకు పిలవడానికేనావచ్చేవు? వస్తున్నా. నీవెనకాలే వస్తున్నా" అంది.

విజయలక్ష్మి హడావిడిచూచి గోపి మరేంమాటాడలే. ఆవిడంతహడావిడిగా వస్తున్నావనకపోతే అనుండేది "నిన్న రాలేక పోయాను. అన్నిళ్లూపిల్చుకుని దగ్గరెల్లుగదా మీయిల్లు ఎప్పుడు పిల్చినా పిలవొచ్చు నను కోవడంలో రాత్రి ఎనిమిది తొమ్మిదై పోయింది—" అనిఏమేమో గోపి అనుండేది. కాని విజయలక్ష్మి హడావిడిచూచి గోపి మరేంమాటాడలే. వెళ్లిపోయింది.

గోపి మరేంమాటాడకపోయినా గోపిని గురించి ఓమాటమనం అనుకోవలసివుంది. "గోపి" అని ఆ అమ్మాయి నెవరినో విజయలక్ష్మి పిలిచిందికదా అని మనంఅంతా "గోపీ!" అని పిలువకూడదు. ఈపైని చదువకూడదు. ఆ అమ్మాయిపేరు గోపెమ్మ. పదారేళ్లుంటాయి. కాని ఆ అమ్మాయికి తల్లిదండ్రులు శారదా శాసనాన్ని అనుసరించి పెళ్లిచేయడంవల్ల ఆరోజే కొత్తగా శ్రావణమంగళవారాల్నోము పట్టింది. పిలుస్తూం దందల్నీ పేరంటానికని—ఎవరూ ఏమీ ఆశ్చర్య పోవడానికేముంది అందులో. ఆపిల్లా అందరిలాగే పిలుచు కుని వెళ్లింది ఇంటింటా. కాని ఇంటింటా అమ్మలక్కలు మాత్రంగుసగుస లాడుకోవడంమానలే. "శారదాశాసనంక్రింద పెళ్లిచేసికొన్నా పెనగలవాయనం శ్రావణశుక్రవారాల్నోములూ ఎప్పట్లాగే చేసికోవచ్చును. వాటికి నిషేధంలేదుగా" అని ఒకముత్తయిదు అంటే "శారదాశాసనం క్రింద పెళ్లిచేసుకుంటే బిడ్డలుట్టరా? వాళ్లకు సంసారంవుండదా!" అని మరోముత్తయిదు—

విజయలక్ష్మికి పైమాదిరిగా వితర్కింపులోపడ్డానికి అవకాశంలేకపోయింది. పిల్చింది తడవుగా పేరంటానికి వెళ్లిపోవడానికి కాలంకటాకటీగావుంది. గబుక్కున ముస్తాబుఅయి తలుపు తాళంవేసికొని తాళంచెవి చెంగునే కట్టుకొని శింగురంగామని రాజమార్గాన్నే పేరంటానికి బయలుదేఱుతూ "అలస్యంగాపిల్చిన వాళ్లింటికి అలస్యంగానే వెళ్లాలా? అలస్యంగాపిల్చినా దగ్గరెల్లు అని ముందుగా వెళ్లాలా?" అని ఒకచూపుమాత్రంగా ఆలోచించి తన భర్త త్రివిక్రమరావు వెళ్లిన దిక్కు అదే, అటేగోపెమ్మ గారియిల్లూను, పోనీ గోపెమ్మగారియింటికే వెళదాము అని చెప్పశక్యముగాని ఒకానొకతాత్కాలికకారణంప్రేరేచగా విజయలక్ష్మి తుట్టతుదకేలా అయితేం గోపెమ్మ గారింటికే మొట్టమొదట పేరంటం చెయ్య డానికి నిశ్చయించుకుంది. నిశ్చయించుకొని గోపెమ్మగారింటికి వెళ్లింది.

లోపలిచావడిలో చాపలు పరిచినారు. ఆచాపలమీద వచ్చేపేరంటాండ్రను కూర్చోబెట్టి గోపెమ్మ తల్లి సెనగలుఇస్తూ పంపిస్తూంది. ఆచావడి కోప్రక్కగా ఒకగదివుంది. ఆగదిలో మగవాళ్లు ఇష్టాగోష్టిగా కాలక్షేపంచేస్తూవున్నట్టు సూచనగా చావడిలోనికి వినబడుతుందేగాని కనబడదు. ఏమాఅంటే గదితలుపు ఈవలమూసి గదిఅవలి గుమ్మంవీధి చావడిలోనికి అదిపే జారగా తెఱచి వుంచినారు. వీధంట వచ్చేఆడవాళ్లు లోపలి మగవాళ్లకు కనబడేటట్టు, లోపలిమగవాళ్లుమాత్రం ఎవరికీ కనబడనట్లు. —

విజయలక్ష్మి కానేపు కూర్చోవడంలో గదిలో మగవాళ్ల ఇష్టాగోష్టినడుమ తన భర్త కిచకిచమనినవ్వు తూండడంవింది. "ఎవరైనా ఉన్నారా ఏమిటి అక్కడ?" అని అంది విజయలక్ష్మి గోపెమ్మను కొంచెం దగ్గఱగా పిలిచి. గోపెమ్మ "మీఆయనా మాఆయనా, అంతే, ఇంకెవరూకారు" అంది. "అయితే త్వరగా పోవాలమ్మా! గోపెమ్మా!" అంది విజయలక్ష్మి.

ఆమాటవింటూ "ఇంటితాళం ఇలాఇచ్చి మరీవెళ్లు. ఎన్ని ఇళ్లునీవు తిరిగిరావాలోఇంకా?" అన్నాడు త్రివిక్రమరావు. "ఎక్కడికో 'టీ' కివెడతానన్నారుగా!" అంది విజయలక్ష్మి. "ఇక్కడికే" అని తలుపు బార్లా తీసివేసినాడు త్రివిక్రమరావు.

గదిలో మేజాబల్ల. మేజాబల్లమీద తెల్లనిగుడ్డ. తెల్లనిగుడ్డమీద పళ్లాలు, కూజాలు, గిన్నెలు, గరిటెలు; వాటిల్లోపళ్లు, రొట్టెలు, పకోడీలు, తియ్యబూంది, కారాబూంది ఒకటేమిటి అన్నీవున్నాయి.

త్రివిక్రమరావు అడిగేడు విజయలక్ష్మిని వెంటనే "చూడు మగవాళ్లకు శ్రావణమంగళవారపు వాయనం ఏలావుందో?" అని ఒక పకోడీతననోట్లో వేసికొన్నాడు. గోపెమ్మ "అలాంటప్పుడు మానకూడదు. నీవు కూడ కూర్చునితినాలిసిందే. చూడు నేనెలాకూర్చునితింటానో" అని తన భర్త దగ్గఱగా కూర్చుంటూ విజయలక్ష్మినిలాగింది.

విజయలక్ష్మి జంకక కూర్చుంటూ "నన్ను కూడా తేనీటికే పిలువక పెనగలవాయినానికని ఎందుకు పిల్చేవు?" అంది. "ఆపిలుపు మాఆయనది. ఈపిలుపు వాడి" అంది గోపెమ్మ. "అలా అనకు" అంది విజయలక్ష్మి. "వాడి శ్రావణమంగళవారప్పిలుపు. మాఆయనది సంఘసంస్కరణప్పిలుపు అని అను" అంది. త్రివిక్రమరావు అన్నాడు "రెండూమిళితమై యున్నాయి ఈపకోడీల్లో. ఏమమ్మా! గోపెమ్మా! అవానవోసిన పెనగలు రుబ్బి చేసినవేగా ఈపకోడీలు? గోపెమ్మ "ఏమో చిన్నపిల్లను నాకవన్నీ తెలియవు, తినడమేగాని" అంది: అని ఒక పకోడీతననోటిలో వేసికొంది. గోపెమ్మ పెనిమిటి "తెలియదనకుమతే. పండ్రెండేళ్లప్పటి పెళ్లిపడుచులు వాయనమిస్తే పెనగలువాయనమియ్యాలి. పదారేళ్లప్పుడు పెళ్లిఅయియుంటే టీపార్టీ చెయ్యాలి అని అనలే నిన్నను నీవు?" అని అంటూ గిన్నెలోనికి తేనీటికషాయంపోసినాడు గోపెమ్మచాలుచాలనేలాగు. చావడిలోనుంచి సర్వసామాన్యపు పేరంటాండ్రంతా గోపెమ్మతల్లి వాయినాలిస్తుంటే పుచ్చుకుంటూ ఊతొంగి చూడ్డం, విజయలక్ష్మమ్మకూడ వాళ్లల్లో కలిసి పోయిందనుకోవడం, విజయలక్ష్మి త్రివిక్రమరావు కేసి చూస్తూ తన చెంగుతాళంచెవి కావలిసొస్తే విప్పుకోమనడం......

త్రివిక్రమరావు "ఇంటికిరావు నీవు?" అన్నాడు. భార్యకేసిచూస్తూ విజయలక్ష్మి "ఇంకెందుకు ఇల్లు? పెనగలు నేనింటికి పట్టుకుని వెళ్లి వేయించనక్కఱలేదు. ఒలువనక్కఱలేదు. రుబ్బనక్కఱలేదు. మీకుపెట్టనక్కఱలేదు. నేతినక్కఱలేదు. ఇంకెందుకు ఇల్లు?" అంది. పకపకానవ్వుకున్నారు అంతా.

## పావనంబైనమాసంబు శ్రావణంబు

కొమ్మూరి భోగలింగాచార్యగారు

దేశాలవెంబడిఁ దిరుగాడుజనముల
  మనములమరలించు మాయకత్తె
ప్రకృతిసౌందర్యంబు పరికించువారల
  మోదంబునందేల్చు ముద్దరాలు
పచ్చపైరులపైని పర్వెత్తుగాలుల
  రమణీయకతఁజూపురాణిగారు
ప్రతిదినంబునుకష్టపడిజీవనముసేయు
  హాళికాళికిఁదగు నాటవిడుపు
నూతనప్రేయసీదర్శనాతురులగు
  క్రొత్తయల్లుండ్రపాలిటి కులుకులాడి
కామినులశుక్రవారంపునోములొసఁగు
  పావనంబైనమాసంబు శ్రావణంబు.

## వాయనమ్ములకేతెంచు వనితలరుగో!

శ్రీమతి కోట సుబ్బులమ్మగారు

చిఱివేరుసింగారజిల్గుచీరెలతోడ
  నవయువమ్ములుచాల నందగింప;
కోరికబఱగించి నోరచూపులఁజూచు
  వారినెమ్మది మదులూరఁజేయ;
కమనీయతరకరకమలమందు శనగ
  మూట లనుపమమై ముదముగూర్ప;
గమనవేగంబునఁ గడుసుందరంబైన
  కాళ్లయందెలు ఘలుఘల్లురనగ;
నసుముదూగాడ నొయ్యారినడకతోడ
సఖులుగొనియాడ వదినెలు సరసమాడ
జిఱునగవుమోములందున జిందులాడ
వాయనమ్ములకేతెంచు వనితలరుగో!

# వర్షాగమము

విద్వాన్

వారణాసి

సూర్యనారాయణశాస్త్రిగారు

౧

గ్రీష్మభీష్మాతపంబుల గిడసవాఱి
దాహతీర్థము దొరకెడు దారిలేక
యెదురుచూచెడు నీరాక కెల్లజగము
స్వాగతము! శ్రావణాది! వర్షాగమంబ!

౨

చాతకము మాటికిని దసజాడలరయ
నాడుచుండఁగఁ బురివిప్పి యల్లనెమిలి
శక్రచాపము దాల్చె నీజలదభటుఁడు
రమ్ము! వడిఁ దొల్కరింపు! వర్షర్తురాజ!

౩

నాఁగలియు, నెడ్లు, కూలీలు, నారు, బోదె
సిద్ధపఱిచినవాఁడు కృషీవలుండు;
జాగుచేసిన సైరింపఁజాలఁ డతఁడు:
అవతరింపుము వేగ వర్షాగమంబ!

౪

చాఁపులోదవించుఁ బూవులుకాయలిచ్చు
వెన్నెలలు తేర్చునేకాని నిన్నుఁబోలి
యాఱుఋతువులఘనతఁ దానధిగమించి
ప్రాణికోటులకేది జీవనమొసంగు?

౫

కాలఁద్రోచియు గర్జించి తాలఱువ్వి
పిడుగులనుమోది తిప్పలు పెట్టిపెట్టి
ప్రజలమోమ్మికిఁ దుద సస్యఫలములొసఁగు
నీయుదారత మెచ్చరే నీతివిదులు?

# అమృతవర్షము

శిరోమణి

వారణాసి

గంగాధరశాస్త్రిగారు

౧

ఘనఘోష మృదంగాది
ధ్వనియును, దటిదధికదీపపంక్తియుఁ బ్రజకున్
గనవలయుదృశ్యమియ్యది
యనుతలఁపును గలుగఁజేయు నధికాసక్తిన్.

౨

గగనరంగస్థలంబునఁ గానవచ్చె
పాత్రమింపారఁ దొలకరిసూత్రధారుఁ
డఖిలరససంయుతంబగు నమృతవృష్టి
దృశ్యమని యాతఁడల్లనఁ దెలిపిపోయె.

౩

వరుసబుష్కలావర్తకవంశ్యులైన
నటులు స్వస్వానుగుణరూపపటిమ మెఱయ
నభినయించిరి ప్రేక్షకస్వాంతవీథి
నమృతవాహిని వఱదలై యలరునట్లు.

౪

రసికజనులకు శృంగారరసమయంబు
విరహవిధురుల కెంతయుఁ గరుణమయము
సర్వభూతావళికిబహుశాంతియుతము
రసనులకు నాలవాలమైయొసఁగెనద్ది.

౫

అమృతవర్షావలోకనానందమునను
దమకృతజ్ఞతఁ దెల్పె సజ్జనగణంబు
సరసముక్తాఫలాదిసంతతులనిచ్చి
భళిర! కొనియాడి రప్పు డప్పతులు నటుల.

# కమల నోములు

సామవేదం జానకిరామశర్మగారు

౧

"మావాళ్లపై మీ కామాత్రము దయకూడదా? పోనిండు. మొదటినుండియు మీకిట్టి ప్రేమయే."

"(నవ్వుచు) అదిగో! నీకప్పుడే కోపమువచ్చుచున్నది. నానోటినుండి మాటపొంతముగ రానీయవు గదా?"

"పొంతముగనా? పలుకులెందుకు. ఎంతచెప్పినను తహశీలుదారు శెలవిచ్చినాడు కాడని యేగా."

"అవును. ఒకపట్టున కాతడొప్పుకొనెనా? ఉన్నదానికి లేనివి కొన్నిచేర్చి పల్కినమీద—"

"చివరకు సమ్మతించెనా?"

"ఆఁ, మీనాయనగారు వ్రాసిన రెండు ఉత్తరములను చూపించినపైన, నేమియుననలేక, తిరిగిమూడు రోజులలో తప్పక రావలెనని శెలవు మంజూరుచేసినాడు."

"(సంతసముతో) నిజమే? ఏమో? మీహాస్యము లొకకొన్ని."

"హాస్యములుకాదు. తెల్లవారుఝామునైలునకే వెళ్లుట మంచిది. ఆపైన నీయిష్టము. నన్ను నడుగవలసిన పనిలేదు. పెట్టెసర్దుము." అని విశ్వనాథ మనసూయతో చెప్పి గదిలోనికేగి పరుండెను.

విశ్వనాథము రాజమహేంద్రవరమున తాలూకాఫీసునందు గుమాస్తా. నెలకు 35 రూపాయలజీతము. అనసూయ అతనిభార్య. విశ్వనాథమున కనసూయయనిన ప్రేమమెండు. ఆమెకు సర్వదా సంతోషమును గూర్చుటకై యాతడు యత్నించుచుండును. అనసూయ కాపురమునకు వచ్చిననాటినుండియు అతడామె నొకసారి రెండుసార్లేమి పుట్టినింటికి బంపినాడో, అంతే- విడచిక్షణముండలేదు. నెలకువచ్చుజీతము స్వల్పమైనను ఆరడేలోటును రానీయక పట్టణమువారి పద్ధతులన్నియు సక్రమముగ జరిపించును. అనసూయకు గూడ విశ్వనాథమనిన ప్రాణము. ఆమె యాతనిమాట నెన్నడు నలక్ష్యమొనర్చియుండలేదు. కాని పుట్టినింటికి తఱచుపంపడని యామె కించుక కోపము.

విశ్వనాథ మత్తవారియూరు వసంతవాడ. అతనికి, మామగారగు సీతాపతిశాస్త్రిగారు తమకుమార్తె అనసూయతోడను, మనుమరాలు స్వరాజ్యముతోడను, కమల నోములకు రావలసినదిగ నుత్తరము వ్రాసిరి. దానికి తోడింటిలో ననసూయ చెల్లెలు శ్రావణమాసపు నోములకేగవలయునని యిప్పటికి నెలరోజుల నుండియు మగని బ్రతిమాలుచుండెను. ప్రథమమున విశ్వనాథము వెళ్లుట కుపేక్షచేసెనుగాని, బావమరది కృష్ణమూర్తివచ్చి పిలచుటయు, తిరిగి సీతాపతిశాస్త్రిగారుత్తరము వ్రాయుటయు, భార్యవేడుకోలును యోజించి తన యభిప్రాయమును మార్చుకొనెను.

విశ్వనాథము పెట్టెసర్దుమని యనుటతోడనే అనసూయ కెక్కడలేని సంతసమునువచ్చెను. వెంటనే యామె ఆనాడు చాకలితెచ్చిన బట్టలును, పెట్టెలోదాచిన క్రొత్తచీరెలు రెండును, స్వరాజ్యముగౌనులు, విశ్వనాథము పంచలు, చొక్కాలుతీసి యాతడు పట్నమునుంచి తెచ్చిన క్రొత్తట్రంకులో సర్దెను. అప్పటికి రాత్రిపన్నెండుగంటలైనది. విశ్వనాథమునకు మెలకువరాగా, భార్య యింకను పరుండకుండుటగాంచి "ఇంకను సర్దుడుకాలేదా? పన్నెండుదాటెను" దని కేకనైచెను. ఐనదైనదని జవాబుచెప్పుచు అనసూయ యింటిలోనికేగి బిందెలు వంటసామాను నొకమూలకుసర్ది, స్వరాజ్యమువద్దకువచ్చి పరుండెను.

మూడుగంటలైనది. గదిలోని బిగ్ బెన్ గడియారమలారము కొట్టినది. ప్రయాణము సంతసమున నిద్దురపట్టని అనసూయ అదిపిని భర్తనులేపెను. విశ్వనాథము బైటకేగి యొకపంకెద్దుబండిని పిలుచుకొని

వచ్చెను. అనసూయ నాలుగేండ్లీడుగలకూతురు స్వరాజ్యమును "అమ్మా! తాతయ్యగారూరువెడదాములే" యనిలేపెను. స్వరాజ్యము కళ్లునలుపుకొనుచులేచి "యెక్కడికే, తాతయ్యగారూరా?" యనుచుండగా, విశ్వనాథము బండియెక్కుమని భార్యను తొందరించెను. అనసూయ వీధితలుపునకు తాళమువైచి స్వరాజ్యము నెత్తుకొని బండియెక్కెను. విశ్వనాథమును బండిలోనెక్కి గోదావరిస్టేషనునకు తోలుమని బండివానితో చెప్పెను.

## 2

రేపే శ్రావణమంగళవారము. వసంతవాడలో సీతాపతిశాస్త్రిగారి గృహము నోములహడావిడితో నిండియుండెను. సీతాపతిశాస్త్రిగారు సంపన్నగృహస్థు. ఆయనకు ముగ్గురు కుమార్తెలును, ముగ్గురు కుమారులును గలరు. పెద్దవాడగు కృష్ణమూర్తి యీసంవత్సరమే బి.యే. ప్యాసయినాడు. రెండవకుమారుడు పూర్ణచంద్రుడు స్కూలుఫయినలు పరీక్షలో కృతార్థుడయి యింటివద్దనుండెను. రామమోహనుడూరియందున్న యెలిమెంటరీపాఠశాలలో నాల్గవతరగతి చదువుచున్నాడు.

అనసూయ సీతాపతిశాస్త్రిగారి పెద్దకుమార్తె. రెండవ కుమార్తె కమల. కమలమిగులఅందమైనపిల్ల. చెంపకు చారెడు కండ్లును, కోటేరేసినటులాముక్కు, గుండ్రనిమోము, ఆచలువపరుసయు నామెకందమును గూర్చినవి. కమల కీసంవత్సరమే వైశాఖమాసమున వివాహమైనది. పెళ్లికిపూర్వము పిల్లనుచూచుటకై వచ్చిన ప్రసాదరావు కమలనుగాంచి, కట్నమీయకున్నను, కమలనే వివాహమాడెదనని, కట్నములకై యాశించుచున్న తండ్రినెదిరించి తల్లి నొడబఱచి వివాహమాడినాడు. కమల గ్రామమందలి బాలికాపాఠశాలలో నాల్గవతరగతి చదువుచున్నది. తెల్లవారిన శ్రావణమంగళవారమని కమల యత్యుత్సాహముతో నింటిలోతల్లియగు మహాలక్ష్మమ్మకు పనిసాయమొనర్చుచున్నది. "చద్దియన్నముతినవే"యను తల్లిమాటను లక్ష్యముచేయక కమల దొడ్డిలో నూతివద్ద చెంబులుతోముచు, తాను చెప్పుకొనిన శ్రావణమంగళవారపుపాటను జ్ఞాపకముచేసుకొనుచున్నది. కమలవద్ద చెల్లెలు సీత తానుగూడ చెంబులుతోముచు, "అక్కయ్యా! నేనుకూడా రేపు నోము నోచుకోనా?"యని యడిగెను. కమల నవ్వుచు "అయ్యో! పెళ్లికానిదేనా?" యనెను. దానికి సీత "మరినా పెళ్లెప్పుడే?" యనుచు కోపమువచ్చి యింటిలోనికేగెను.

అప్పటికి తొమ్మిదిగంటలైనది. అనసూయయును విశ్వనాథమును నూజవీడుస్టేషనులో రైలుదిగి గుఱ్ఱపుబండిపై వసంతవాడవచ్చిరి. బండివచ్చి సీతాపతిశాస్త్రిగారి గృహముకడనిలచెను. బండిచప్పుడువిని కమల, సీత, రామమోహనుడును కలసి వీధిగుమ్మముకడకువచ్చిరి. బండినుండి దిగుచున్న అనసూయనుగాంచి సీతపరుగెత్తుకొని లోనికేగి తల్లితో "అమ్మా! అక్కయ్యవచ్చిం"దనిచెప్పెను. తోడనే మహాలక్ష్మమ్మ చేయుచున్నపనినాపివైచి, కూతున కెదురుగవెళ్లి, స్వరాజ్యము నెత్తుకొని "ఎన్నిరోజులకు చూచితినే"యని ముద్దుపెట్టుకొనెను. పిమ్మట అల్లునకు కాళ్లుకడుగుకొనుటకై నీళ్లిచ్చి, క్షేమసమాచారములడిగి "దొడ్డిలోవేడినీరున్నది. స్నానముచేయుదురు గాని, భోజనమునకు పొద్దుపోయినది, లెండ"ని యల్లునితో ననుచుండగా, బజారునుండి సీతాపతిశాస్త్రి యింటికేతెంచెను. సీతాపతిశాస్త్రి కల్లునికూతురను గాంచినంతనే యపరిమితానందముకల్గెను. అల్లుని కుశలప్రశ్నములడిగి, దొడ్డిలో తోడిపియుంచిన వేడినీళ్లతనిని స్నానముచేయుమని సీతాపతిశాస్త్రి తాను నూతివద్దస్నానముచేసెను. పిమ్మట కృష్ణమూర్తియు, పూర్ణచంద్రుడును బయటనుండి వచ్చి బావగారిని హాస్యాలాపములాడినపైని వారందరును భోజనములకు గూరుచుండిరి.

## 3

మరునాడు తెల్లవారుఝాము మూడుగంటలైనది. కమలలేచి "అమ్మా! పూలకోసము వెళ్లనా?" యని తల్లినడిగెను. అంతవరకును మంగళవారముకై కావలసిన పరికరముల నాయత్తమొనర్చుకొనుచూ, నిద్దురలేక

అప్పుడే వెన్నువాల్చిన మహాలక్ష్మమ్మ యామాటకు "చాలు. ఇంతచీకటిలో నేనటే? పరుండుము. తెల్లవార
నే"దనిపల్కెను. కమలలేచిన దూరముకొవక దగ్గరపరుండిన చెల్లెలు సీతను నెమ్మదిగ లేపెను. సీతాకమల లిరు
వురును వట్టింటవెలుగుచున్న లాంతరు నొక్కింత పెద్దదిజేసి మంగళవారవుపాటలపుస్తకము ముందరనైచుకొని
కూనిదీర్ఘములు తీయుచుండిరి. ఐదునిముసములలో నవి పెద్దవికాగా మహాలక్ష్మమ్మ విసుగుకొనుచు లేచి సీతా
పతిశాస్త్రికడకువచ్చి మామిడియాకులు తోరణములకై తెప్పించుడనిపల్కెను. సీతాపతిశాస్త్రి దగ్గరనే
పరుండియున్న పాలేరు పోతడినిలేపి మామిడియాకులకై కృష్ణకాలువగట్టునకు పంపించెను.

కమలపాటలతో నింటిలోనందరును మేల్కాంచిరి. మహాలక్ష్మమ్మ దొడ్డిలోనూతిలోని నీరు వాడుకము
నకై తోడుచుండెను. ఇంతలో ననుకోకుండగ నాకసమున మేఘమొకటి యావరించ నన్ననిచినుకు ప్రారంభ
మాయెను. మహాలక్ష్మమ్మ దొడ్డిలోనుండి యింటిలోనికి తెంచునరికి వర్షమధికమాయెను. అదిగాంచి కమల
"అయ్యో, పాడువాన! పువ్వులు రేల్లాగే"యని దిగులుపడెను. ఆకసముచిల్లులుపడి నట్లావాన కమలపై
కోపగించి రెండుడుక్కులైదుగంటలవరకును కురియుచునేయుండెను.

తెల్లవారినది. వాన వెలిసినది. ఇంతలో కమలస్నేహితురాలు సరస్వతి పూలకైపళ్లెము నొక దానిని
పుచ్చుకొని కమలను పూలకురమ్మనిపిలచెను. వెంటనే కమల పూలకై తానుకూడ యొకపళ్లెము పట్టుకొని
"అమ్మా! పూలకోసము సరస్వతితో వెళ్లుచున్నా"నని చెప్పెను. మహాలక్ష్మమ్మ "పదిలము. జారిపడెదవు.
త్వరగరా"యనెను. కమలాసరస్వతులిరువురును పూలకై గ్రామములోని దేవాలయమునకేగి పళ్లెములనిండు
నట్లు పూలను గోసుకొని యొనిమిదిగంటల కిండ్లకువెళ్లిరి.

సరిగ పదిగంటలకు రామావధానులు కమలకు కల్పోక్తప్రకారము మంగళగౌరీవ్రతము చేయించి
యింకను నాలుగైదుచోట్ల వ్రతముల నెరవేర్చవలెనని తొందరతో వరుగెత్తెను. కమల యాపై తానదివరకు
వల్లెవేసిన మంగళవారములపాట కంఠమెత్తిపాడి, ముత్తైదువకు తోరమును, మంగళగౌరివద్ద జ్యోతులపై
వేసిన కాటుకయును యిచ్చి తానుగూడ తోరముకట్టుకొనెను. సీతాపతిశాస్త్రి అల్లునకు ప్రొద్దుపోవుచున్న
దని తొందరించ పులగమును బెల్లమును మంగళగౌరికి నైవేద్యమిడి, తాము పిండివంటలతో భోజన
ములు చేసిరి.

భోజనములగుటయే తడవుగ కమల పేరంటమునకు బిలుచుటకై గ్రామములోనికేగెను. కమల
గుమ్మముదాటినదో లేదో యొకబట్టతడుపుజల్లువచ్చి వెలిసిపోయెను.

రంగురంగుచీరలధరించి మూడుగంటలకు పేరంటాండ్రు నగలవాయనములకై బయలుదేరిరి. వారితో
పాటనసూయయును, కుమార్తె స్వరాజ్యమును, చిన్నచెల్లెలు సీతను దీసుకొని తానుగూడ బయలుదేరెను.
"అనసూయా! యెప్పుడువచ్చితివే?" యనుచు నామెస్నేహితురాండ్రు కుశలప్రశ్నములడుగుచుండగా,
వారితోగలసి యామె గడపలనెక్కుచు, దిగుచుండెను. మధ్యమధ్య స్వరాజ్యము తల్లికన్న తనకు నగలు
తక్కువిచ్చుచుండిరని మారాముపెట్టుచుండెను. నగలమూట నేను మోసెదనని అనసూయవద్దనుండి సీత
లాగుకొని నెత్తిపై నిడుకొనివచ్చుచుండెను. ఇంటిముందరకువచ్చునరికి బురదలో కాలుజారిపడి సీత నగ
లొలుకబోసెను. అదిగాంచి అనసూయ, సీతను చీవాట్లుపెట్టి పైపైనగలన్నియునెత్తి యింటిలోనికేగెను.

"కమల యింకనురాలేదే! సరస్వతితోగలసి పేరంటమునకు వెళ్లినది. మరల వానవచ్చునట్లున్న"దని
మహాలక్ష్మమ్మయను మాటలో కమల తానొక నగలమూటతో ప్రత్యక్షమాయెను.

౪

"కమలా! పిచ్చిపిల్లా! అత్తగారియెదుట పిగ్గెందులకే? వెళ్లు. వెళ్లమ్మా! దగ్గరకువెళ్లు. తప్పుగాదూ?
వెళ్లమ్మా! వెళ్లి జడవేయించుకో"అని మహాలక్ష్మమ్మ కమలకు హితవొసగుచుండెను. కమలయత్తగారివద్ద కేగుటకు

సిగ్గుపడుచుండెను. కాని తల్లి బలవంతముచే తప్పినదికాదు. కమల వద్దకువచ్చుటతోడనే రమణమ్మగారు జడ వేయనారంభించెను. రమణమ్మగారు జడబిగువుగ వేయుచుండుటచే కమల కష్టముగనుండెనుగాని అత్తగారితో నేమియు చెప్పజాలకుండెను.

సాయంకాలము నాల్గుగంటలు కావచ్చెను. రమణమ్మగారు తామారోజుని తీసుకువచ్చిన శ్రావణపట్టీని కోడలుకిచ్చుటకై పొరుగింటి పేరంటాండ్రిద్దరముగ్గుర బిలిపించెను. పేరంటాండ్రొచ్చిన పైనామె తెప్పించిన రెండుపండ్ల యారటిపళ్లను, స్వదేశీమైకాఅద్దకపు పూలచీరెలు రెండును, రవికెలగుడ్డలును, బంగారు వరలక్ష్మీప్రతిమయు, నాల్గుపేటల బంగారుగొలుసును, పసుపుకుంకుమలు నొక పళ్లెరమందుంచి కమల మోమున బొట్టిడి చేతికందిచ్చెను. పిమ్మట మహాలక్ష్మమ్మకు గూడ రమణమ్మగారు మోమున బొట్టిడి యొక ఖద్దరుచీరయు రవికెలగుడ్డయునిచ్చెను. గడియారపుగొలుసుగాంచినంతనే కమల కెక్కడలేని సంతసమును వచ్చెను. రమణమ్మగారు స్వదేశీచీరల తెచ్చినందులకు వియ్యపురాలేమనుకొనునో యను తలంపుతో తామట్లు తెచ్చుటకు కారణము ఏలూరునందు స్త్రీలొనర్చుచున్న పికెటింగు తీవ్రతయేనని యక్కడనున్న వారితో చెప్పెను. కమల వచ్చిన పేరంటాండ్ర మోమున బొట్టుపెట్టినపిదప నొక కొంతసేపునకు వారిండ్లకేగిరి.

పడమటింటిలోనున్న తల్లి మహాలక్ష్మమ్మదగ్గరకేగి కమల మరునాడు శుక్రవారపునోమునోచుకొనిన పిమ్మట నత్తవారు తెచ్చిన ఖద్దరు చీరెకట్టుకొందునని రహస్యముగ జెప్పెను. దానికి మహాలక్ష్మమ్మ అంత పెద్దచీరెందుకులే, ఖద్దరుపరికిణీ కట్టుకొనవచ్చునులేయని పల్కినమీద కమల తల్లిపైకోపగించిన అత్తగారు చూచుననుభయముతో మారుమాటలేక దొడ్డిలోనికేగెను.

౫

మరునాడు పదిగంటలకు "పాడవే! తల్లీ! పాడమ్మా, పాడు" అని మహాలక్ష్మమ్మ వరలక్ష్మీపూజచేయుచుండిన కమలతో ననుచుండెను. కమల యింటిలోవారెవరున్నను సిగ్గులేక పాడెడిదే! కాని అత్తమామలు నిన్ననే వచ్చియుండుటచేతను, అదివరకామెయెరుగనిసంబంధమగుటచేతను వారియెదుట పాడుట కపరిమితముగ సిగ్గుపడుచుండెను. కాని మహాలక్ష్మమ్మతో పడలేక ఆమె వరలక్ష్మీపాట నిట్లనిపాడెను.

"కైలాసగిరిలోను కల్పవృక్షముక్రింద
ప్రమథాదిగణములూ కొలువగాను
పార్వతీపరమేశ్వరులు, బాగుగా కూర్చుండ
పరమేశ్వరుని యడిగె పార్వతప్పుడూ-
జయమంగళం నిత్యశుభమంగళం.
ఏవ్రతమును సంపదల నెలమితోడుతనిచ్చు?
ఏవ్రతము కామితార్థము లొసంగూ?
ఏవ్రతము పుత్రపౌత్రాభివృద్ధి నొసంగు?
అనుచు పార్వతి తాను హరునడిగెను. జయ.
హరుడు దానికి మిగులహర్షమందుచు తాను
పార్వతీసతితోడపలికెనిట్లు. జయ.
కుండిన అనునొక్క పట్నంబులోపలా
చారుమతియను నొక్క చేడెగలదూ

అత్తమామలసేవ సతిభక్తితోచేసి
పతిభక్తికలిగుండు పరమసాధ్వి. జయ.
దారిద్ర్యదుఃఖాన తానుచింతిల్లుచూ
వరలక్ష్మినీ వేడ వనితపైన
దయగల్గిలక్ష్మితా తప్పకనుస్వప్నాన
వచ్చిచెప్పెను ప్రీతి వర్ధిల్లగా. జయ.
శ్రావణామాసాన శుక్లపక్షమునందు
శుక్రవారమునాడు మునిమాపునా
పంచకలశలతోడ భక్తితోననునిల్పి
పూజచేయుమునన్ను పుణ్యసాధ్వి! జయ.
ఆమాటలాలించి యధికసంతోషమున
లేచి చారుమతీసతి లేపిమగని
స్వప్నవృత్తాంతంబు చయ్యననుయెరిగించి
శ్రావణామాసాన చేసెనోము. జయ.
తొమ్మిదిపోగులా తోరమొప్పగబోసి
వరలక్ష్మికిని యిచ్చి వనితతాను
వేదవిదుడైనట్టి విప్రునీ బిలిపించి
గంధమక్షతలిచ్చి కాళ్లుకడగీ
వాయనమ్మునుయిచ్చి వరలెనపుడు. జయ
వరలక్ష్మితానపుడు ఖరుసతోడుతనిచ్చె
సౌభాగ్యసంతానసంపదలను-
ఈవ్రతముచేసినా యింతులందరికి తా
వరలక్ష్మిచేకూర్చువరములన్నీ. జయ.

రమణమ్మగారు కోడలు పాడగావిని మిగుల యానందించెను. పాటపూర్తికాగానే కమల ముత్తయిదువకు తోరమిచ్చి తానొకతోరము కట్టుకొనెను. ఆపైన వరలక్ష్మిదేవికి బూరెలనైవేద్యమిడి యొకతొమ్మిది బూరెలను బ్రాహ్మణునకు వాయనమిచ్చెను.

అప్పటికే మధ్యాహ్నమగుటచే నందరును ఆలసింపక భోజనము లొనర్చిరి. అనసూయ స్వరాజ్యము, కమల, సీతలకు జడలువైచి క్రొత్తపరికిణీలుకట్టి, తానుగూడ క్రొత్తచీరధరించెను.

సాయంత్రమగుసరికి రాజమండ్రినుండి విశ్వనాథ మనసూయను తీసుకురావలసినదనియు, తానుభోజనమున కిబ్బందిపడుచుంటిననియు వ్రాసిన యుత్తరమువచ్చెను. మరునాడు భోజనములైన పిమ్మట కమల యత్తమామలింటికడపనులుపాడగునని యెంతబ్రతిమాలుకొన్ననుండక తమగ్రామమేగిరి. అత్తమామలేగిన పిదప మిగిలిన రెండుమూంగళవారములును పిన్నపిడచి పాటలతోడను, కథలతోడను కమల యిల్లెగురగొట్టెను.

# పూజ

హరి రాధాకృష్ణమూర్తిగారు

"అమ్మ! యేటికి నిటుల నాయాసపడుచు
చేత నొకపుటినూని యీచెల్లెలెంట
తిరుగులాడెదు వివరాని ధృతిఁజెలంగి
ముండ్లబండ్లను గనక ప్రమోదవగుచు?
ఈనభోమానజలదంబు లేపుమీరి
దినమణినిగూడ బంటుగాదిద్దుకొనెడి—
ఈవు వానినిలెక్కింప కేల బయట
తిరిగెదవు? నీదుకోర్కె సత్వరము చెపుమ.
పాదముల తడబాటుచేఁ బంకిలాంబు
కణిక లీజాళువాపావడను జెలంగుఁ
దనువు లలయంటిచే శుభ్రతనుగనినను
బురదపడ నేలతిరిగెదో? పూవుబోడి!
పుష్పములు నీకువలయునో పుటికనిండ?
పత్రసంతతి వలయునో? పద్మనేత్ర!
తెలుపుమా సాధ్యమైన నే తెచ్చియిడుదు
పూజకర్హములగు వస్తువుల గడించి.
నేఁడు మీయింట శుభమేమి నిశ్చయముగ
తెల్పుమా నీదువదినెను దెత్తురొక్కొ?
యనుఁగుఁజెల్లెలు పుట్టినదినమొ? లేక
చెలులఁగూడి యేవ్రతమైనఁ జేతువొక్కొ?
జ్ఞప్తికివచ్చె శుక్రవాసరము నేఁడు
పున్నమికి దీనికీమధ్య పొసఁగఁబోదు
మఱొకవారంబుగాన నేమంబుమీఱి
లక్ష్మినిభజింతువొక్కొ యుల్లాసమొదవ?
గడచినదినంబె దేవిని గారవించి
వలయుసింగారమొసరించి వలయునట్టి
వస్తువులసేకరించినావా? త్వదీయ
పితరులనుగోరి సంతతావిష్టవగుచు.
మరచితిని మొన్నవింటి నీమామయత్త
వత్తురిటకని, నీకు నుపాయనములఁ
బట్టుకొని వచ్చిరొక్కొ? యేవస్తువులను
దెచ్చినారమ్మ? చెప్పుమా తెల్లముగను.
ధనకనకవస్తువాహనాలను మరెట్టి
వైన గొనివచ్చిరో యింటికైన పెద్ద
కోడలవుగాన, యత్తకుఁ గూర్చునేన
గోడలవుకూడఁగాన యోగుణనిధాన!
అమ్మ! వరలక్ష్మిబోలు దైవమ్ము భువిని
గానరాదమ్మ చూడు నీకామితముల
నెల్లనొడఁగూర్చునమ్మ! యేటేట నీవు
విడువకభజింపు సౌఖ్యమెవ్వేళనమ్మ!
ఏమి కోరంగఁదలఁచితో యీదినాన?
మాతృదేశవిముక్తికై మానసీయ
ముగను యత్నించి చెరసాలఁబొగులునీదు
పురుషు విడిపింపుమని నీవు మ్రొక్కులిడెదొ?
అన్న సర్వకళాశాలయందు పట్ట
భద్రుఁడై చేయుపనిలేక పవలురేలు
తిరుగు గాలికి వానికే తెరవునైనఁ
జూపుమని కోరెదొక్కొ? యోసుందరాంగి!
ముద్దుచెల్లెలుమగనికై మొన్నదనుక
తిరిగి వేసారి నీతండ్రి దిగులుపడియె;
యింటనుండియె నీవు నయ్యెమ్మెకాని
పట్టి పిలిపింతొ దేవతావరముచేత?
కొంగుబంగారమమ్మ! యీకొమ్మ. నీదు
కోరికల నెన్నఁడైనను కోరవచ్చుఁ
గాన నీమాతృభూమి దాస్యానుభవము
పాయువడఁగోరుమా వీరపత్నివగుచు.
ఎండనక వానయనక ప్రచండపటిమ
బయలుదేఱి వీనాఁడె జయమునీకు
కంకణములోడఁ గట్టు మాకంకణంబు
భారతావని దాస్యంబుఁ బారద్రోల."

# పేరంటం

శ్రీమతి జానకీపురుషోత్తము గారు

బాలామణి శ్రావణమాసంకోసం యెదురుచూస్తావుంది. ఆషాఢమాసంనుంచి నుయ్యాల్లోపాటలు నేర్చుకుంటూ యెప్పుడు శ్రావణమాసపు మంగళవారంవస్తుందా యెప్పుడు గౌరీదేవిని పూజించి పాటలుపాడుదామా అని చూస్తోంది. చూస్తావుండగానే రోజులు యిట్టేగడచి పోయినై. శ్రావణమాసంవచ్చింది. ఊరికంతా ఒక విధమైన అలంకారంకలిగింది. ఎవరియింటివాకిళ్లు చూసినా మామిడాకులతోరణాలతోనూ; గుమ్మాలు పసుపు, కుంకుమలతోనూ చూడడానికి ముచ్చటగావున్నాయి. బాలామణి యీపనిపాటల్లో తల్లికి చాలా సరదాగా సహాయంచేస్తూ చెల్లెలిని చూచి—

"చెల్లాయీ! పేరంటాళ్లని పిల్చేందుకు నాతో వస్తావుటే?" అన్నది.

"మనయింట్లో యేమే? అక్కాయి! పేరంటాళ్లని పిలవడంయెందుకే?" అన్నది చెల్లాయి.

"రేపు, నేను మంగళగౌరినోము నోచుకుంటానుగదూ! అందుకు" అందిబాల.

"ఆ నోము యెందుకే? అక్కయ్యా!"

"ఆ నోము నోచుకుంటే పెనిమిటికి ఆయుర్దాయం, ఆరోగ్యంకలుగుతుంది. అందుచేత ఆడపిల్లలంతా నోచుకోవాలి."

"ఎన్నాళ్లు నోచుకోవాలే? అక్కాయి!"

"అయిదేళ్లు."

"అబ్బో. అయితే నేనుకూడా నోచుకోనా? అక్కాయి"

"ఇప్పుడుకాదమ్మా. ఇంకారెండేళ్లు పోయి నీకు పెళ్లి అయింతర్వాత."

"అయితే పేరంటాళ్లని పిల్చేందుకెప్పుడు వెళ్లాలే మరి?"

"సాయంత్రం."

"మరి, మనంపేరంటానికి వెళ్లడంయెప్పుడమ్మామరి."

"రేపు, ఊరికేప్రశ్నలెయ్యబోకు. లోపల అమ్మ పిలుస్తోంది, పద. వెడదాం."

* * *

మంగళారం తెల్లవారుజామునే బాలామణి నిద్రలేచి దొడ్లోవున్న చెట్ల గన్నేరుపూలు, పారిజాత పుష్పాలు తీసికొచ్చుకుంది. తల్లిచేత తనూ, చెల్లాయి తలంటి నీళ్లు పోసుకున్నారు. తల్లి చెప్పగా గౌరీదేవిని పూజచేసుకుని నైవేద్యంపెట్టిందిబాల. మధ్యాహ్నంనుంచి వచ్చిన ముత్తయిదువులకు ఒకొక్కరికే వాయనాలు యిచ్చుకుంటోంది. వచ్చేముత్తయిదు, వెళ్లేపేరంటాలు. ఒకమూల గ్రామఫోనుపాట, చిన్నపిల్లలు, చిట్టిపిల్లలు శెనగలకోసం ఆరాటం. పసితమ్ముళ్లు వాళ్లకి పారాణి పుయ్యలేదని కూనురాగాలు. "నా తెనగలమూట వూడిపోయిందే. కత్తిపెత్తవు?" అని కొందరు. ఇట్లా ఇల్లంతాహడావిడిగావుంది. మొగవాళ్లకి కూర్చోడానికి, నుంచోడానికి యెక్కడాతావులేదు.

* * *

"నిన్నవాళ్ల రామమ్మ మన్ని పేరంటానికి పిల్చిందికదూ? అక్కడికి వెళ్లొద్దుటే? అక్కయ్యా!" అంది చెల్లాయి.

"వెడదాంవుండు."

"సరస్వతికూడా పిల్చిందికాదుటే?"

"ఆ"

"ఇంకా చాలామంది పిల్చారమ్మా! వాళ్లందరికీ నాకు తెలీదు. అబ్బ! ఎన్నిళ్లకు పోయిరావాలమ్మా! ఎల్లావెడతాం? టైమయిపోతోంది. ఇక నేవెడతానమ్మా!"

"అందరియింటికీ వెడదాం. ఉండు. చెల్లాయి! తొందరపెట్టకుమరి."

"ఇంకెప్పుడమ్మా? సాయంకాలంఅవుతూవుంటే."

ఇంతలో "ఇంకమీరు పేరంటానికి వెళ్లండి అమ్మాయిలు, వచ్చినవారికి నేను వాయనాలు యిస్తాను గాని పోయిరండి త్వరగా." అని పిల్లల్ని యిద్దరిని పేరంటానికి వెళ్లమంది తల్లి. జాగ్రత్తమ్మా చెల్లాయి మెళ్లో వస్తువులు అవివున్నాయి. సెనగలు అవిజాగ్రత్తగా మూటకట్టుకో, త్వరగారావలె. ఎక్కడైనా పాటపాడమంటే పోటాపోటీతో కూర్చోకండి. చిన్నమ్మాయి యిట్లాతిరగవే. కాటిక అలికేశావు అప్పుడే" అంది వాళ్లమ్మ.

"రావే చెల్లాయి! పోదాం. పరికిణీ కొలవ యీడవకు" అంటూ బుజంమీద చెయ్యేసి "చెల్లాయి! బయల్దేరు." అందిబాల.

"నేను చెరపలేదు. అదే చెరిగిపోయిందే కాటిక" అంటూ చెల్లాయిసాగింది.

* * *

వాకిలి దిగుతూంటే వానతుంపరలు పడ్డాయి. "అబ్బ! చినుకులు పడుతున్నాయే చెల్లాయి!"

"అక్కాయి. వర్షంకురుస్తే వచ్చేటప్పుడు దోవలో పడవలు వేసుకుంటూవద్దామేం?"

"ఎప్పుడూ నీళ్లలోతడుద్దామాఅనే-అల్లరి చెయ్యకపద."

ఇంతలో అఖండంగా వర్షంపెద్దదైంది. చెల్లాయి అన్నది అరుగుమీద కూర్చున్న అమ్మమ్మని చూచి, "అమ్మమ్మమ్మా-వర్షంయెందుకు కురుస్తుందేం?"

"వర్షమా? మీరంతా ఆడపిల్లలు నోమునోచుకుంటే దేవుడు సంతోషించి కురిపిస్తాడు."

"ఎందుకని?"

"పంటలుపండడానికి."

"ఏపంటలు?"

"అన్నీను."

"సెనగలుకూడానా!"

"పో, పిచ్చిపిల్ల, వర్షంఆగింది. తడవకుండా పోయిరండి."

* * *

తండ్రి ఆఫీసునుంచి రాగానే గబగబా తండ్రిదగ్గరకు వెళ్లి చెల్లాయి "మేమే. పేరంటానికివెళ్లివచ్చాం నాన్నా!" అన్నది.

"ఎవరెవరింటికి వెళ్లేరమ్మా?"

"చాలాయిళ్లకు వెళ్లేం."

"అక్కడేమిచ్చేరమ్మా! చిట్టీ?"

"సెనగలు వాయనంయిచ్చేరు. తెచ్చుకున్నాం."

"యేంచేసివచ్చిందో అడగండి" అంది వాళ్లమ్మ.

"ఏంచేసింది?"

"నాన్నే అడగండి."

"నువ్వేచెప్పరాదూ?"

"చేసినది చెప్పదుమళ్లీ. యిప్పట్లో అమరుతుందా. అప్పటి—"

"ఏదేవావస్తువు పారేసిందా యేమిటి?"

"ఆఁ"

"ఏంవస్తువు?"

"మెళ్లోచైను."

"ఎవరెవరు వెళ్లారు పేరంటానికి?"

"పిల్లలిద్దరూ."

"కూడా పెద్దవాళ్లెవరువెళ్లారు?"

"ఎవరూ వెళ్లలేదు."

"ఇంకేం పిల్లల్ని ఒక్కళ్లనిపంపి వాళ్లని శెకలు పెట్టడం రెందుకు? పెద్దవాళ్లకి జ్ఞానంలేక పోయింతర్వాత" అని చెల్లాయిని రెత్తుకుని వాకిట్లో గాలిపీల్చడానికి వెళ్లేడు వాళ్లనాన్న.

## నోములు

గుండిమెడ శ్రీరామశర్మగారు బి. ఏ.

వ్రతముజెడినను ఫలములు వనిత! నీకు
దక్కననుచునుజెప్పెడి డంబములను
విశ్వసించుచు జెనటివై విఱ్ఱవీగి
నోముజేసిననేమౌను నీమకోలంత.
పూర్వకాలమునందున బుణ్యస్త్రీలు
భక్తిశ్రద్ధలుమీరగ భర్తకెపుడు
శ్రేయపుసిరినిగూర్పగ జెలగినారు,
పడయగల్గిరినోముల ఫలములెపుడు.
మీరిరెరుగరు పతియాజ్ఞమీటకరించి,
యుత్తమాంబలనెల్లర నాడలేదు,
పూనియుండిరిమానంబు పుణ్యక్రియల
తామసంబున మానంబు దాల్పలేదు.
భర్త రొంకెదెస నాకలి బాధయనగ
అడ్డువచ్చినవారల నాడికొనుచు
తనకుమరణము వ్రాయడే తమ్మిచూలి
యనుచు బిడ్డలబోద్రోచియాగడమున
కాంత లెప్పుడు గుప్పించిగంతులిడుచు
మానసంబున శోకయింతమరపులేక
పూర్వగాథలనన్నియు పుక్కిళించి
ముఖమునందున నుమియుచుముక్తికొరకు
చిత్తశుద్ధినిదెలియక జేయువ్రతము
లిష్టకామార్థసంపద లీయగలవొ?
ముక్తిగూర్పగ మాహాత్మ్యశక్తిగలదొ?
పుణ్యవనితలసాటిని బొందగలవొ?
కలిమిలేములదలచుచు గలతజెంది
కలిగియుండిన వ్యామోహగడలియందు
మునిగిదేలుచు ముకుళితమూర్తిఁబూని
వ్రతముజేయగబూనిన వరమువినుము.
అర్థకాయపుసంపదల్ వ్యర్థమగును
చూడవత్తురుపరులెల్ల చోద్యమనుచు
గృహమునందున గలహంబుగేళిసల్ప
నాగ్రహింతురుబంధుగు లాగమనుచు.
నీమమనునొకమిషజూపి నిశ్చలంపు
మానసాంబుధి బరమేశు బూనువరకు
వ్రతములనియెడితంత్రములు వరములంద
విప్రవర్యులుగూర్చిన విధముగాదె
పడయదలచితివేని యాపరమపదము
పొందజేయకపోవునే పుణ్యమూర్తి
క్షణముజాలదె మనమున బ్రణయమూర్తి
నిశ్చలంబుగస్తుతిజేయ? నీరజాక్షి!

# శ్రావణమాసము

శ్రీమతి యస్. వి. సరళాదేవిగారు

## శ్రావణము: ప్రకృతి

వర్షాసమయమునకు శ్రావణమాసము ముఖద్వారము. గ్రీష్మర్తువునందలి లక్షణము లన్నియు నీమాసమున కేవలము మార్పుచెందును. మండుటెండలు, వేడిగాడ్పులు, పరాగ ప్రసారములు అన్నియును శాంతించిపోవును. ఈమాసమునందలి ప్రకృతి ఎంతయుశోభా కరమై, హృదయంగమముగానుండును. వినీలమేఘమాలికలతో గగనాంగణము దర్శనీయమై ఒప్పారుచుండును. మేఘమాలికాదర్శనమున ఆనందాతిరేకముకలిగి మయూరములు పింఛములనెత్తి యాడుచుండును. వాయువులు అతిశీతలముగా వీచుచుండును. తరు, లత, గుల్మాదులు గుబురుకొని దర్శనీయములయియుండును. కాసారములన్నియు నిండియుండును. భూభాగములన్నియు పైరుపచ్చలతో, శాద్వలములతో నేత్రముల కానందమొదవించు చుండును. నీలాకాశమునబారులుగట్టి తిరుగులాడు తెల్లనికొంగలు రమ్యవర్ణసమ్మేళనమును కావించుచుండును. ప్రకృతి యెంతేని ఈకాలమున దర్శనీయముగా నుండును. కవులు దీనిని మిక్కిలిగా పొగడుచుందురు. భావములకిది నెలవందురు. రవీంద్రుడు ఈవర్షాసమయ ములయందే తనయుత్తమకవితను చిత్రించెనని అతని గ్రంథములు చెప్పుచున్నవి. ఆకసము నుండి వర్షధారలు పడుచుండగా, చెట్లయాకులు టపటపమని ధ్వనిచేయుచుండగా, విద్యు ద్రమ్యమగు నీలగగనమునుచూచి కవులు ముగ్ధులయి పోవుచుందురు. ఆప్రకృతిదేవిని తనివి తీర ఉపాసించుచుందురు. కవులందరును దీనియుత్కర్షను వర్ణించినారు. కాళిదాసును, కృష్ణరాయలును దీనిగొప్పను చెప్పినారు.

## శ్రావణము: ఆరోగ్యము

వర్షర్తువునుగూర్చి వైద్యశాస్త్ర మిట్లుచెప్పుచున్నది. "ఆదానకాలమున బడలిన శరీరముగల మానవుల జఠరాగ్ని దోషములచే మిగుల దూషించును. శీతలవాతమువలన వాతమును, జఠరాగ్నిమాంద్యమువలన శ్లేష్మమును, తత్కాలోదకపానమువలన పిత్తమును దూషింపబడును. కావున ఈదోషప్రకోపమును శమింపచేయజాలు—జఠరాగ్ని నెక్కువ చేయజాలు—ఆహారమును సేవించుచుండవలయును. అమ్లలవణస్నేహరసములను, పురాణ యవగోధూమాదులును ఈకాలమున భోజనద్రవ్యములుగా ప్రశస్తములు. కూపోదకము, కాచిననీరు శ్రేష్ఠములు. పాదగమనము చేయరాదు. శీతాదిబాధలేని సౌధోపరినివాసము మంచిది. నదీజలము, పగటినిద్ర, ఆయాసకరములగు పనులు ఈకాలమున కూడవు." కావున ఆరోగ్యమును, జఠరాగ్నిని పరిగానుంచుకొని పోషించుకొనవలయును.

## వ్రతములు: వాని ఉద్దేశము

ఈకాలమున వ్రతముల పేరుతోనైనను పసుపు కుంకుమలు, అంజనము ఉపయో గించుకొనుటయు; అభ్యంగన మాచరించుటయు స్త్రీలకు అత్యంతావశ్యకమగు విషయము.



అలంకార వికృతి

ఎండకాలములో తలకెక్కిన యుష్ణము- అభ్యంగనమువలనను, వానకారున పొగబారుట వలన కలిగిననేత్రబాధ అంజనమువలనను ఉపశమించిపోగలవు. నీటిలోను, బురదలోను, తిరుగుటవలన కలిగిన బాధలు, వానకు తడియుటవలన కలిగినశైత్యములు పసుపుపూసి కొనుటవలన తగ్గిపోవును. తక్కినకాలము లన్నింటికంటెను ఈకాలముననే స్త్రీలకివి అత్యావశ్యకములుగను, ఆరోగ్యరక్షకములుగను ఉన్నవి. పరమేశ్వరునిచే ఏయౌషధమును అక్కరలేకుండగనే ఆరోగ్యరక్షకములగా ప్రసాదింపబడినవి. ఈకాలమున నీవ్రతాచరణ ములును ఒకదృష్టిలో ఆరోగ్యరక్షకములే కావచ్చును. అభ్యంజనాదిక్రియలకు, పసుపు మున్నగువాని యుపయోగమునకు వ్రతములు మిగుల నానుకూల్యమును కూర్చుచున్నవి. జఠరాగ్ని మందగించి, దోషములు ప్రకోపించినందువలన ఈయేకభుక్తములు, ఉపవాసములు విధింపబడి ఆరోగ్యమును సంపాదించుచున్నవి. కావున నిట్టివ్రతాచరణము ఈకాలమున మిగుల నావశ్యకమేయగును. ఆరోగ్యమును మాత్రమేకాక లౌకికఫలములను, ఆముష్మిక ప్రయోజనములను ఈవ్రతములవలన పురాణములు సాధించుచున్నవి. నారీమతల్లులకు శుక్రవారములును, మంగళవారములును శ్రావణమాసమున వ్రతవిధానమున కేర్పడిన దినములు. భవిష్యోత్తరపురాణమున వీనిప్రభావమును, ఆచరణావశ్యకతయు నిరూపింప బడినవి. ఆవ్రతములలో ముఖ్యమగు శుక్రవారమును గుఱించి మాత్రమీక్రింద వ్రాసెదను.

## వరలక్ష్మీవ్రతము: విధానము

శుక్రవారవ్రతమును వరలక్ష్మీవ్రతమని చెప్పుచుందురు. ఇయ్యది శ్రావణపూర్ణిమకు ముందువచ్చు శుక్రవారమున నాచరింపబడుచుండును. ఇయ్యది సువాసినులకు ముఖ్యమైనది. ఈవ్రతము భాగ్యభోగ్యములకును, ఆయురారోగ్యములకును హేతుభూతమని పెద్దల విశ్వాసము. వరలక్ష్మీదేవిని ప్రతిష్ఠించి, పూజావిధానముచే సత్కరించి వ్రతముచేయువారు నవగ్రంథియుతమైన తోరమునుధరించి పూజానంతరము బ్రాహ్మణునకు ద్వాదశాపూపములు వాయనమియ్యవలయును. వాయనదానసందర్భమున 'ఇందిరయే ఇచ్చుచున్నది. ఇంది రయే పుచ్చుకొనుచున్నది. ఇరువురకు ఇందిరయే తారకమగునుగాక' అనునర్థముకల శ్లోకమును పఠింతురు. ఆపై కథచెప్పి, అక్షతలువైచికొని, వ్రతపరిసమాప్తి కావించు కొందురు.

## వరలక్ష్మీవ్రతము: కథ

ఒకనాడు కైలాసశిఖరమున మణిమయాసనమును పరమేశ్వరుడు అధిష్ఠించి యుండెను చుట్టును ప్రమథగణములు, దిక్పాలకులు కొలువు తీర్చియుండిరి. అప్పుడా లోకశంకరుడగు శంకరుని పార్వతియిట్లని ప్రశ్నించెను. 'ప్రభూ! నీవు సమస్తభూతముల యందును దయకలవాడవు. కావున జనులందరును ఏవ్రతముచేత తరింతురో నాకు సెల వీయుడు.' అప్పుడు మహేశ్వరుడు సంతుష్టుడై 'వ్రతములలోనెల్ల ఉత్తమమైనది వరలక్ష్మీ

వ్రతము. శ్రావణమాసమున పూర్ణిమకు పూర్వమందున్న శుక్రవారమున ఈవ్రతమును స్త్రీలు చేయవలెను. దీనివలన సమస్తసంపదలును, పుత్రపౌత్రాదిభాగ్యమును సిద్ధించును. ఇది సర్వకామితములను గూర్చును సుమా' అని చెప్పెను. అప్పుడు పార్వతి 'అవ్రతమెట్లు చేయనగును? ఏదేవత నారాధింపవలెను? పూర్వమెవ్వరిచే ఆయమ ఉపాసింపబడినది? ఎట్లు కామితముల చేకూర్చినది?' అని మఱలనడిగెను. దానికి పరమేశ్వరుడు ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 'ప్రసిద్ధమైనటువంటిది కుండినమను పట్టణముకలదు. అందు చారుమతి అను బ్రాహ్మణస్త్రీ యుండెను. ఆమె మిక్కిలిసద్వర్తనముకలది. దైవముకన్న మిన్నగా పతిని పూజించును. అత్తమామలను వేయికన్నులతో నుపచరించును. దయార్ద్రహృదయ. నిర్మల చిత్త. ఆమె కొకనాటిరాత్రి యొకస్వప్నమాయెను. అందు మహాలక్ష్మి ప్రత్యక్షమై "చారు మతీ! నేను వరలక్ష్మిదేవిని. నీకు ప్రత్యక్షమైతిని. నీమేలుకోరి చెప్పుచున్నాను. శ్రావణ పూర్ణిమకు ముందరిశుక్రవారమున నన్నుపూజింపుము. నీకామితముల నీడేర్తును" అని చెప్పెను. ఈమాటలనువిని చారుమతి సంతసిల్లి ఆదేవిని స్వప్నములోనే మిక్కిలి స్తుతించెను. "తల్లీ! నమస్కారము. సమస్తజగదాధారవు నీవు. విష్ణువక్షస్థలమున నెలకొని లోకముల పాలించు జగన్మాతవు. ఎవడు నీక్రీగంటిప్రసారభాగ్యమును గాంచునో వాడేపండితుడు. వాడేభాగ్యవంతుడు; వాడేస్తుతింపతగినవాడు. అంతకన్న నుత్తముడుండడు. నాపూర్వపుణ్యవశమున నిన్నుజూడగంటిని. ఆనందమున నుంటిని." ఈస్తోత్రమునువిని వరలక్ష్మి వరప్రదానమొనర్చి వెడలిపోయెను. తరువాత చారుమతి యీస్వప్నమును తనబంధువులందఱును విని మంచిది, మంచిది, మేమును అట్టులనే ఆవ్రతవిధానమును సాగింతుమని ఆమెతో చెప్పిరి. తరువాత కొన్నాళ్లకు ఆశుభదినమే తెంచినది. అందఱు బంధువులతో చారుమతి-శుభవస్త్రములతాల్చి, సంతుష్టాంతరంగముతో వరలక్ష్మి నావాహించి సకలవిధముల పూజించి, తోరమును ధరించి, భక్ష్యభోజ్యాదికమును నివేదించినది. తరువాత గుణవంతుడగు బ్రాహ్మణునకు పండ్రెండుపూపముల వాయనమిచ్చినది. అపయి నాస్త్రీలందఱును నివేదితభోజ్యాదుల నారగించిరి. వారు వరలక్ష్మి అనుగ్రహమువలన భాగ్యసంపన్నలయి, పుత్రపరీవృతలయి, అన్నదానతత్పరలయి శోభిల్లిరి. తరువాత వారిలోవారు "ఆహా! యెంతమంచి వ్రతమిది. ఇది యుత్తమోత్తమమనుట పరమసత్యము. దీనివలననే సమస్త కామ్యములును సిద్ధించును. చారుమతి చాలధన్యురాలు. ఆయమవలనగదా మనకిట్టి భాగ్యములభించినది." అనిచెప్పుకొనుచు ఆమెను పొగడిరి. అప్పటినుండియును ఈవ్రతము భూలోకమున ప్రశస్తికెక్కినదాయెను.' ఈవ్రతమునకు సంబంధించిన యొకమంగళహారతిని ఉదాహరింతును.

## మంగళహారతి

(ఇకనైన నామొర వినరాద. వలె.)

హారతీగొను-వరలక్ష్మీ కర్పూర ॥హా॥

రతికోటిసుందరీ-సుకుమారీ
క్షీరసాగరపుత్రి-కారుణింపవమ్మ ॥హా॥

సర్వలోకములకు-మూలమైనతల్లి
చల్లనినీచూపు-ఎన్నమాకుప్రాపు ॥హా॥

నాథహృదయ-మందిరవాసినీ
నీపాదపద్మముల-నీడచేరియుంటి ॥హా॥

భక్తపాలనీ-సర్వార్థదాయిని
నీదృగంచలమె-జీవితతరణంబు ॥హా॥

## విరహిణి

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

నీసౌజన్యమనఃపరీతసుమమానీరంధ్రదివ్యచ్ఛటల్
మాసె న్నాథవియోగసంచితతమోమాలిన్యదుఃఖాప్తి, నా
యాసంబన్నదియేమెఱుంగని త్వదీయాంగంబునేఁడేల కాం
తాసౌభాగ్యవిలాసవస్తుపరిభూతంబయ్యెనే తెల్పుమా.

గ్రుచ్చిగ్రుచ్చనిపూలనేలనిటు ద్రోగుల్ వెట్ట, సాధ్వీ! త్వదీ
యోచ్చాకాంక్షలు కూలిపోయెననుదుఃఖోద్రగతన్ గుందఁగన్
మెచ్చన్ జాలునెలోక మమ్మయిటులన్ని త్యక్రియల్ మాన నీ
యిచ్ఛల్ సిద్ధినిబొందునా తగునునీ కేయిట్టివ్యర్థక్రియల్.

ఈశుభమాసవాసరములేలకొ చింతలవెళ్లఁబుచ్చినీ
యాశలఁజంపుకోఁగఁబతి నాత్మఁదలంచెడిసాధ్వికెప్డు స
ర్వేశుఁడొసంగుసౌఖ్యములనెల్ల తదీయపవిత్రపూజనా
లేశమెమాపుమాపునులలిన్ భవదీయవియోగచింతలన్.

మానితసత్త్వవర్తనసమాహితచిత్తసమేతలౌచు వి
జ్ఞానవికాసితాత్మలగు సాధ్వుల కెన్నఁడునేనికాపురం
బైననుజేయనెక్కఁగనునాదట నీదఁగభూమిలోపలన్
గానలుగావు శైలములుగావు పయోధులుగావు భారముల్.

# శ్రావణపట్టీ

కందుకూరి రామభద్రరావుగారు

౧

"ఏమండీ! ఎప్పుడువస్తామని కబురంపేరండీ" అన్నది పడకగదిలోనుండి పాందాను, పక్కపొడిపీసా పట్టుకొనివచ్చుచు శాంతమ్మ.

"రేపు రెండుఘడియల ప్రొద్దెక్కేసరికి దోసెదాటివస్తామన్నారు." అని కుటుంబరావు చుట్టపొగ పైకిఊది బదులు చెప్పినాడు.

శాంతమ్మ చావడిలో హరికెన్ లాంతరువద్ద కూర్చుని తమలపాకులకు సున్నమురాసి యీనెలుతీయు చున్నది. కుటుంబరావు చుట్టపారవైచి వీధియరుగుమీదనుండిలేచివచ్చి శాంతమ్మకెదురుగా చావడిలో మంచముమీదకూర్చున్నాడు. కూతురు లలిత, కొమరుడు రామం ప్రక్కను పండుకొనియున్నారు. రామం ప్రొద్దుగ్రుంకుసరికే భోజనముచేయుచు పేచీపెట్టి యేడ్చియేడ్చి నిదురపోయినాడు. లలితకుమాత్రమింకా కునుకుపట్టలేదు; సహజముగాతాను తల్లికి పనిపాటులలో సాసరాగాయుండి ప్రొద్దుపోయేవఱకు నిద్దురపోదు; మఱునాడు శ్రావణశుక్రవారము. అత్తవారు శ్రావణపట్టీ తెచ్చెదరని వర్తమానమువచ్చినది. తల్లిదండ్రు లావిష యమై ప్రసంగముదెచ్చినారు. అందుచే కన్నులు మూసికొని వారనుకొనుమాటలన్నిటిని పాముచెవులతో వినుచున్నది.

"మనము ఆషాఢపట్టీ నూరురూపాయిల సామాను పంపేముకదా? వారేమి తెస్తారో?" అని శాంతమ్మ మొగమెత్తి కనుగొనల భర్తవైపు దృష్టిసారించి చిరునవ్వునవ్వినది.

"నాకు మాత్రమేమి తెలుసును? వియ్యంకుడుగారికి సరదాయేకాని పెత్తనమంతా ఆయన అక్కగారిది. అది రణడిప్పకాయముండ."

"అందుకనే మగవాడిచేతిబిడ్డ, ఆడుదానిచేతిడబ్బు నిరుపయోగమన్నారు." అని తమలపాకులచిలకలు, వక్కపొడి భర్తకందించినది శాంతమ్మ.

"పెళ్లిలో చూశావుకాదూ ఆముండ పేచీలు?"

"అమ్మో! అదా? ఎముకలుకొరికేసింది. చీటికిమాటికి తానుసిద్ధం. పిల్ల కొక్కచీరైనామంచి దివ్వ నిచ్చిందా? దీనికిసలహా వారిపురోహితుడొకడు దొరికేడు. వాడికి మనవాడేదో పేరుపెట్టేడు."

"చిలకరాముడని"

"మరే. ఆనాల్గురోజులు కుఱ్ఱవాళ్లంతా ఉడికించేరు."

"అశాస్త్రుల్లు తెల్లవారిలేస్తే కోర్టులోవుంటాడు. ఎలకమీద పిల్లిని, పిల్లిమీద ఎలకనీ ఎక్కించి పరగ యేరుకుంటోంటాడు. వీరిక ఆయన మంత్రాంగమేమిటో?"

"కట్నకానుకలపేరు పెళ్లిలో పెట్టక శ్రావణపట్టీలో తెస్తామన్నారు. నేను ఉత్తరంపట్టుకువచ్చిన మంగలిని అడిగేను. పంతులుగారు కంసాల్లింటిదగ్గిరున్నారు కాని ఆవైనం తెలియదన్నాడు."

"బహుశా చేయించుంటారు."

"అయితే ప్రకాశం ఏక్లాసిప్పుడు?"

"స్కూలుఫైనలు. అతను తెలివైనవాడే. పేసవుతాడు."

"మనమ్మాయివెళ్లేటప్పటికి ఎఫ్ఫేలోకివస్తాడన్నమాటే."

"ఆఁ"

"పెద్దమ్మాయిని తీసుకురమ్మని వ్రాశాను. ఈపూటరాలేదు. వస్తేఉదయంరావాలి."

"ఆలావస్తేయింకనేం? వెళ్ళి పిలిస్తే నేదిక్కు లేదు. ఉత్తరంమీద తీసుకువస్తాడా అతను?"

రామంలేచి "అమ్మా! మంచినీళ్ళ"న్నాడు.

## ౨

అఖండగౌతమీతరంగిణికి ఒకపాయయగు వశిష్ఠానది యిరుప్రక్కలనుదాసి పూర్ణపండితుని నిరాడంబరము ననుకరించి ప్రవహించుచున్నది. పడమటిగాలికి పిల్లతరంగములు లేచి మృదులధ్వనితో దూర్వాతీరములను బలుకరించుచున్నవి. తటమువంటి యేపుగా పెరిగిన బుడమచేలు పచ్చని కంబళ్లుపరిచినట్లు అలరారుచున్నవి. నువ్వుమొక్కలు నిండుయౌవనమున బువ్వుకొనలనుండి నవ్వుచున్నవి. రేవులోనున్న రావినీడ రామం చెలికానితోగూడియాడుచు గోదావరిలోనేరిన 'దోసెకాయలు' సర్వీరాతిపై బగులగొట్టుచున్నాడు. రెండుఘడియల ప్రొద్దెక్కినది. కాని ఆకసముమాగగానుండుటచే గ్రుడ్డియెండమాత్రము కాయుచున్నది. రామం మధ్యమధ్య అద్దరినుండి యిద్దరికివచ్చుదోనెవైపు చూచుచున్నాడు. కొంతతడవగుసరికి దోనెతీరము చేరినది. దిగుచున్న జనమునుజూచి రామం ఇంటికి వాయువేగమున బరుగత్తెను. తిన్నగా దొడ్డిలోనికి బోయి పూజాద్రవ్యములను సంబాళించు లలితనుజూచి "వస్తున్నారోయి! వస్తున్నారోయి! అమ్మాయి పెళ్లివారొస్తున్నారోయి!" అని మోచేతిక్రింద అరచేతితో తాళము వేయుచుఅన్నాడు.

"చాలులేరా! * * చూడవే అమ్మా! వీణ్ణి." అన్నది లలిత సన్నని కంఠముతో.

"అక్కయ్యతో వేళాకోళ మేమిటిరా? ఊరుకో" అనిపలికి శాంతమ్మ నూతిదగ్గిరనుండి వచ్చుచున్న కుటుంబరావుతో "దోనెదా టేరట" అన్నది.

కుటుంబరావు ఊకొట్టి వీథియరుగుమీద తుంగచాపవేయించి కూర్చున్నాడు. వీథిమళుపుతిరిగి కుటుంబరావువియ్యంకుడు, అతని ద్వితీయపుత్రుడు, వారిపురోహితుడు వచ్చి గుమ్మ మెక్కినారు. కుటుంబరావు "దయచేయండి" అని వారినిగూర్చుండబెట్టి "రామం! రెండుచెంబులతో నీళ్లుతేరా!" అని లోనికి కేకవేసినాడు.

"అక్కరలేదండి! వేశ్రమక్కరలేకుండా బావగారు గోదావరినేనిలిచేరుప్రక్క" అన్నాడు వియ్యంకుడు. అందరు ఒక్కమారు ఫక్కున నవ్వినారు. అందులో పురోహితుడు రానినవ్వు తెచ్చుకొని అందరినిమించి పకపకమన్నాడు. రామం చెంబులు గుమ్మంలోనుంచగానే "అబ్బాయి! కావడిగదిలో పెట్టించు" మని కుటుంబరావు గుమ్మముముందరనిలబడిన చాకలివైపు చూపించినాడు.

పురోహితుడు దొడ్డిలోనికివెళ్లి తడిబట్టలారవేసికొని పడమటింటి ఈశాన్యదిశనున్న పూజామందిర ప్రాంగణమున గూర్చుండి యేర్పాట్లు చేయుచున్నాడు. కుటుంబరావు వియ్యంకుడగు అయోధ్యరామయ్యను కుశలప్రశ్నలు వేయుటకారంభించెను. అంతలో తలుపు ఓరగానుంచి చాటునుండి శాంతమ్మ "వదినగారు, పిల్లలు అంతాకులాసాగాయున్నారా?" అన్నది మెల్లగా.

"కులాసాగానే ఉన్నారమ్మా." అన్నాడు అయోధ్యరామయ్య.

"ప్రకాశం రాజమండ్రీలోనే యున్నాడా?"

"ఆఁ"

"కులాసాగా యుంటున్నాడా? వంటపూటి మెతుకులు పాపం."

"కులాసాగయున్నానని మొన్నేవ్రాశాడు. ఏమీకష్టపడకుండా చదువులూరికే వస్తాయండీ? అక్కగారూ!"

"కనకం! లోపలికిరాఅమ్మా! చద్దిఅన్నంతిందుగాని" అనిశాంతమ్మ అల్లునితమ్ముని పిలిచినది.

"తినేవచ్చానండి" అన్నాడు కనకం సిగ్గుతో తలవంచుకొని.

కుటుంబరావు మంగలికి కబురుపంపి వారందఱికీ అభ్యంగనప్రయత్నము చేయుచుండగా పెద్దకూతురు రమణ, అల్లుడు నారాయణరావు బండిదిగినారు. కుటుంబరావు పుట్టెడుసంబరముతో 'రమణవచ్చిందేవ్' అని కేకవేసినాడు. రామం పరుగెత్తుకొనివచ్చి అక్కయ్య చంకనెక్కినాడు. తల్లి, పెద్దతల్లి, లలిత చావడిలోనికి వచ్చి రమణ లోనికిరాగానే దొడ్డిలోనికి వెళ్లినారు. ఒక అరగంటసేపు ఒకరిమాట యొకరికి వినబడకుండా ఇంటిలోనివారు, పొరుగునున్నవారు అమ్మలక్కలందఱుచేరి "వచ్చావుటేమాతల్లీ!" యని, "ఇదిగో! దిగింది యెప్పుడో భావ" అని, "ఓహో! ఎప్పుడో నీ రాక!" అని పలుకరించుచు రణగొణధ్వనిజేసిరి. ఈమధ్య పురోహితుడు త్వరగా పూజకు కూర్చుండుమని వేసినకేక నెవరును వినిపించుకొనలేరు.

3

బంధుజనాగమసంజనితసల్లాపములు ముగిసినవి. అభ్యంగనాదికృత్యములైనవి. లలితారమణలును తల్లియు పూజకు గూర్చున్నారు. పురోహితుడు సంకల్పముజేయించుట ప్రారంభించెను. నాలుగు బారల దూరమున తివాసీపఱచి కుటుంబరావు చావడిలోనున్న వియ్యంకుని, అల్లుని, ఇతరబంధువులను లోనికి దయచేయుడని తీసికొనివచ్చి కూర్చుండబెట్టెను.

గచ్చుతో గట్టిన విశాలమైన పీఠముపై, పసుపురాసి పిండివస్త్రములుబెట్టిన పీటయమర్చబడినది. దాని మీద కుటుంబరావు తలిదండ్రులు కాశీవెళ్లివచ్చుడు కొనితెచ్చిన యిత్తడిసింహాసనము తళతళలాడుచున్నది. అందు గౌరీదేవి, గణపతి మున్నగుదైవములు శిలారూపముగ నధిష్టించియున్నారు. ఒకప్రక్క ఇత్తడికుందెలో దీపము నిశ్చలముగా వెలుగుచున్నది. రెండవప్రక్క వెండిగొట్టమునందుగ్రుచ్చబడిన యగరువత్తులనుండి ధూప మటికవలెను దారులు కట్టినవి. ముందొకపళ్లెములో వివిధవర్ణసంశోభితములగు ప్రసూనములు సోయగములు కురియుచున్నవి. వేఱొకపళ్లెరమున తండులములపై దమలపాకుల నుంచబడిన క్రొత్తకాసులపేరు ధగధగ మెఱయుచున్నది. పీఠమునకు బారెడుదూరమున లలితయత్తవారు తెచ్చిన క్రొత్తబట్టలు, పసుపుకుంకుమ మున్నగు ఇతరవస్తువులన్నియు వేఱువేఱుగ నుంచబడియున్నవి. పూజ యథావిధిగా జరుగుచున్నది.

"ప్రొద్దుపోయినది. త్వరగా తెమల్చండి" అని కుటుంబరావన్నాడు.

వాయువేగమున పూజనడిచినది. లలితకుదృష్టి క్రొత్తకాసులపేరుమీదనున్నది. రమణకు పనరమణిని మీదనున్నది. ముక్కుపట్టుకొనమని, 'మమ' అనుకొనమని, అక్షతలువేయుమని, చందనము చరచమని పురోహితుడు రెండు మూడు సారులు చెప్పినగాని వారికి వినబడునదికాదు. ధూపదీపనైవేద్యములతోను, నీరాజన మంత్రపుష్పములతోను పూజముగిసినది. ఆత్మప్రదక్షిణములు చేయించి పురోహితు డిష్టఫలప్రాప్తికి ధ్యానము చేయుమనిన వారు రెండుక్షణములు నిశ్చలులై ధ్యానించిరి. ఏమి ధ్యానించిరో యెవరికెఱుక?

పూజముగియగానే మగవారందఱు తొమ్మిది పిండివంటలతో మృష్టసోపేతముగ భోజనములుగావించిరి. లేచినతరువాత చావడిలో గూర్చుండి తాంబూలములు సేవించుచుండిరి. ఆడువారులోపల భోజనములకు కూర్చుండిరి.

"శాస్త్రిగారూ! మీరు రాజమండ్రిలోనే ఉంటున్నారా?" అని కుటుంబరావు అడిగినాడు.

"చిత్తము! మాపిల్లవాడు లోవర్ సెకండరీ చదువుచున్నాడు. అక్కడనే కుటుంబముతో నుంచున్నాము" అని బదులు చెప్పినాడు శాస్త్రి.

"ఏలాగున గడపుతున్నారండి పట్నవాసకాపురం!"

"వారికేమండి?" అన్నాడు అయోధ్యరామయ్య.

"వారప్లాటంచూంచారు. ప్రథమంలో బహుశ్రమగా యుండేది. కొందఱు కొందఱు షాహుకార్లతో పరిచయంకలిగింది. సత్యనారాయణవ్రతమనీ సమారాధనమనీ పిలుస్తూయుంచారు."

"ఏమండీ శాస్త్రులుగారూ! మీరుకూడ పిల్లలికి ఇంగ్లీషుచదువే చెప్పిస్తున్నారు? ఇప్పటిరోజుల్లో

యేమిలాభమండీ? ఏదో రెండు పౌరోహిత్యపుముక్కలు చెప్పిస్తే ఊళ్లో పడుక్కుంటోంటాడుగా" అన్నాడు నారాయణరావు ఎత్తిపొడుపుగా.

"లోకాచారం, నాయనా! గ్రామంలో పౌరోహిత్యాభిమానంమాత్రము తగులడిందా?" అన్నాడు శాస్త్రి.

"మా శాస్త్రిగారి కక్కుర్తి తీరిక యుండదండీ. రాజమండ్రిలో కోర్టువ్యవహారాలు కూడా అయునవే." అని అయోధ్యరామయ్య గేలిచేసినాడు.

"చిత్తము. నాకీతీరిక యుండదు. స్వల్పముగా లౌక్యముకూడావుంది. రేపు శ్రావణపూర్ణిమకు యజ్ఞోపవీతములు కూడ టపాలో కట్టినాను."

"ఆశీర్వచనములుకూడా వాటితోనే కట్టేరా?" అన్నాడు నారాయణరావు మరల.

"దివ్యంగా" అన్నాడు శాస్త్రి.

"అందుకనే నేనండి పౌరోహిత్యంఅంటే విశ్వాసంలేకపోవడం." అన్నాడు నారాయణ.

శాస్త్రిముఖము జేవురించినది. చినుకుచినుకు గాలివానయైయుండును గాని అంతలో వీధియరుగుమీద కనకం, రామం జుట్టు జుట్టు పట్టుకొని కేకలు వేసుకొనుచున్నారు. నలుగురు వీధిలోనికి వెళ్లి విడిపించినారు.

"చూడు: నాన్నా! వన్నె వెధవ 'కనకం—కుసకం' అని వుడికిస్తున్నాడు" అన్నాడు కనకం. "తప్పు, తప్పు. అలా తిట్టకూడదు" అన్నాడు అయోధ్యరామయ్య. రెండు లెంపకాయలతో రామాన్ని లోనికిసాగనంపినాడు కుటుంబరావు.

## ౪

"ప్రొద్దుకుంకవస్తోంది. తెమిలివెళ్లి నలుగురిని పిలిచేసిరండే అమ్మాయీ!" అన్నది కాంతమ్మ తమలపాకులు పరిశుభ్రపరుచుచు.

"ఇదిగో వడుతున్నాము." అన్నది రమణ గదిలోనుండి.

లలితారమణ అలంకరించుకొని యివతలకువచ్చినారు. వారిరువురకు నాలుగేండ్లు మాత్రమే హెచ్చుతగ్గు. తల్లిపోలిక పిల్లలు. పచ్చని శరీరచ్ఛాయ. గుండ్రని ముఖములు. నల్లనిశిరోజములు. బారెడు కన్నులు. తీర్చిన కనుబొమ్మలు. చక్కని యంగసౌష్టవముగలతేగుమాత్రపుపొడగరులు. రెండేండ్లనుండి రమణ పట్టణ కాపురము చేయుచున్నది. కాపురమునకు వెళ్లినమరునాడే కడియాలు చెరిపించిపట్టాలు, కంటెకరగించి పలకలగొలుసు చేయించినది. పొట్టిచేతులు, పలక మెడలుగలరవికలుకుట్టించినది. కొండిసిగమాని వాలుజడ, తప్పిన జెవులపై బడునట్లు తలకట్టుదువ్వి వెనుక బర్మాముడివేసి యీప్రక్కనుంచి ఆప్రక్కకు పువ్వులు తురుముటకారంభించినది. ఈలా వేషమంతయు మార్చినది. దానితో నడకలో నొయ్యారము వచ్చినది. లలిత వివాహమునకు వచ్చినపుడు పల్లెటూరిముత్తయిదువులంతా గేలిచేసినారు. కేవలము బాహ్యపరివర్తనమే అభ్యుదయమనుకొనువారిటులహాస్యాస్పదులగుదురు కాబోలు. లలితయింకను పల్లెటూరియందే యుంటచే రమణవలె తరిబీదుకాలేదు. పట్టణనాగరికతను చూచినదగుటచే గొంతమార్పున్నను ప్రస్ఫుటముగాలేదు. చెల్లెలికి దిద్దుటలోనే రమణకీఆలస్యమైనది. పట్టణఫక్కీనిఇరువురు ముస్తాబై వెండికుంకుమభరిణ పుచ్చుకొని పిలుపునకు బయలు దేరినారు.

"అల్లా కాసులపేరుచూచుకొంటూ మావదిన యేగుమ్మముమీద నేనా పడుతుందేమో?" అన్నాడు కనకం అరుగుమీదకూర్చుని.

* * *

కొంతతడవకు సరికి బిలబిలమని పేరంటమున కందరువచ్చిరి.

ఒకపెద్దముత్తయిదువు లలితపైట దిగలాగి కాసులపేరు చూచి "బాగుంది" అన్నది.

"కొంచెము పొడుగైందికాని తరువాత తరువాత సరిపోతుంది" అన్నదింకొకతె.

"చేతబాగుందినువూ! మాపిల్లకేకింత బాగాలేదు" అన్నది మరియొకతె.

"ఎన్నికానులో! నేనిల్లాంటిదే చేయించుకోవలి" అన్నది ఒక ఉద్యోగస్థుని భార్య.

"నీకేమో! బంగారుపిచికవు. మీఆయన రెన్నైనా చేయిస్తాడు" అన్నారొకరు.

"చాల్లెమ్మరూ." అంది ఉద్యోగస్థుని భార్య.

"మీ ఆయనేమిచ్చేడే రమణా!" అన్నారింకొకరు.

"ఏమిటిచ్చేదీ?", అన్నదిరమణ.

"రమణా! రేమిటీ? ఎన్నాళ్లకొచ్చావే అమ్మా! కొంగుణ్ణివిడిచిపెట్టలేకుండా వున్నావు?" అన్నది దవడలు నొక్కుకొనుచు ఒకముసలమ్మ.

"లలితపెళ్లికే రావడం. తరవాత రెన్నిమాట్లడిగినాపంపందే" అన్నది శాంతమ్మ.

"చూడలేదని పెద్దవాళ్లు దేవుళ్లాడుతారు కాని, వాళ్లు చిలకా గోరింకలలావుంటారు" అన్నది ముసలమ్మ.

* * *

పరస్పరానురాగసంభాషణలు, ఆలింగనములు ముగిసినవి. వస్తువాహనముల పరీక్షలైనవి. చీనిచీనాంబరముల ధరలు తేలినవి. ముదురులేతరంగులవ్యత్యాసము గుర్తింపబడినది. లలితారమణలిచ్చిన సుగంధ ద్రవ్యముల తావులులేచినవి. ఫలతాంబూలసత్కారములు నడిచినవి. అచ్చటలతో ముచ్చటలతో ఆనంద ముగా పేరంటముజరిగినది.

"ప్రొద్దు గ్రుంకిందమ్మా! ఇంటికి వెళ్లా" లని ఒకరొకరేలేచినారు.

* * *

"అనుకున్నంతసేపు పట్టలేదు. ఇక్కడికి లలితశ్రావణపట్టీ తేవడంకూడా అయింది. ఇంకదాని శోభనము దాకాహడావిడేమీలేదు" అన్నది శాంతమ్మ.

## ప్రవాసి

పెన్మరాజు రాజగోపాలముగారు బి. యె.

శ్రావణమాసవాసర నిశాసమయాంతరమిద్ది; మేఘమా
లావళి చిమ్మచీకటు లిలాతలమెల్లనునిండ వర్షధా
రావృతిజేయుచుండెను విరామమొకించుకిలేక, దివ్యగో
దావరి వీచికాకరశితానములూగగ నేగు నేడకో.

ప్రళయహాసము జేయుచంచలభుజంగి
కాలుమేఘంపురక్కసి గర్జసలుప
మేడపై నుండి నేనటుజూడచూడ
భీతిగొలిపెడి నదియేమి హేతువుననో?

పొలుపుగవర్షధారలను ముత్తెపుబేరులదాల్చి మబ్బుతు
చ్ఛ్రాళులుచెలంగి వర్షరమచేల్పువిరహించె నవీనజీవనో
జ్వలితమునాచునీప్రకృతిసర్వము దాల్చెను శ్యామలత్వమున్.
వలపుగుబులొక్కన నన్మిథునపాళిసుఖింతురు వానకారునన్.

# శ్రావణముక్తావళి

ఓలేటి సీతారామమూర్తిగారు

౧

స్వచ్ఛగృహసీమలెల్లను సంస్కరించి
ప్రాలుమాలిక లేకాంధ్రబాల భక్తి
వేచియున్నది నవపుష్పవితతితోడ
లలితశ్రావణలక్ష్మిదర్శనముకొఱకు.

౨

అంబరోత్తుంగదివ్యసౌధాంతరమున
హేమకాంతులఁగారు మొయిళ్ల తెరల
విరిసి హసియించు శంపాపవిత్రమూర్తి
శ్రావణాంగన సొబగుమైతీవయేమొ?

౩

పెదవివిరిసిన లేనవ్వువిరులతోడ
ముగ్ధనేత్రాలసౌందర్యమూర్తితోడ
వాలుజడపూలసౌరభశ్రీలతోడ
శ్రావణకుమారి యదిగొ సాక్షాత్కరించె!

౪

గ్రీష్మభానుని భీకరదృష్టి మాడి
వర్షపాతాన రేకెత్తి పచ్చగిల్లి
ప్రియమునించు నీపచ్చికబీళులెల్ల
శ్రావణకుమారి నాట్యస్థలాలొ యేమొ?

౫

తూర్పు తెలవాఱఁ బుణ్యవధూటులరుగొ!
జలకమొనరించి పట్టువల్వలుధరించి
దేవతోపాసనోత్సాహ దీక్షఁగొనిరి
హైందవాచారసంప్రదాయాభిరుచిని.

౬

శుభ్రవసనాలు మురిపెంపుశోభలొలయఁ
బాణిఁగుంకుమభరిణ విన్నాణమొలుక
హాసనరేఖలతోఁ బేరటాండ్రఁబిలువ
వెడలుచున్నది పుణ్యసాధ్వీమతల్లి.

౭

తలిరుమంకెనచెంగావితళ్కులెసఁగు
పూపపారాణిఁ బసుపుక్రొంబూతసిరుల
దర్శనీయంబులగుచును దనరు పేర
టాండ్రచివురుపాదాలు పూజ్యంబులౌర!

౮

శ్రావణమనోజ్ఞ శుక్రవాసరమునందు
వీథివీథులఁ దిరుగాడు వివిధవర్ణ
వస్త్రధారిణులైన యీప్రమదలెల్ల
రామచిల్కలవోలె నొప్పారుచుండ్రు.

౯

ఈవిశాలమహీతలం బెల్లగెలువ
నెంచి మన్మథుఁడంపు వాహినివిధానఁ
గ్రాలుదురు శుక్రవాసరవేళలందు
వీథులఁజరించు సంసారిపిల్లలౌర!

౧౦

చైత్రదినములఁ బెండ్లిముచ్చటలుదీర
పొల్చునీశుక్రవాసరముఖములందుఁ
బతిగృహాన లక్ష్మిపూజ పరగఁజేయు
వధువుహృది నేయమృతదివ్యవాంఛకలదొ?

౧౧

పరిచితముకాని యేసంద్రభాగమందొ
నద్దెసలఁగళవళపడునాకభాతిఁ
దారులాసను ముగ్ధనేత్రాలవింత
తోప విభుగేహమందావధూలలామ.

౧౨

మసృణకబరీభరములోని పసిడిమిసిమి
సంపెగలవాసనలు గుబాళింప సాగియు
జవ్వనులమోరచూపులు నివ్వటిల్లు
శ్రావణము నిత్యమోదలీలాప్రదంబు.

# ఋతు లక్ష్మి

బొడ్డు బాపిరాజు గారు

౧

గగననర్తనశాల మేఘములగముల
తాండవముసల్ప విద్యుల్లతామతల్లి
నాట్యకేళీవిలాసాభినయములరసి
మోదబాష్పముల్ రాల్చె జీమూతపటలి.

౨

తీవెపరదాలమరుగున నావహిల్లు
సంతసమ్మున నెమలినెలంతలరయ
జిలుగుహొంబట్టుతళుకుఁజీరెలుధరించి
విపినమున మయూరము పురివిచ్చియాడె.

౩

ప్రియముబెంపొంద ప్రథమోదబిందువులకు
కాచుకొనియున్న చాతకగణమునకును
గానుపించెను కన్నులకఱవుదీర
నవనవోదయప్రావృషేణ్యంబుచదల.

౪

మరలవచ్చిన శ్రావణమాసలక్ష్మి
నాదరమొనర్చి యర్ఘ్యపాద్యాదులొసగి
విశ్రమింపగభూదేవి వేసినట్టి
పచ్చికబయళ్లు రత్నకంబళములమరె.

౫

కడిమిపూవుల తావులు గములుకొనగ
పారిజాతసువాసనల్ పరిమళింప
కలువపుప్పొడులందొగి చలువగూర్చి
యుల్లమలరించు పిల్లవాయువులుమసలె.

౬

పచ్చికనుమేసి విశ్రాంతిబడయుచున్న
ఆలమందలమధ్యను హాయిగదుర
గొల్లడొక్కండు పిల్లనగ్రోవినూద
ఆకసమ్మున మొగులు నాట్యములుసలిపె.

౭

పరువమునసున్న నేరేడుపండ్లు; బుడమ;
దాడిమములు; జామలును; సీతాఫలాలు
పంపె శ్రావణలక్ష్మి కుపాయనముగ
చెరుకువిల్తునితేజీలచే వనరమ.

౮

పల్లములుమెరకలును నేర్పరుపరాక
జలముల సమస్థలారుణోన్నలము లేక
మయ్యె, నేర్లుకాలువలు మహానదులును
గట్లొరసిపాఱజొచ్చె నప్పట్లమిగుల.

౯

కొలకులందున నీరముల్ కలకబాఱ
మానససరోవరమునకు మందమంద
యానములనేగజొచ్చెను హంసచయము
వరుసలంగట్టి యాకాశపథమునందు.

౧౦

తొలక దిక్కటులందు మాధుర్యవృష్టి
సరససమ్మోదషడ్జసుస్వరములమర
భువనజాలంబు స్వాగతంబులవచించె
దరియవచ్చిన శ్రావణేందిరకు కరము.

౧౧

సరసులకు జీవనములనొసంగి, కువల
యములకు ముదంబుగల్పించి, అలఘుదాన
జలములను సర్వయాచకచాతకముల
దనిపెడిఘనుండు మీఱె సత్పథమునందు.

# పూ జా వి ధా న ము

ము ద్దా వి శ్వ నా థ ము గా రు

మానవజన్మమెత్తి అంటిముట్టకుండ ఏకాకిగనుండుట యసంభవము. పుట్టిన దాది గిట్టుపర్యంతము మానవున కితరులసేవ (తాను పరులకు, పరులు తనకు) తప్పనిసరి. ఇందుకొఱకే వైవాహిక, సాంఘికాది కట్టుబాట్లు. ఒక్కనిజీవితమునకే ఎందఱిసాంగత్యమో ఆవశ్యకమైయుండు. పరోపకారకృత్యములగు పనులు నిర్వహించుట కెందఱెందఱి సాయము కావలెనో యూహింపదగును. దేశకల్యాణముకొఱకు జరపు ఇట్టి మహాకార్యములే పూర్వయుగములలో 'యజ్ఞము'లపేరిట బరగినట్లు పురాణములవలన తెలియుచున్నది. వనితాలోకమున కేర్పఱుపబడిన యజ్ఞములే 'పూజా, పురస్కారములు.' ఈ వ్రతములు, నోములును మనపూర్వుల అఖండమైన అనుభవపూర్వకఫలము; అపారదూరదృష్టితో సంకల్పింపబడిన ఆధ్యాత్మికప్రథమపాఠము; సర్వతోముఖమగు జీవితసమస్య. సవ్యముగ నాచరించినచో 'చతుర్విధఫలపురుషార్థసిద్ధిప్రదం'బనుమాట నిక్కువమేయగు. ఇట్టి పవిత్రకార్యమున పూజార్హతకై బాలకెట్టి లక్షణములుండవలెనో ఇంచుక యోచించుట సముచితము.

'శుభకార్యేషు సంతోషే, నిత్యలీలావిలాసినీమ్' అని శ్రావణగౌరీవ్రతములోని సూత్రము. వ్రతాచరణ మెన్నోవిధముల సంతోషింపదగిన శుభసమయము! బాల తన కుటుంబరాజ్యము నిర్వహింప తరిఫీయదు బొందుచున్నది. ఆమె కిది పరీక్షాసమయము !

ఒరుల నాహ్వానించుతీరు, తానాహ్వానముపొందువిధము తెలియవలె. ఇంటికి పది మంది పేరంటాండ్రును వచ్చినపుడు పెద్దల నెట్లుపూజింపవలెనో, తోడిసోదరీమణుల నెట్లు సమ్మానింపవలెనో, పిన్నల నెట్లుసత్కరింపవలెనో ఈనడతలెల్ల సుగ్రాహ్యమైయుండవలెను. గ్రామమున సంచారముసల్పి, తోడిసువాసినుల పరిచయము కలిగించుకొని, వారిక్షేమాదులారసి, సంఘీభావము పెంపొందించుకొనుట కిదిచక్కని యవకాశము. నాలుగుగోడల మధ్యను బంధింపబడి స్వాతంత్ర్యరహితులై రను నిందపొందుచున్న హైందవబాలికల కివి పూర్వులేర్పఱిచిన సాంఘికసమావేశములు.

స్నాననియమాదులు, అలుకుముగ్గులు ఆరోగ్యవిషయకమగు మామూలుకృత్యములే. వ్రతములు మంగళాకరములు. 'ఆత్మ'గుణములలో నొకటియగు 'మంగళ'మనగా, "సర్వదా అత్యంతము ప్రశస్తములగునట్టి కార్యములను చేయుటయును, అప్రశస్తములగు కార్యములను వదలివేయుటయును" అని గౌతమధర్మసూత్రములు వక్కాణించుచున్నవి. ప్రకృతము మనమాచరించుచున్న వ్రతములు అమంగళాకరములని చెప్పసాహసింపవలసి వచ్చుచున్నది. "పూజాద్రవ్యాణిసంపాద్య మౌనవ్రతమథాచరేత్" అనికల్పము. అనగా పూజాద్రవ్యములనన్నిటిని సంపాదించి, ముందు 'మాట్లాడకుండుట' యనువ్రతము నాచ

రింపవలయును. ఎంతచక్కని శిక్షావిధానము! అరిషడ్వర్గముల నంతరింపసమకట్టి నిత్యానందప్రాప్తికై దేవులాడవలసిన ఇట్టి పవిత్రసమయమున పూజకు లేమిచేయుచున్నారు? పోరానిచోటులకెల్లపోయి పూవులకోసము గిల్లికజ్జాలుతెచ్చి పెద్దవారలలో క్రోధములు పెంచుచున్నారు. ఇది తల్లులలోపము కాక మఱేమి? రమణీయమగు చిన్నపూదోట ఏర్పఱచి బిడ్డలకు దారిచూపినచో వారే ఎంతో ప్రీతితో పెంచుకొందురే? స్కూలులో 'గార్డెనువర్కు' తప్పనిసరి. ఎందుచేత? ఇన్స్పెక్టరు తనిఖీచేయునుగనుక. దేవపూజ కింటిలో పూలతోట పెంచకపోవుటేల? యాజమాన్యలోపముచే. ఇది మనపూజాప్రారంభ వైఖరి!

ఇక—ఎంతోమంది పతివ్రతల చరితములుండగా పుణ్యస్త్రీలకు ముఖ్యముగ గౌరీ, సావిత్రీవ్రతములు మాత్రమే నిర్ణయించుటేల? యని వివేకులు జిజ్ఞాసచెందకపోరు. అంగనలకు భర్తృసేవయే భగవంతుసేవ. పతి ఆనందమే ఆమెకు కైవల్యపదలబ్ధి. ఇంతయేల? ఇరువురకును భేదమేలేదు; అతడే ఆమె, ఆమెయే అతను. తుర్కీసామెతప్రకారము 'రెండు ఆత్మలు: ఒకటేశరీరమున.' ఇదియే పార్వతీపరమేశ్వరుల 'అర్ధనారీశ్వరస్వరూపము.' అట్టి మహాపతివ్రత గనుకనే "లలితాష్టోత్తర శతనామావళి"లో ఆమెగుణగణము లభివర్ణింపబడి పూజింపబడుచున్నవి. పలుచేరము లొప్పుకొనియుండు పురోహితుడు దంపుళ్లపాట వలె ఏకరుబెట్టుటలో అతనికి దక్షిణముట్టునేకాని పూజకులకు తగుఫలము లభింపకపోవుట సత్యదూరముకాదు. సమర్థులగు తలిదండ్రులు (పెద్దలు) సావధానమున ఈనామావళికి అర్థము తేటతెల్లముగ వివరించి బాలికలకు తెలియజెప్పుటమేలగు. కొన్నిటిలో కొన్నియైన సాధ్యమగు సద్గుణములు వారలలవరుచుకొని ఆచరించునట్లుచూడవలెను. ఎల్లవిధముల భార్యాభర్తల అన్యోన్యత రెట్టించుటేగాని భేదముకల్పింపకూడదు. ఇటులయిననే పారాయణమువలనిఫలము.

సావిత్రీవ్రతముమాట: సీత, దమయంతి, ద్రౌపదిమొదలగు సాధ్వీమణులు భర్తల బలాబలములు పరీక్షించి - స్వయంవరములో విజయమొందిన ఘనులనే- పరిణయమందిరి. పిమ్మట భర్తలకుచేదోడైరి. ఇందు మెచ్చుకొనవలసినసంగతికన్పడదు. కాని సావిత్రియో! ఎట్టి ఘోరకష్టమునకు పాల్పడసంసిద్ధయైనది? వైధవ్యము ప్రాప్తించునను సూచనయెరిగియు ఎంతమాత్రము భీతిచెందక మనోభీష్టము మార్చుకొనకయుంచుకొను టెంతసాహసము? ఆత్మసాక్షిగ తానువరించిన భర్తపైనే తన సర్వస్వమును కేంద్రీకరించినది. మనస్సులోనే అన్నియు నతనికర్పించివైచినది. అతనిఆయువు చెల్లిపోవునన్నందులకే లక్ష్యపెట్టలేదామె; ఇక రూపగుణాదిబాహ్యశరీరప్రకృతులు పరిశోధించునా? సంతసముతో విపత్తు కోరితెచ్చుకొనినది; ఎంతటి నిరుపమానాంశము! కడకు మహత్తరమగు నిర్మలానురాగప్రభావముచేతనే తన ఐదువతనము నిలబెట్టుకొనగలిగెను. ఈపావనుల పూతచరిత్ర

ములు నిరంతరస్మరణీయములై భారతావనిహృదయమున సుస్థిరముగ నెలకొనియుండుటకు కారణము వారి భర్తృప్రేమయేకద?

ప్రకృతమున—నాట, నూట ఒకరిద్దరదృష్టవంతులమాటకేమి? మొత్తముమీద (వయసున) పెద్దలు, తమబిడ్డలను ఐహికవిషయాసక్తికే పురికొల్పుచున్నారు కాని, నిష్కళంకమగు ప్రవర్తనమునకును, సతీపతుల నిర్మలప్రేమాభివృద్ధికిని తోడ్పడకున్నారని చెప్పవచ్చును. వ్రతములు, నోములు ఈకార్యమునకై నియమింపబడియుండ మనపెద్దలు వాని ప్రధానసూత్రములు నశింపజేసి, అందిమిడియున్న ఆధ్యాత్మికవిషయముల ప్రాముఖ్యత నావలద్రోసిపుచ్చి, తాత్కాలికఫలసిద్ధికై లేనిపోనివ్యవహారికపుముచ్చటలు కల్పించుకొని, పూజలకు తగుఫలములేదనియు, ఇదంతయు పుక్కిటిపురాణముఃఅనియు మొదలగు నిందారోపణములు చేయుట తటస్థించుచున్నది.

కొందఱు పెద్దలప్రోత్సాహముచే అమాయికపుబాల "నాకిచ్చుసరికే దాపరించును ఎక్కడలేని దరిద్రమును" అని భర్తకువినివినబడనట్లు తనవాంఛ వినిపింపుచున్నది. కానున కాసపడి చేయుపటాటోపమా ఇది? అర్థముతెలిసినపూజా? అనుకూలదాంపత్యమున కడ్డంకుగల్పించు మలినపువిత్తులివేకదా? ఈలెపోటయిన మానునుగాని ఈమాటవలన భర్తహృదయముపై పడినగాయము మాన్పనౌషధములేదే! పెద్దలబుద్ధి పెడత్రోవపట్టినపుడు 'విడాకులచట్టము'లకు తావు వెదుకవలెనా? కోమలమైన వయసులో నిట్టి దురూహలుప్రబలి, ఆలుమగలలో ద్వంద్వప్రభుత్వము వ్యాప్తిచెంది, వారిని 'రైలుబద్దీ'లవలె ఆజన్మాంతము విడదీయుచున్నవి. క్రమశః ఇవి విజృంభించి యింకను విచిత్రపరిణామమందుచున్నవి! ఒకని శ్రేయ మొకరికవసరములేదు. సంసారములో ఎవరి వ్యాపారమువారిది.

పూజలెవ్విధముగ సలిపిన ఫలములును తదనుగుణముగనే యుండుననుట తథ్యము. వ్రతకల్పములలో ఎన్నెన్నోలాభములు సూచింపబడియున్నవే, అట్లాచరించి మనముమేలు పొందజాలకున్నామే యని చింతించువారు నూటికి తొంబదితొమ్మండ్రుగురు. ఇందులకు మన అవివేకమే కారణము ప్రకృతము—తలకుతగని అసంభావ్యమైన కోరికలు! భగవంతునికనుకప్పి ఒడలుకందకుండ ఈతగింజనిచ్చితాటిగింజలాగుటకై యత్నములు. ఇతరులు శ్రమపడవలె, అయాచితముగ మనములాభము నందవలెనను దురాశలు. ఇట్టి బూటకపుటర్చనలు పరిగ్రహింపుటకు సృష్టికర్త మూఢుడుకాడు. 'పిండికొలదిరొట్టె'; 'కష్టేఫలే' ఇవియే కార్యసాధకోపకరణసూత్రములు. మనమిప్పుడు 'గాలిలో దీపముపెట్టి దేవుడా! నీదేభార'మనుచున్నాము. ఆయనకు బాధ్యతఎక్కువగుటచే పనియొత్తిడివలన, సోమరుల మొరలువినిపించుకొనలేకున్నాడు. టెంకాయల లంచములకులోబడి చదువురాని విద్యార్థులను పరీక్షలో ఉత్తీర్ణుల జేయలేకున్నాడు!

'కొట్టిన, కొమ్మ—చెక్కిన, బొమ్మ—మ్రొక్కిన, అమ్మ'—అను సూక్ష్మసూక్తి యొక్క రహస్యతత్త్వము తెలిసికొనదగును. పూజకు లాధ్యాత్మికసమస్య కగ్రస్థానమొసంగనిది గౌరీదేవి ఆటబొమ్మయే! ఆత్మజిజ్ఞాస కలుగునంతదాక, భగవదంశ గుర్తించునంత పర్యంతము భర్త సామాన్యమానవుడే! మనఃపరిపాకమందినమగువ ఆటిగౌరిలో దివ్య జ్యోతి కనుగొనగలదు; భర్తలో భగవంతుని సందర్శింపగలదు. అట్టి స్త్రీరత్నము ఒక పలుకుపలికినను, క్రియసల్పినను ఇహపరసౌఖ్యదాయకముగనుండును. తాను బాగుపడి, అధఃపతితులైనతోడివారలకు కేలూత నొసంగగలదు. ప్రథమ పాఠములందు తీర్ణలై, హృదయవికాసమందిన కాంతామతల్లులే ప్రకృతము గాంధిమహాత్ముడు సంకల్పించిన 'సత్యాగ్రహ' మహాయజ్ఞమున పాల్గొని ప్రపంచమునంతను సంచలింపజేసి అపూర్వపరివర్తనము గావించిరి;

"బాధలే భాగ్యముగ నొడిబట్టజాలు
భారతాశ్రమతరుణతాపసులు......"

అను సుకీర్తి ఖండాంతరాల దాటినది.

తల్లులు తనయల కనుటతోనే తమపని తీరినదని తలంపక అపేక్షణీయమగు స్వల్ప సంస్కారణములతో పూజావిధానమున శోభ రెట్టించి వానిపై నమ్మకముపుట్టించి ఆధ్యాత్మికసమస్య కగ్రస్థానమిచ్చి కూతుండ్ర కాదర్శప్రాయమగు సతీత్వముబోధించి తాము తరించి ధన్యులగుదురుగాక! అపుడే వ్రతములు సువ్రతములగు! 'ఆర్యధర్మము'లను కల్ప తరువునకు చుట్టునావరించియున్న 'ఐహికవిషయానక్తు'లను కలుపు పెకికివైచి శిథిలమై యున్న 'ఆత్మవిశ్వాస'మను కంచె (అవరణ) తిరుగనిర్మించినచో చక్కనిఫలములు పొంద వచ్చును.

(Based on Swami Rama Tirtha's 'Spirit of Yagna')

## పుణ్యశ్రావణీ!

శ్రీమతి మొగసాటి అప్పలనరసమ్మగారు

సీ. పుణ్యాంగనలు నీవెపుడువత్తువోయని దినము వ్రేళ్లను లెక్కగొనుదురమ్మ
వరలక్ష్మిపూజలు వ్రతములెప్పుడటంచు సంతోషమునముచ్చటింతురమ్మ
మంగళప్రదమైన మంగళశుక్రవారము లెప్పుడనిలెక్కవ్రాతురమ్మ
పండుగవేడుకల్ ప్రకృతిసౌందర్యంబు రాజిల్లుగాదె నీరాకనమ్మ

గీ. తరుణులనుగాచి రక్షించుదానవమ్మ
పుణ్యవతులందరను నీవె బ్రోతువమ్మ
ముచ్చటగదమ్మ ముద్దులపూర్ణిమమ్మ
పుణ్యశ్రావణీ! స్వాగతమునుగొనమ్మ.

# వ్రత ప్రభావమా?

కర్లపాలెము కృష్ణరావుగారు

౧

సుశీల:—పిల్లా! మీ అత్తగారు శ్రావణ పట్టీబంపేరు చూచేవా?

ప్రభావతి:—శ్రావణపట్టీ అంటే యేమిటే? అమ్మా!

సుశీల:—అంటేయేమిటా? దీనిచరిత్రచాలావుంది. పూర్వం శ్రావణపట్టీలులేవు. ఇప్పటి నవనాగరికులు సృష్టించేరువీటిని. పరిణయమైనపిమ్మట పిల్లను అత్తవారింటికి తీసుకొనిపోవడానికి అవకాశముగల్పించి అత్తవారింటి ఆచారవ్యవహారాలు, వేషభాషలు, మర్యాదమన్ననలు, అనుభవంలో పెట్టడానికి పుణ్యప్రదమైన శ్రావణమాసముమంచిదని యూహించి, పెండ్లియైన పిమ్మట వచ్చే ప్రథమశ్రావణమాసంలో పెండ్లికూతురిని అత్తవారింటికి తీసుకపోవడం ఆచారంగాజరిగింది కొన్నాళ్లు. తరువాత రాను, రాను నాగరికతవిస్తరించి విచక్షణజ్ఞానశూన్యులైన కొందరికి పూర్వాచారం మోటైపోవడంచేత, పిల్లను అత్తవారింటికి కొనిపోవడానికిమారుగా పెండ్లికొడుకుగారింటినుండి పెండ్లికూతురుగారింటికి నోమునోచుకోడానికి శ్రావణపట్టీపంపించడం ఆచారమైంది.

ప్రభావతి:—అదాకథ? ఆపట్టీలో యేమేముంటాయి?

సుశీల:—పోయిచూడరాదూ? లేచిరా! తలంటి నీళ్లుపోస్తాను, నోచుకొందుగాని.

ప్రభావతి కాంతులొలికే అధరబింబంమీద చిరునవ్వు ప్రకటిస్తూ లేచి మండువాలోకేగి, అచ్చటనున్న శ్రావణపట్టీకి సంబంధించిన సాంబారాలన్నిజూచి మఱియొక తబుకులోనున్న సన్నకాగితపుపొట్లాన్నిదీసి, ఆత్రంతో అందులోయేముందోనని పొట్లమువిప్పిచూచింది. విలువగల చిలుకపట్టుచీర. తనకోమలహస్తాలతో, వికసించినముఖారవిందముపై చెరలాటలాడుచున్న నల్లత్రాచుపిల్లలవంటి ముంగురులను సర్దుకొని చీరమడతదీసి పొరలసందున పెట్టబడిన కాగితపుముక్కనుదీసి చదువుకొన్నది.

"ప్రియమైన ప్రభావతికి—

ప్రేమలాంఛనముగా సమర్పించినది.

ఇట్లు, ప్రేమపాత్రుడు

విమలానందమూర్తి."

ఆశ్చర్యమొకపంక సిగ్గొకపంకవచ్చి అరికట్టినయి ప్రభావతి ఆనందాన్ని. "ఇదేమిటి నా పేరువ్రాశారు?" అనుకొన్న దాపిల్ల తనలో. ఇదోవిధంగా బాగానేవుందనుకొన్నదిమళ్లీ. ఇంతలో సుశీలవచ్చి "నీమొగుడే పంపేడులే అబ్బురంగా! అస్తమానంచీరజూచుకొంటూ కూర్చుంటావా? కావలసినంతపనివుంది, లేచిరా?" అన్నది.

ప్రభావతికి పదమూడోసంవత్సరంజరుగుచున్నప్పటికి చురుకైనపిల్లగావడంవల్ల నాలుగోఫారం వరకుచదివింది. పెద్దపిల్లగదా అని అనుమానిస్తూ, తల్లిదండ్రులు చదువుమానిపించేరు. లోకవ్యవహారాలు తెలుసుకోవడానికి యిప్పుడిప్పుడే కళ్లుతెరుస్తున్నది ప్రభావతి. తండ్రి "గృహలక్ష్మి" మున్నగు మాసపత్రికలు, నవలలు, నాటకాలు తెప్పించియిస్తూంటే విసుగులేకుండా చదువుతుండేది. ఒక్కతే పిల్లగావటంవల్ల తల్లిదండ్రులు గారాబంగా పెంచుతుంటే సుకుమారంగా పెరుగుతున్నది. మూడుపాళ్లు పసుపు రెండుపాళ్లు

నిండుగులాబి కలిపితే వచ్చే అందమైనరంగుతో చంద్రబింబమువంటి ముఖముగల్గి పట్టుకుచ్చులవలె నిగనిగ లాడుతు పిరుదులవరకు వ్రేలాడే కురులుగల్గి, సర్వాంగసుందరియై, సౌందర్యానికి వన్నెలుచెక్కే విద్య, విద్యకు మెఱుగులుపెట్టే వినయముగల్గి విరాజిల్లుతూంది ప్రభావతి.

2

స్త్రీల కఖండపుణ్యప్రదమైన శ్రావణమాసము ప్రభావతియింట్లోనే అవతరించిందా అన్నట్లు, వస్తూపోతూవుండే ముత్తయిదువ్వులకు విసుగువిరామము లేకుండా కలకలలాడుతు పెండ్లివారియిల్లుమాదిరిగా మంగళ వాద్యములతో, భామినీజనము వేడుకపాటలతో గడచిపోయింది. "మృగయునకు పెద్దపులియెంతో మేకము నంతే" యన్నట్లు శోభాయమానమగు శ్రావణమాసాన్నిగూడ కాలప్రవాహంకొట్టుకొనిపోయింది. క్రమక్రమంగా వారాలు పక్షాలు గతించి మాసాలు నడుస్తున్నాయి. కార్తీకమాసం ప్రవేశించింది. శుభకార్యం కాస్తాముగించి పిల్లను మాయింటికి పంపిస్తే బాగుంటుంది అని అత్తవారు వార్తబంపేరు. ఆవార్తవిని ప్రభావతి ముసిముసినవ్వులునవ్వడంజూచి తల్లిదండ్రులుగూడ "సరే" నన్నారు. ఒకశుభముహూర్తాన నలుగురుచుట్టాలు చేరి ఆకాస్తమొక్కు చెల్లించి పిల్లను అత్తవారింటికి బంపించేరు. జరుగవలసిన మర్యాదలన్ని, యింటి ఆచారాన్ని అనుసరించి యథావిధిగా జరిపేరు. ప్రభావతి అత్తగారింట కాపురంచేస్తున్నది. తనకనుసన్నలమెలగుచూ, వినయవిధేయతలతో ప్రవర్తించుచుండుటచేత అత్తగారు ప్రభావతిని దయగాజూస్తున్నది. విమలానందమూర్తి భార్యను లాలించి, ప్రేమించి, ఆదరిస్తూ ఆనందవార్ధినోలలాడిస్తున్నాడు. బాలదంపతుల ప్రథమానురాగసుఖసంపదలను, భావాలను రెవరు వర్ణించగలరు? సుగుణవతియు సౌందర్యవతియునగు ప్రభావతి తనకు భార్యగావడం తనపూర్వజన్మసుకృతమే ననుకొన్నాడు. "నీకన్న అమూల్యమగువస్తువీప్రపంచమునలేదనియు, నాసర్వస్వము నీవేననియు, నీవులేకున్న లోకమే శూన్యమనియు" అన్నాడు భార్యతో. ప్రణయపాశబద్ధులయిన ప్రభావతీవిమలానందులు అనిర్వచనీయానందమనుభవిస్తూ ఆరుమాసాలుగడిపేరు.

మగడు ఖద్దరంటే అభిమానం జూపిస్తూ శుద్ధస్వదేశీవస్త్రాలనే ధరించుచుండడంచేత తానుగూడా ముతకబట్టలను గట్టుటకలవాటుపడుటయేగాక, ప్రభావతి స్వయంగా రాటముమీద నూలుదీయుటకు ప్రారంభించింది. యుక్తాయుక్తము లెరిగిన చదువుకొన్న పిల్లగావడంచేత, ప్రభావతికి పూర్తిగాదేశాభిమానంయేర్పడ్డది. దేశసేవచేయుటయందు పురుషులకెంత బాధ్యతకలదో స్త్రీలకుగూడా అంతబాధ్యత అంతజవాబుదారీ కలదని గ్రహించింది. ఇట్లా కొన్నాళ్లు జరుగుచుండగా ఒకనాడు ప్రభావతితండ్రివచ్చి పిల్లను పుట్టింటికి పంపవలసినదని వియ్యంకుని అడిగి త్వరలోనే మళ్లీపంపిస్తానని అల్లుణ్ణి బతిమాలుకొన్నాడు. మొదట కాదన్నా తర్వాత దీర్ఘంగా ఆలోచించి 'సరే' నన్నాడు విమలానందునితండ్రి. భర్తను విడచియుండుటకు యిష్టంలేకపోయినా బాల్యస్నేహితురాండ్రను, తల్లిని చూడవచ్చుననుయాశతో "పంపించండి" అని భర్తను ప్రార్థించింది ప్రభావతి. కుటుంబ కందరు యిష్టపడ్డారు. మంచిరోజుజూచి ప్రభావతిని ప్రయాణం చేశారు. "మీరుత్వరలో మావూరురండి, నాలుగు రోజులుండిరావచ్చు" అని భర్తను వేడుకొని తండ్రివెంట స్వగ్రామమువెళ్లింది ప్రభావతి. విమలానందునికి మొదటినాలుగురోజులు కాస్త పిచ్చిపిచ్చిగావున్నా తర్వాత తర్వాత పనిపాటులు చేసుకొంటూ మామూలుగానే తిరుగుతున్నాడు. అప్పట్లో జరుగుచున్న సత్యాగ్రహోద్యమమునందు తానుగూడ శ్రద్ధతో పనిజేస్తూ గ్రామంలో జరుగుతున్న సభలకుహాజరవుతుండేవాడు.

3

ఉత్తమగ్రంథాలు చదవడమూ, రాటముత్రిప్పడమూ, ఈడువారలతో సరససల్లాపాలు ఆడుకోవడమూ మున్నగు పనులతో హాయిగా కాలక్షేపంజేస్తున్నది ప్రభావతిపుట్టింట. నిత్యము రాటానికి పూజచేస్తూ వీలగునప్పుడెల్లా జాతీయగీతాల బాడుతూ దారముదీస్తుండేది. లక్ష్మీదేవివలె రాటముముందు గూర్చొని మనోహరంగా గీతాలుబాడుతూవున్నప్పుడు కళ్లపండువుగా జూచియానందిస్తుండేవాళ్లు తల్లిదండ్రులు. ఒకనాడు

మామూలుప్రకారం ప్రభావతి మహోల్లాసముతో మునిగివుండగా తండ్రి దీనవదనంతోవచ్చి యేదియో చెప్పబోయి చెప్పలేక ఒకజాబును ప్రభావతికిచ్చేడు. తనమామగారియొద్దనుండి వచ్చినదనిగ్రహించి ఆమెయుత్సాహంతో జాబుజదువుకొన్నది. ఎంతయుత్సాహంతో చదవడానికి ప్రారంభించిందో అంతనిరుత్సాహంతో పూర్తిచేసింది. "సహాయనిరాకరణవాదియగుటచే విమలానందుని యధికారవర్గమువారు రెండుసంవత్సరాలు కఠినశిక్షవిధించి రాజమండ్రి జైలులోవుంచేరు" అని ఆజాబులోవున్నది. మఱుక్షణము యింటి ముంజూరునుండిరాలు వర్షబిందువులమాడ్కి ప్రభావతికి కన్నీరు జలజలగారింది. తనజూచి తండ్రికూడా చింతిస్తూ డేమోనని తనలోతాను పొరలి పొరలి వచ్చు దుఃఖాన్ని మ్రింగుకొని "నాన్నా! నేడెంతసుదినం?" అన్నది. గద్గదస్వరముతో తండ్రి "సుదినమా? అలాఅంటున్నావేమిటమ్మా?" అన్నాడు.

"కాదామరి? లోకకళ్యాణముకొఱకు నాభర్త నిర్బంధింపబడ్డాడు. ఇదిశుభవార్తగాదా?"

"నిజమేగాని...నాకు మనస్సునిలవడంలేదు. జైలులో అనేకకష్టాలున్నాయి. నీచాతినీచమైనపనులు."

"నాన్నా! ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలు, స్త్రీలు, వృద్ధులు సైతము దేశంకొఱకు కారాగృహాలకు వెళ్లుచుండ యుక్తవయస్కుడు, విద్యాధికుడునగు మీయల్లునికొఱ కింతదిగులెందుకు? వారివిషయము నాకు సంతోషమే. కాని దేశసేవజేయుభాగ్యం నాకుకూడలభించలేదుగదాయని విచారిస్తున్నాను."

ఇట్లు అంటూప్రభావతి చివాలున లేచి పడకగదిలోకివెళ్లి శయనించింది. ఇప్పుడామెమనస్సులో పెద్ద తుపానొకటి పుట్టుకొన్నది. ఏమిచేయవలెనో తోచడంలేదు. జైలులో యెన్నికష్టాలు పడుతున్నాడో భర్త అని దుఃఖించి తానే తెలివిదెచ్చుకొని నేనుగూడా దేశసేవజేయగూడదా అనుకొన్నది. ఛీ, అధమమగు ఆడుజాతిలో పుట్టేనేమా అని అనుకొన్నది. ఏమేమోతర్కవితర్కాలు జరుగుతున్నాయి. "స్త్రీజాతిని దూషిస్తున్నానేమిటి? లోకాన్ని ముంచడానికిగాని తేల్చడానికిగాని స్త్రీజాతికే సమర్థతవుంది. తనకత్తికి యెదురుకత్తిలేకుండా రాజ్యాలు యేలిన విక్టోరియారాణి ఆడుదికాదా? ఘోరరాక్షసుడైన నరకాసురిణ్ణి చంపడానికి తోడుపడ్డ సత్యాదేవి ఆడుదికాదా? హరిశ్చంద్రునికి అఖండయశము నార్జించిపెట్టిన చంద్రమతి ఆడుదికాదా? ముల్లోకాలను గడగడలాడించే యమధర్మరాజును సైతము ధిక్కరించి భర్తను సంపాదించుకొన్న సావిత్రి ఆడుదికాదా? ఇంతెందుకు? నేటి శాంతియుద్ధాన పాలుగొంటున్న వారిలో అధికసంఖ్యాకులు వనితలేగదా? నేనుమాత్రమెందుకు నడుముకట్టగూడదు? శక్తిసామర్థ్యాలు, తెలివితేటలుచాలకనా?...కాదు, కాదు...జైలులోవున్న నానాథుని విజయధ్వజముతో విడిపించే మార్గంచూస్తాను. నేను నిజంగా పతివ్రతనైతే, నాభర్తకు జయభేరి మ్రోగిస్తాను...ఇప్పుడు నేనేంచెయ్యాలి? నాథ్రర్తనుదర్శించిరావడం నాప్రథమ కర్తవ్యము." అని యేమేమో ఆలోచిస్తూ ప్రభావతి "నాన్నా!" అనికేకవేసింది. తండ్రివచ్చేడు. "నాన్నా! రాజమండ్రిజైలుకువెళ్లి నీఅల్లుణ్ణి చూచిరావాలి, ఈరాత్రికే ప్రయాణం, సిద్ధగావుండు" అని అన్నది. తండ్రి తలయూపుతూ సంతోషంలో వెళ్లేడు. ప్రభావతి భర్తకొకహారము సమర్పించాలెనకొన్నది. వెంటనే లేచి పూలతోటలోనికి వెళ్లి తనకంటికింపైనపూలను గోసుకొనివచ్చి ఓపికతోగూర్చొని శ్రద్ధతో సుందరమైనహారాన్ని తయారుజేసుకొన్నది. ఖద్దరువస్త్రముతడిపి వాడిపోకుండా హారానికిచుట్టి జాగ్రత్తగా దాచింది. భర్తకొఱకు ఫలహారాలు యింకా కావలసిన అద్దము, దువ్వెన, సబ్బు మున్నగు చిల్లరవస్తువులు సిద్ధంజేసుకొని ప్రయాణమై తండ్రితోగూడా 8 ఘంటలరైలులో రాజమండ్రివెళ్లింది.

## ౪

ప్రభావతి ప్రాతఃకాలాన నిద్దరలేచి తలారస్నానముజేసి యిష్టదేవతలనుగొల్చి రాటానికి పూజ చేస్తుంది. చెప్పిన నోములన్నినోస్తూ, పలికిన వ్రతాలన్ని శ్రద్ధతో పడుతువుంది. ఒంటిపూటభుజిస్తూ కటికనేల మీద శయనించడంవల్ల మనిషికొ స్తవలిగినా సహజంగా సౌందర్యవతిగావడంచేత అందచందాలేమితగ్గలేదు. పూర్వంవలె తల్లిదండ్రులతో చనువుగా మాట్లాడడంగాని చెలికత్తెలతో యిష్టాగోష్టిచేయడంగానిలేదు.

రాత్రింబవళ్లు భగవదారాధనదప్ప యితరచింత లేకుండా మంచిరోజులకై నిరీక్షిస్తూవున్నది. నిశ్చయంగా భగవంతుడనే వాడొకడువుంటే ఆభగవంతుడికి భక్తులనుపాలించడమే ధర్మమైతే యింతదీక్షతో, యింతశ్రద్ధతో యింతభక్తితో పూజిస్తున్న ప్రభావతి మొర ఆలకించడా?

కాలచక్రం శరవేగాన్నిమించి పరుగెత్తుతూంది. క్రమక్రమంగామళ్లీ శ్రావణమాసమొచ్చింది. క్రిందటి శ్రావణమాసంలో అత్తవారుపంపిన శ్రావణపట్టీ విమలానందుడు పంపినచీర తలపునకువచ్చి దుఃఖించింది ప్రభావతి. ఈయేడుమాత్రం యెందుకు ఉల్లాసంగా శ్రావణమాసంగడపకూడదు అనుకొన్నది. కృష్ణాష్టమి వ్రతము, గరుడపంచమివ్రతము, వరలక్ష్మీవ్రతము శ్రద్ధతోను భక్తితోను వరుసగాజరుపుదామనుకొంది. స్త్రీలకు పుత్రపౌత్రాదిసర్వసంపదలనొసంగి కామితార్థములు చేకూర్చు ప్రభావముగలదిగదా వరలక్ష్మీవ్రతము అని యూహించుకొన్నది. శుభదినము సమీపించగానే, అనగా పూర్ణిమకు ముందు శుక్రవారమునాడు ఉదయాన లేచి స్నానంజేసి మడిబట్టలు గట్టుకొన్నది. శుభ్రమైనప్రదేశాన్ని గోమయంతో అలికి మంటపముజేసి ఆసనముయేర్పాటుజేసి దానిమీద క్రొత్తబియ్యంబోసి మఱ్ఱిచిగుళ్లు మొదలగు పంచపల్లవంబులకలశంచేర్చిరచి వరలక్ష్మీదేవిని ఆవాహనజేసింది. పురోహితుడిసహాయంతో సక్రమంగా పూజలుజేసి తర్వాత పండ్రెండు కుడుములవాయనదానాలు, దక్షిణతాంబూలాదులొసంగి, బ్రాహ్మణోత్తములకు నమస్కారాలు జేసింది. బ్రాహ్మలంతా ఆశీర్వదించేరు. ప్రభావతి మహదానందంబొందింది. ఎప్పటికైన వరలక్ష్మీదేవియే తన్నుద్ధరించునని తనభర్తకు జయముగలిగించునని నమ్ముకొన్నది. శ్రావణమాసమంతా వ్రతాలతోను బ్రాహ్మణసంతర్పణలతోను గడచిపోయింది.

దేవపూజలతో కొన్నాళ్లు, నోములతో కొన్నాళ్లు జరిగినయి. ఎన్నాళ్లు జరిగితే రెండేండ్లు పూర్తి అవుతాయి? రెండేండ్లకుగదా విమలానందునికి కారాగృహవిముక్తి గలిగేది? ఈవిధంగానే సంతోషంగామత్తి కొన్ని నెలలు నెట్టింది ప్రభావతి. ఒకనాడు ప్రభావతి యెందుకో తనపెట్టెతీయగా అందులో తనభర్త ప్రేమ లాంఛనంగా సమర్పించిన చిలుకపట్టుచీర కంటబడ్డది. వెంటనే ఒకదాని వెనుక నొకటిగా సినిమాబొమ్మల వలె తానుతనభర్తతో అనుభవించినసుఖాలన్ని కట్టెదుట సాక్షాత్కరించినయి. ప్రభావతి కాచిలుకపట్టు చీర కట్టుకుందామని బుద్ధిపుట్టింది. చీరెయివతలికిదీసి పెట్టెబీగంవేసింది. లేచివచ్చి రేగినతలను సవరించుకొని పరిశుభ్రంగాస్నానంజేసి, శుభసూచకమైన తిలకాన్ని దిద్దుకొని చిలుకపట్టుచీరధరించి నిలువుటద్దంలో తన అందాన్ని జూచి ఆనందించింది. ఇప్పుడు తనభర్తవెంటవుంటె.... అని యేమేమోఅనుకొన్నది. ఇంతలో తండ్రి కేక వినబడ్డది. వస్తున్నానంటూ జనకుని యొద్దకువెళ్లింది.

ఊరంతాదీపాలుపెట్టేరు. ప్రభావతి వీణవాయిస్తు కూర్చొన్నది. కొంతసేపైనతర్వాత "ఇవ్వాళ నాకీయలంకారాలన్నియెందుకు? ఎవరుజూచి సంతోషించను?" అనిఅనుకొన్నది. "ఎందుకోలే, నాపిచ్చి నాకానందం" అని తనలోతాను చెప్పుకొన్నది. తండ్రి భోజనానికి రమ్మనమనిపిలిచేడు. వీధివాకిలి తలుపు గడియవేసివెళ్లింది. తండ్రికంటె ముందుభుజించి లేచివచ్చి కుర్చీలో కూర్చొని ఆకాశపంచాంగం గుణిస్తువున్నది. తల్లిపక్షిమ్మంటే తండ్రి యింకా భోంచేస్తున్నాడు. వీధిలో యెవరో తలుపు తట్టుతున్నారు. "ఎవరువారు?" అన్నది ప్రభావతి. జవాబులేదు. ప్రభావతి లేచితలుపునొద్దకేగి గడిదీసింది. ఎవరికోసం నోములు నోస్తున్నదో- ఎవరికోసం యీప్రయత్నంఅంతా చేస్తున్నదో- ఎవరికోసం ఉపవాసాలుజేసి శుష్కించిపోయిందో ఆవిమలానందమూర్తి ప్రత్యక్షమైనాడు. ఇంకేంకావాలె? ఇరువురు ఒకరినొకరు చూచుకొన్నారు. ఇద్దరికి నోటమాట రాలేదు. కొంతసేపటికి "ప్రభా!" అన్నాడుభర్త. "రెండేండ్లుకాలేదుగద, అప్పుడేయెలావచ్చేరు?" అన్నది అప్రయత్నంగా ప్రభావతి.

"రాజప్రతినిధి మహాత్మునితో రాజీజేసుకొన్నాడు. మొన్నటి లవణసత్యాగ్రహులతోపాటు మావంటి పాతరాజకీయఖైదీలనుగూడ కొందరిని విడిపించేడు. జయముమాదే".

"ఇదంతా నావ్రతప్రభావమే" అన్నది సగర్వంగా ప్రభావతి.

# శ్రావణమాసపు పేరటాలిప్రశంస

కాళూరి వేంకటరామారావుగారు

౧

సహజసుందరతాప్రశస్తమై భవ్యమై శ్రీమీరుఖద్దరుచీరెగట్టి
విమలాంగకస్ఫూర్తి వెలయించి మురిపించి రాణించుబిగువైన రైకదొడిగి
వదులొత్తుగటిసీమగదిసి ముద్దులుగుల్కు సౌరుదీపించు పెన్‌జడఘటించి
ముఖసీమచంద్రికల్ మొనయ మోహననవ్యమధురసుహాససంపదలనిల్పి

విష్ణునిల్లాలి నర్చించువేడ్క మనము
నందుత్రుళ్లింతలాడ నింపొందురీతి
నీవుచరియించు గృహము లక్ష్మీనివాస
మగుచుశోభిల్లు టబ్రమే మగువమిన్న!

౨

పావనభక్తిసంభరితభావములన్ గడుశ్రద్ధమై రమా
దేవినిబూజజేసియు, నుతింపగ గిన్నెరకంఠమైతి సం
భావితరీతి సత్కృతులబాడుచుచో నిదియక్షలోకమో
కేవలస్వర్గమో యదియొకింతయెఱుంగకయుందుమింతిరో!

౩

ఈవొనరింపగాగల దొకింతయుగ్రిందువడంగనీక పూ
జావిధులన్‌ముగించి జయహారతులన్ బచరింప క్రపున్
దావులచే; నజాండభరితమ్మయి వెల్లెడుకాంతిచేత నీ
శ్రావణమాసవాసరనిశాముఖముల్ రహిజెందె సుందరీ!

౪

చెలులన్ చుట్టములన్ గృహంబునకు సస్నేహంబుగాబిల్చి, వా
రలకత్యాదరభక్తిభావములుమీరన్ వాయనంబుల్ విడెం
బులనర్పించుటలో, ప్రశస్తమగుహిందూధర్మమాతిథ్యని
ష్ఠలసత్కారవిధిన్ గ్రహించెదవుపో; సాధ్వీమణీ! యెంతయున్.

౫

పురవీథుల్ గృహముల్ మనోహరములై బొల్పొందగా నీవు నీ
వరసౌందర్యవిలాసదీప్తిరహియింపన్ వాయనంబుల్‌గొనన్

బొరుగిండ్లన్జని సంఘజీవనపునేర్పుల్ రీతులెన్నింటినో
యరయన్జాలెదు; జ్ఞానకాంతికిని సౌఖ్యస్ఫూర్తికిన్ సుందరీ!

౬

అది కంఠసీమఁగలట్టిచందనలేపమో? ఘోరగ్రీష్మతాపోపశమము
కనులదీర్చినసీటుకాటుక రేకలా యవి? సర్వదృష్టిపీడాహరములు
పదపద్మములగలపారాణియా యది? పూతసౌందర్యసమ్మోహనమ్ము
కురులసింగారించు కుసుమంబులా యవి? భువనకల్యాణసంపూజితములు

హస్తభూషణమా తోర మది యనంత
నిర్మలాంచితప్రణయబంధితజగమ్ము
నగుట నారీమణీ! ధన్యమైననీదు
వ్రతము నిక్కము లోకసౌభాగ్యకరము.

౭

నినుబోలంగలసాధ్వి భార్యయగునేనిన్ వాడెధన్యుం డహో
ఘనహర్మ్యాంతరభాగభోగములనేగానీ; మహాఘోరకా
ననసీమన్ బహుకష్టరాశినయినన్గానీ; యొకేరీతిగా
గనుచున్ నిర్మలస్నేహభావమున సౌఖ్యంబందడే సుందరీ!

౮

ఇదిసౌభాగ్యద మీవ్రతంబునలుపన్ నీదామనోభీష్టసం
పదలీడేరిచిప్రోచి సర్వసుఖసామ్రాజ్యవసీవీథులన్
ముదమొందన్ విహరింపజేయుత : దయాంభోరాశి శ్రీలక్ష్మి నీ
హృదయావాసినియౌచు నిత్యమనురక్తిన్ సుందరీరత్నమా!

## సమర్చనము

అంబటిపూడి నరసింహశర్మగారు

అదియున్ శ్రావణశుక్రవాసరము, నా డావేళప్రొద్దింక న
క్కడుప్రాక్కోణము, నప్పుడే కనులమైకమ్ముల్దిగన్జార, ది
క్కడరన్ మ్రోసెడికుక్కుటధ్వనులు మత్కర్ణమ్ములంజేరి న
న్నదలింపన్ గడుయత్నపూర్వముగ నే నంత న్కనుల్విప్పితిన్.
ఎపుడున్మత్పటుబాహుబంధముల నేకీభావముంబొంది, చి
మ్మపుచీకట్లిల నెప్పుడున్విరిసెనో భాస్వన్మయూఖావళుల్

ఎపుడాకాశపథమ్ముఁజేరినవో తానింతేని గుర్తింప దా
చపలాక్షీమణి కానరా దకట! మత్సంశ్లేషబంధమ్ములోన్.

అలికినయింటిలోన గగనమ్మున చిత్రపురంగవల్లికల్,
పొలిచెను పచ్చగాపసుపుపూత లళిందపదమ్ములందు, వా
కిలికడతోరణమ్ములుబిగింపబడెన్, సతివేడినీళ్లతో
జలకములాడి యప్పటికెసాగ పురంధ్రుల బిల్చువేడుకన్.

పైకిబిగించి వ్రేల్దాకకుండగగట్టు నెఱుపుసిలుకుకోక మెఱసిపోవ
తడియారుటకు జారుముడివైచు నానీలకైశ్యమ్ము నైగనిగ్యమ్ముగూర్ప
నడుచునప్పుడు కనుపుడమితాకనజేసి కాలిమెట్టియలు ఘల్లుఘల్లుమనగ
నలతినెన్నడుమున వలయితంబగు జిగిపసిడివడ్డాణమ్ము మిసిమినొసగ

నుదుటకుంకుమపుంబొట్టు సదుకఁగూర్చి
పసిడికుంకుమబరిణెను బట్టిచేత
నింటనింట లతాంగి పేరంటములకు
బిలిచె శ్రావణలక్ష్మీపూజలనొనర్ప.

ప్రమదలుచేరవచ్చుపిదపన్ పసుపున్ తడిచేసి నారికే
ళమునొకదానికిన్ లలితలంకృతిగాగనుపూసి, మధ్య కుం
కుమతిలకమ్ములుంచి రమకున్ ప్రతిబింబముగా కథానునా
రముగనొనర్చె పూజల కరమ్మభిలాషఫలించునట్లుగన్.

నుదుటకుంకుమమునుంచి తత్పదములందు
పసుపుపారాణిపూత పొల్పెసగగూర్చి
గంధతాంబూలములనిచ్చి గారవించి
కొనియె ముత్తైదులిచ్చుదీవనల నాతి.

సరసపదార్థదానమున చారుసువాసినికిన్, పవిత్రస
చ్చరితుడునై సవిప్రునకు సంతసమున్ పరితృప్తిఁగూర్చి, నా
తరుణిగ్రహించె తత్సలలితాతిపవిత్రవచఃప్రవృత్తమై
వరలు ఫలప్రసాదము భవాంతరపాపవినాశకమ్ముగన్.

శిరమునదాల్చినట్టి తులసీదళమేరియు జారలేదు, తా
కరమునగట్టుతోరము వికారమునొందదు సుంతయేనియున్,
చెరుగదు కుంకుమమ్ము ముఖసీమను, మాయవు చీరబెళ్కు- ల
ద్దిర! తరుణి ప్రశాంతకమనీయవికాసము వెల్వరించెడిన్.

## శ్రావణలక్ష్మి

శ్రీమతి సామవేదుల చిరంజీవమ్మగారు

జలకమాడినపిదప జాల్జాలువారు
పీటిముత్యాలబొట్లొత్తి నిలిచియున్న
యౌవనవికాసయైన నవోఢవోలె
ప్రకృతిదేవత నవ్యానురక్తిగొల్పు.

కోమలసస్యసంకులమైనధాత్రికి
విశ్వరక్షణదక్షవృష్టిగూర్చె
ప్రణయాస్పదులవీడి వత్తలౌ విరహుల
కానందదర్శనం బమరజేసె

పురివిచ్చియాడు నెమ్మిలనాట్యమున కను
రూపతాళముగ నురుములగూర్చె

వినయాదిసద్గుణావిష్టులౌ జనముల
రసవిద్ సమస్తసరసులనింపె

భక్తిపరలక్ష్మిపూజించు బాలికలకు
అత్తవారిండ్లముచ్చట లాడబెట్టె
సకలకళ్యాణసౌభాగ్యసౌఖ్యగరిమ
మంగళముగూర్చె శ్రావణమాసలక్ష్మి.

కొండసానువుల కోకో యనుకేకల
నవమయూరములిచ్చుస్వాగతములు

పచ్చిక మునిపంటబట్టి నిశ్చలదృష్టి
హరిణి కన్విచ్చు నాహ్వానములును
ముసిముసిమిసిమిసినవ్వుల వాడవాడల
తిరుగుజవ్వనులిచ్చు తియ్యములును

భక్తితో వ్రతముల బట్టిపూజలు సేయు
ముత్తైదువులొసర్చు వ్రెంక్కులుగొని

నిత్యకళ్యాణవిభవము నిండికొనగ
పచ్చతోరణమైమెరుపె వానజల్లు
సేస లమరులు సల్లన శేషప్రకృతి
మనములుబ్బగ శ్రావణమాసమందు.

ఎచటజూచిన పూజలే, ఎచటగనిన
లక్ష్మికై చేయువ్రతములే, లక్ష్మిపూజ
లిన్నిటను నోచినమ్మల కేమిసుకృతొ?
సంపదాకరమైనట్టి శ్రావణమున.

# శ్రావణమంగళవారం

నదిగట్టున కూర్చున్నాడు. విహాయసమున వింతకూజితాల సద్దుమొదలయింది. సాగరసంగమం పొందాలని పొంగెత్తి ప్రవాహిల్లుచున్న గోదావరి ఒకసారి తరంగనేత్రాలెత్తిచూచింది. రమ్మని తరంగహస్తాలెత్తిపిలిచింది. అతనిపాదాలు పావంచాలక్రింద నీళ్లలో వున్నాయి. చిరుమీనాలు మిలమిలమెరుస్తూ వాటినిగోకి కితకితలులేపేయి. కాని అతను నిశ్చలంగానే కూర్చున్నాడు.

* * *

ఉన్నిద్రమైనయువిద ఒకర్తుక శివాలయంలోపలినుండి వీధి అరుగుమీద పరుచుకున్న కోమటమ్మ అంగడిదరిగా కూర్చొని ఆమెతో ఏదో ఊసులాడుతున్నది. శ్రావణమంథర జలధరగాత్రితో తూగులాడుచున్నది. ఆమె యౌవనముఖము త్రపాముద్రితం. జ్యోతిఃప్రభనిచ్చుకళ్లు, వయసుపోకిళ్ల బిగయబట్టిన సౌందర్యం. సహజలావణ్యమే జౌపాసనం పట్టించిన ప్రసన్నత దొరలించు దృక్కులు. సౌందర్యార్చనచేసే శివదీక్షాపరురాలు. దేవునికి తనశరీరము ఆత్మ సమస్తమూ నిలువుదోపిచ్చుకున్నది. ఆమె జీవితము శివేశ్వరుని చరణాంకితగీతి.

నిరుడుశ్రావణంలో జీవితం రసప్లావితం. ఈపడూ అంతే.

నిరుడు వరదకట్టి పొంగింది గోదావరి. ఈపడూ పొంగింది.

ఆమెలో యౌవనంపొంగు నిరుటికన్న పెద్దయింది ఈపడు.

జనమంచి కామేశ్వరరావుగారు

నిరుటిపొంగు భర్తృకప్రేమతత్పరతలో నిలిచింది. ఈపడు శివధ్యానతత్పరతలో పొరలింది.

నిరుడు కళ్లల్లో కానిపించేరూపు ఈపడు కళ్లుమూసికొని హృదయంలో యిముడ్చుకున్నది. తనఎదుట దానినే అర్చనకు అలవాటుపడిన దగుటచే శివుని రూపున ప్రతిష్ఠించుకున్నది.

ఆకాశం కారుమేఘాలముసుగు. ముసుగులోనుండి విహ్వలనేత్రాలతో మెరవుకన్నెలువిరహాలాలసలో ప్రియాన్వేషణం చేస్తున్నాయి. ప్రకృతంతావిశ్లేషాశ్రువుల ముసురుపట్టింది. పెంపుడు నెమళ్లు పురివిప్పి నాట్యం చేస్తున్నాయి. వానముసురుకి ప్రియుడు ప్రేయసిరాకకై తల్లడిల్లిపోతున్నాడు. ఊర్వసి నేర్వాలని ఉవ్విళ్లూరిన నాట్యవిన్నాణాలు నెమళ్లు అవలీలగా చూపుతున్నాయి.

నిరుడు శ్రావణమంగళవారం పేరంటానికి పోయి గట్టుమీదుగా వస్తూ, తేమలో నడవడంచేత బురదైన కాళ్లు కడుక్కుందామని రెండుపావంచాలుదిగి కాళ్లురాపాడ ఒంత్రుమట్టికి జారి, ఓసరిలి, ఆమెనీళ్లలో పడిగతించింది.

* * *

నిరుటిశ్రావణంలో అతని జీవితం రసప్లావితం. ఈపడు నిర్వాసనాప్లావితం.

నిరుడు కాంతకౌగిలింతలు. ఈపడు విషాదపు పుక్కిలింతలు.

* * *

అతను క్రిందమెట్టుమీద కూర్చుని జీవితంలో ప్రేమలో పావిత్ర్యము కుంభించు కున్న తన ప్రేయసి అకాలమృత్యుగ్రస్తమ వడం తలచుకొంటున్నాడు. తనువెల్లనిట్టూ ర్పుదొంతరలై విడిపోయి, వరదకట్టి పారు నదిమీద తేలివచ్చు శీతగాలికిచివికి, బాష్పా లజడులై సెలజాలులై వరదల నుద్భృతంచేస్తు న్నాయి. ప్రేయసి జలదాంగనయి ఎప్పటి కైనా తేలివచ్చుననే ఆశయే ప్రతిదివసాంత మందు అతన్నక్కడ నిలుపుతూన్నది. తడి కళ్లు తుడుచుకుని రెప్పల్లోనుంచి గ్రుడ్లు పెకల్చి అదేతేరిపార తనప్రియురాలిని కబళిం చిన పావంచాక్రిందకు చూస్తాడు. వరద పుల్లలు చిక్కుకొని కొట్టుకొని వస్తూన్న చీకుకంప చూసి భ్రమపొందుతాడు.

ప్రియావియోగం అతనిచూపుల్లోనివ్వె రనిల్పింది. నడలలో సోమరితనంనడల్చింది. దేహము నవసిపోయింది. రూపు దూళిదూస రితము. హృదయం బాధాన్నపితము.

"వెదకి వేసారి ఈవెర్రిబతుకెపుడేని
తుదిరేయి కనుమూయునా?"

ఇదే అతనిధ్యానగీతి. ఇదే అతని జీవిత సందేశంకూడాను.

* * *

శ్రావణమంగళవారం. సాయంకాలం. సూర్యాస్తమయమయింది. అంతిమఅరుణ రేఖలు కూడ ఆరిపోయినాయి. ప్రకృతి విషాదంపోసికొను మునిమాపులో కుహూ స్వనాలు సీకసించాయి. మేడవారింటికి పేరం టమునకు పోయి తిరిగి "వంటకు వేళైంది" అనిఒకరూ "పిల్లాడ్ని అత్తగారికి ఒప్పగించి వచ్చేను. పాలకు హంగామాచేస్తున్నా డేమో" అని మరొకరూ యిల్లావాళ్లలో వాళ్లే కబుర్లు చెప్పుకుంటూ ఉరకలమీద, పరుపులమీద, సెనగలమూటలు పట్టుకొని, మొకపిల్లల్ని చంకలపెట్టుకొని, పెద్దముత్తై దువులు యిళ్లుచేరుకుంటూ, శివాలయం దగ్గరఆగి, దూరాన్నుంచే గర్భగుడి వైపు తిరిగి, నమస్కారంచేస్తూ లెంపలు వేసికొని, పోతున్నారు.

ఎదురుగా పసుపుపేరంటాండ్రు పట్టు రెక్కపురుగుల్లా బారులుతీర్చి పులుకు పులుకు, పచ్చకర్పూరముమెసవిన కాటుక కళ్లతో, అటుయిటు చూసుకుంటూ, నిరుడు వారితోపాటు పేరంటమునకువచ్చిన, గత భర్తృకయినా కుంకుమతిలకము, కళ్లకాటుక, మంగళరూపము, మాంగళ్యసూత్రము వదల లక నిశ్చింతగాకూర్చుని మాటలాడుచున్న లక్ష్మిని చూశారు. వెలపరము వెల్లిగక్కి చీదరించుకుంటూ వెర్రిదానిని ఎకసక్కెమాడి నట్లు "నీభర్త ఎక్కడున్నాడు?" అని అందరూ ఒక్కసారి రంకెవేశారు.

"నాదేవాలయంలో, నాశివునిలో, నాహృదయంలో" అంటూ వెర్రిగా అమా యికంగా సమాధానమిచ్చింది లక్ష్మి. ఆమె మాటలు ఒక్కసారి వారి ప్రతిహృదయం లోను ప్రతిశబ్దించేయి. కాని విషపునవ్వు చిచ్చులు ఆలయప్రదేశమంతా విరజిమ్మి శ్రావణమంగళవారపు సెనగలవాయనాలకు తరలిపోయినారు ముత్తయిదువులు.

దారిలో పావంచాలమీద కూర్చుని వెక్కివెక్కి "అయ్యో! అయ్యో!" అని

కుములుతూన్న కాంతమ్మభర్త వెంకట్రావును చూసి, అతని దురవస్థ మెరపుసేపులో గుణించుకొని "పాపం! మనకాంతమ్మభర్త! వెంకట్రావే!" అని జు జు అనుసానుభూతి వచనాలతో సాగిపోయినారు.

వెంకట్రావు విరహబాధకు ఈలోకపు సానుభూతి దొరకింది.

లక్ష్మికి తిండ్రింపులు, ఈసడింపులే ఈ లోకులు కూర్చినమణిహారం.

నీలిమాదేవి అభిసారికయి అడుగు చప్పుళ్లు అన్వేషణమునకు అడకువ నివ్వగా నిశిరాజుకోసం పరువుపరువున బరువుఎదతో వస్తూఉన్నది.

వెంకట్రావు చెట్టుకొమ్మమీద గ్రుడ్లగూబ. క్రింద భయదజీమూతంలో జలజల స్రవించు పూర్ణనది. శివాలయంలో దీపారాధనచేశారు. గంటలు మ్రోగుచున్నాయి. లక్ష్మి దేవళంలోనికిపోయి ప్రదక్షిణంచేసి దేవదర్శనం కావించుకున్నది. ఆమె అర్చనలో నైశ్చల్యం సౌందర్యం పుంజీభవించేయి. వేపుడుసెనగల నైవేద్యం పెట్టింది.

వెంకట్రావు ముత్తయిదువులను చూచి, శ్రావణమంగళవారం తలచికొని, ప్రేయసినితలచికొని వియోగార్తిచే పొగిలిపోతున్నాడు.

* * *

శివాలయంలోని జయఘంటలతన్ని శోకంకూర్కులోనుండి లేపేయి. లేచి మొగము నీళ్లలో కడుగుకున్నాడు. పాదప్రక్షాళనంచేశాడు. దేవాలయంలోనికిపోయి ప్రదక్షిణంచేసి విభూతిమొగాన్ని పెట్టుకొని శివానందలహరి, ముకుందమాలలోని శ్లోకాలు పఠిస్తూ లోలోన ప్రియావియోగమననాన్ని అదిమిపెట్టి బాధవిముక్తిపొంది బైటపడిన భక్తిలో కొంతసేపు నిలిచేడు.

లక్ష్మి నైవేద్యంపెట్టిన సెనగలదోసిలితో కళ్లుమూసికొని శివునికి శ్లోకార్చన చేస్తూఉన్న వెంకట్రావు ఎదుట నిలిచింది. పెట్టిన విబూదిపెండికట్లు, నొసటను కుంకుమబొట్టు, ధ్యానాసక్తిలోవేసిన పద్మాసనం చూచి సాకారియైన శివుడే అనుకున్నది. నిశ్శంకతో, సమధికోత్సాహంతో కృశాంగియై వెంకట్రావును "స్వామీ! చేయి పట్టుడు" అని పలికింది.

వెంకట్రావు ధ్యాననిమగ్నతలో ప్రియరూపం దృక్గతమైఉండగా అవశుడై వున్నాడు. ఆమెమాటలు వీనులుచొరగానే ప్రియరూప భావనాప్రమత్తతలో దోసిలిపట్టి ఆమెదోయిలిని, సెనగలను అట్టులేపట్టుకొని నిలిచిపోయినాడు.

* * *

ఆలయం వెనుకభాగమున సౌదామిని చమక్‌మని చూచింది. ప్రావృట్ మేఘుడు ఆమెదృక్సందేశమును పోల్చుకొని శంఖం పూరించేడు.

"భక్తిపారవశ్యంలో ప్రేమకు ప్రతిఫలం వుంది" అని ఈసందేశమునే వరుణుడు తన సహస్రధాకలితవర్ష ధారాతంత్రుల వీణియపై మీటినాడు.

శివదర్శనానికి వస్తూండే అర్చకుల అడుగుసందళ్లలో కరగిపోయింది ఆ అతిలోక దృశ్యం.

# శ్రీవరలక్ష్మీ వ్రతకథ

పాటిబండ మాధవశర్మ గారు

క. విద్వద్వరవిరచితరస
సద్వరకావ్యప్రపంచవందితచరణా!
విద్విణ్మృతితోషితబల
విద్వేషణ! సకలవల్లవీహృద్రమణా!

వ. దేవా! అవధరింపుము. నైమిశారణ్యమ్మున భాగ
వతకథాశ్రవణాసక్తులగు మహర్షులకు పురాణ
గాథాజ్ఞానసమేతుండగు సూతుం డిట్లని
చెప్పందొడంగె.

ఉ. శ్రీసఖవాక్సఖప్రముఖ
సేవకభావితదివ్యలాసు, కై
లాసగిరీంద్రవాసుని, హా
లాహలపానభుజంగధారణా
భ్యాసుని, కృత్తివాసుని, భ
యంకరహాసుని, గాంచి, ధర్మజి
జ్ఞాసతరంగలింప గిరి
జాసతి యాగతిపృచ్ఛ చేసెడున్.

ఉ. ఓ ప్రమథైకపోషణ! మ
హోరగభూషణ! ఓ జగత్ప్రభూ!
భూప్రమదాళి కే వ్రతము
పొల్పుగసల్పుట పుత్రపౌత్రశో
భాప్రభృతిప్రసాదములు
పాయకగల్గునో ఆవ్రతమ్ము నా
తో ప్రవచింపుడంటయు వి
ధుస్మితరోచులు పొలుగారగా.

క. శర్వుండు, ప్రణమదఖిలసు
పర్వుండు, మనోజగర్వపాటనహరణా
ఖర్వస్మయదుర్వారుడు,
పార్వతి కిట్లనియె మధురవాగ్వైచిత్రిన్.

ఉ. పార్వణచంద్రమండలని
భస్మితరుక్కమనీయవక్త్ర! ఓ
పార్వతి! యే వ్రతమ్ము సలు
పన్ గలుగున్ ధనధాన్యముఖ్యముల్
సర్వసుఖమ్ములద్ది వర
లక్ష్మీవ్రతమ్ము; ఇక దాని నెవ్వరీ
యుర్విని నోచి సంపదల
నొందిరో వల్కెదనాలకింపుమా!

ఉ. శ్రావణపూర్ణిమాసిని స
...రమ్మునగల్గిన శుక్రవాసరం
బీవ్రత మాచరించుటకు
నెంతయునర్హము, వాడు శ్రీరమా
దేవికి ప్రేమపాత్రము, ను
తించిన కాంతల కెల్లవాడు సం
భావితసత్కృపామతి ర
మాసతియిచ్చు నభీప్సితార్థముల్.

ఉ. మాగధభూమి కుండినస
మాఖ్యపురమ్మొకటుండు అష్టది
గ్భాగవిగాహికాంచనవి
భాజ్వలదున్నతకుట్టిమంబు, తే
జోగురుతావిభాసివన
జోద్భవవంశము యాగభాగని
త్యాగతితుష్టసర్వత్రిద
శాలయ మెంతయు పుణ్యభూమియౌన్.

ఉ. ఆనగరమ్మునందు వసు
ధామరవంశమునందు పుట్టి వి
ద్యానిధి, సాధుశీల, విన
యక్రమ, చారుమతీవధూటి, యా
మ్మానిని భర్తృదైవ, మిత
మంజులభాషిణి, సంతతమ్ము నెం
తేనియు మమ్మతోడ పతి
శ్రీప్రకరమ్ము భజించుచుండెడున్.

తే. ఘోరదారిద్ర్యమున గట్టుగుడ్డ తినగ
కూడులేకున్న లేదని కుందులేదు
నిత్యసంతోషి, యామె సాన్నిధ్యమమర
పరిమళమ్ము వెలార్చు, దివ్యత్వమొలుకు.

ఉ. చారుమతీ సతీమణికి
స్వప్నము నందొకనాటి రేయి క
న్నారగ గానుపించె కమ
లాలయ, దివ్యకిరీటరత్నశో
భారమణీయమస్తక, వి
భాసితకోమలమందహాసరే
ఖారుచిరాస్య, నూతనవి
కాసితపంకరుహాసనస్థయున్.

క. కమలాసాక్షాత్కృతికిం
బ్రమోదమునబొంది చారుమతి ప్రాంజలియై
నమితాననయై కొల్చిన
నమితాదృతి లోకరక్షణానందితమా.

'మూడవతరగతి టిక్కెట్లు అమ్ముచోట'




మొదటితరగతి మర్యాద

మొదటితరగతి ప్యాసెంజరు:—ఢిల్లీఎక్స్‌ప్రెస్సు ఎక్కడ?

స్టేషనుమాష్టరు:—సర్! అదిగో అక్కడ ఆమె నిలచియున్నది.




రెండవతరగతి మర్యాద

రెండవతరగతి ప్యాసెంజరు:—దయచేసి, ఢిల్లీఎక్స్‌ప్రెస్సునకు మార్గమేది?

స్టేషనుమాష్టరు:—అయ్యా! ఆమార్గమున.




మూడవతరగతి మర్యాద

మూడవతరగతి ప్యాసెంజరు:—అయ్యా, అయ్యా! ఢిల్లీఎక్స్‌ప్రెస్సుబండికి దారి ఎట్లా? బాబయ్యా!

స్టేషనుమాష్టరు:—(వినిపించుకొనడు)

మూడవతరగతి ప్యాసెంజరు:—(తప్పుదారిపట్టును)

స్టేషనుమాష్టరు:—ఏయి! ఆదారినిపోకు.

మ. కమనీయోజ్జ్వలరత్నకంకణరుణ
త్కారమ్ము రైవారు హ
స్తము నాశీర్గతిసాచి యూనతిడె మం
దస్నిగ్ధగీశ్శైలి, చా
రుమతీ! నీవు మహాపతివ్రతవు ము
ల్లోకమ్ములన్ నిన్నుబో
లిమహాసాధ్వులు లేరు మెచ్చితిని త
ల్లీ! నీదుసాద్గుణ్యమున్.

ఉ. శ్రావణపూర్ణిమాసిని ప
రమ్మునగల్గిన శుక్రవాసరం
బీవు గృహమ్ము దీర్చుకొని
యెంతయున్ బరిశుద్ధదేహవై
నావరలక్ష్మిరూపము ఘ
నమ్ముగ నిర్మలభక్తిముక్తిపూ
జావిధు లాచరింపుము భృ
శమ్ముగసంపదసంఘటిల్లెడున్.

శా. నీదారిద్ర్యము నేనెఱుంగుదును గానీ,
నీదు ధైర్యమ్ము, ప్ర
జ్ఞాధర్మక్రమము, క్షమాగుణమ్మును పరీ
క్షన్ జేయనూహించి ఇ
ల్లౌదాసీన్యము బూనియుండితిని నీ
యందింతకాలమ్ము; ఇం
కీదివ్యవ్రతమాచరించి కనుమీ
యిష్టార్థసిద్ధిన్, సతీ!

శా. ఆచందమ్మున స్వప్నరంగమున దీ
వ్యత్ప్రేమమాధ్వీకసం
ధాచాతుర్యముమీర నాపతిడి యం
తర్ధానమైపోయె, ల
క్ష్మీచంద్రాస్య; సుషుప్తివీడి వచియిం
చెన్ గాంతె యెల్లారికిన్
వాచాదుష్కరమైన స్వప్నగతది
వ్యస్త్రీమణిసాక్షాత్కృతిన్.

మ. నిలువెల్లన్ సభయెల్లనున్ బులకలై
నీరంధ్రపావిత్ర్యని
శ్చలమై కొన్నది దివ్యమైన యొకదీ
క్షన్; శుక్రవారమ్ము తె
న్నులుచూచెన్ పురమెక్కుడై; సిరిపసిం
చున్ గానలెన్ లేతమెం
గ్గలునన్ జిమ్ముకొనం దొడంగె నొక స్వ
ర్గానీతసౌగంధ్యమున్.

మ. తెలవారెన్ భృగువాసరమ్ము; నగర
స్త్రీవక్త్రపంకేరుహా
మ్ములతోడన్ వికసించెపుష్కరిణిలో
బొందమ్ములందమ్ములై
యొలసెన్ గమ్మకషాయగంధములు; న
వోన్మిష్టపద్మస్థశ్రీ
లలనానూపురఘల్లఘల్లధ్వనులు మె
ల్లంగా వినంగాబడెన్.

చ. తెలతెలవారుచున్న యువ
తీమణులెల్ల కృతావగాహలై
చలువమడుంగులందొడిగి
చారుమతీసతియింట నొక్కచో
నలికిమనోహరమ్మయిన
యాసనమేరుపరించి క్రొత్తతం
డులములుపోసి, పైకలశ
మున్ నెలయించిరి లేజివుళ్లతో.

వ. ఇట్లు నిర్మించిన కలశమ్ముపైని శ్రీవరలక్ష్మీదేవి నావాహనమ్ము గావించి యనంతరంబ భక్తి తాత్పర్యగరిమ ధ్యానావాహనాదిషోడశోపచారవిధులం బూజించి దక్షిణహస్తములకుందోరమ్ముల నలంకరించుకొని శ్రీదేవికి పంచభక్ష్యపరమాన్నసహితనైవేద్యము కరమ్ములంగీలించి ప్రదక్షిణం బాచరించువారై యొక ప్రదక్షిణ మొనరించినంత.

చ. చరణములన్ వినంబడియె
చాలగ ఘల్లుఘల్లనిస్వనమ్ము! ఎ
ల్లర చరణమ్ములందు నుజ్జ్వ
లన్మణినూపురముఖ్యభూషణో
త్కరముకరమ్ము రాజిలుచు
గానగనయ్యె ప్రభూతవిస్మయా
తురలయి యొలవారలు ను
తుల్ పొనరించిరి శ్రీరమాసతిన్.

తే. మరియొకప్రదక్షిణమ్ముచేసిరి లతాంగు
లెల్లరకరమ్ము లందావహిల్లె రత్న
రచితహేమాంగదానేకరపళి; జాత
విస్మయమ్మున శ్రీకి జేపెట్టిరాంద్రు.

ఉ. ఆనుప్రదక్షిణమ్ముగ ల
తాంగుల యంగములందుదోచె క
ళ్యాణమయాంగభూషలు మ
హాద్భుతవైఖరి శ్రీరమాకృపా

ధీనతనింతయుంగలుగ
దేమనిపొంగుచునంగనామణుల్
గానముసేసి రమ్యామృత
గాత్రిగుణములు ముక్తకంఠులై.

శా. ఆకంఠమ్మున దేవతాచరిత ము
య్యాఖ్యానసల్ శ్లోకిలా
నీకంఠుంబలె మాకరందమధురో
న్మీలద్గళ శ్రీలతో
వీకన్ గానమొనర్చిరా సభయున దే
వీపాదపూజార్పితా
స్తోకేందీవరపత్రముల్ శిరమునం
దుఁ దాల్చిరా యెల్లరున్.

ఉ. అక్షయసంపదల్ మనకు
నర్యోడుగాతమటంచు లోకసం
రక్షణదక్షమైన వర
లక్ష్మీప్రసాదమునా త్తభక్తితో
నక్షతలన్ ధరించిరి ల
తాంగులు మస్తములందు "సర్వపా
పక్షయమస్తు, సంతతశు
భక్రమమస్తు, శుభోఽస్తు" అంచునున్.

శా. దేవీభక్తవిముక్తభోజ్యముల ప్రీ
తిన్ బాంధవశ్రేణితో
నావామాక్షులు గూడిపాపడిరి, అ
త్యంతమ్ము శ్రీదేవిగా
థావైచిత్ర్యము ముచ్చటించుకొనుచున్
తత్సత్కృపావాప్తభూ
పావాల్లభ్యమ్ము మెచ్చికుల్కికొనుచున్
సంతుష్టచిత్తాబ్జలై.

వ. భక్తలోకవశంకరుండగు శంకరుండు యీ విధమ్మున శ్రీవరలక్ష్మీవ్రతమహాత్మ్యమ్ము నుగ్గడించుటయు పార్వతీదేవి ప్రభూ! యీశ్రావణమాసంబునం బోవర్పంగల పుణ్యవ్రతమ్ము మరియు నానతిండనుటయు.

ఆశ్వాసాంతము

క. విమలాకారాంతరరమణీ
రమణీరమణీయహాసరచనా ప్రమదా!
ప్రమదాకుచకుంద్రాభ
ద్రమనోహరవక్ష! శ్రీమదనగోపాలా!

శా. రక్షోనాయక ఘోరవీరభటభ
ద్రానేకపానీకహ
ర్యక్షా! అక్షయసైభవా! భవవిదూ
రా! దూరదూరాయమా
నాక్షీణోత్కటపాపశృంఖల! ఖల
వ్యాపారవిచ్ఛేదనా
ధ్యక్షా! దక్షసుతావరా! వనజజా
తాండైకసంరక్షణా!

ఫలశ్రుతి

ఉ. ఈకథచొప్పునన్ నడచి
రొంతయు భారతసుందరీమణుల్
లౌకికపారలౌకికఫ
లమ్ములనంది సుఖింత్రుగాత! దే
వీకరుణాకటాక్షమితి
వేలసుధారసవృష్టి భారత
స్త్రీకుసుమాంగలక్ష్మీవళి
శ్రేక మొనర్చెడుగాత నిచ్చలున్!

—సమస్తమంగళానిభవంతు.—

# వ్రతసందేశము

గంధం సీతాపతిశర్మగారు

మ. వ్రతసూత్రంబుధరించి తద్వ్రతచరిత్రంబెల్లఁ దాఁ బాడి య
క్షతలన్ శీర్షమునంధరించి పిదప న్గాత్యాయనీదేవికిన్
స్తుతితో వాయనమిచ్చి మైదువుల సంతోషింపఁబూజించి నం
యుతతాంబూలనువాయనంబొసఁగఁగా నొప్పున్ గుమారీమణీ!॥

# వర్షర్తువు

శ్రీమతి మదనుంచి అనం

ఆకాశముపై కఱ్ఱులెత్తుకొని
కన్నులపేదరికంబు గీటుకొన
భగవంతునిపై భారముంచుకొని
విత్తెడు కర్షకవిభులున్నా మా
కోపుటెడ్లపై కోటీరూ మా
కొట్టము ముంగలికోనేరు మా
పశువులగాంచెడి పాలేరు నీ
కుండలపోతకు గొనగొనిరే.
గొలగొలజారెడి కొండవాగులూ
పసరులుగ్రక్కెడి పచ్చికపట్టులు
జీబులుదేరెడి చివురుజొంపములు
మోసలుగట్టిన మొలకపైరులూ
అర్ఘ్యపాద్యముల నర్పించూ ప
చ్చాకుపుట్టముల నందించూ లే
జాజులపానుపు సవరించూ మే
ల్పసిమిజాలరుల బంపించూ ఓ
సజలజలదమా! స్వాగతమా!
ఏరువాక కీవే తెంచినవో
ఘుమఘుమరాలును తొలకరిచినుకులు
గమగమలాడును కమ్మవాసనలు
చిలపలుకట్టును చిన్నిగుంతలును
గడబిడబడు వడగండ్లు రాళ్లవలె
సూరెలజారెడు నీరుపట్టుచును.
తధిమిత యనుచును దాళమువేయుచు
అరరేపదముల నానందించుచు
హైతక్కనుచును దడియుదు రత్తరి
పిల్లలపాలిటి పెన్నిధి వోయి!
చేతికొలఁది పనిచేకురు రైతుకు
మొలకగట్టుదురు ముందుగవిత్తులు
అయ్యవారు మాకొను సాగుకని

కోపుటెడ్లజలకమార్చికట్టెదరు
పూసలుదాపినగొసెనలూ బం
గారముబొదిగినగంటలునూ సిం
గారమొలయుసిగమోరలునూ మా
పూలరంగడా! పుడమికిరావోయీ!
తలుగనినూనియ మెఱుగుదీవియల
డమడమయురుములు డప్పులుమ్రోయగ
చిచ్చరపిడుగుల చిద్విలాసముల
అర్జునయనువా ర్నాదరించుచును
గాదిలిప్రజలను ఘనదానంబుల
శీతదృష్టి వీక్షించుచు బ్రకృతిని
రాజవై భవము రంజిల్లంగా
గాలిరథముపై గదలివత్తువోయీ.
పడమటికనుముల బరువులెత్తుచును
తూరుపుగొనల దొంగిచూచెదవు
ఖండవృష్టియని గర్జించెదు మా
కాపుకొమారుల కండ్లనీళ్లతో
పిడకలు పుడలు పిండిపప్పులును
ఎండబోయుతఱి నేతెంచితివా?
సుదతులుపల్కెడి సూటిపోట్లతో
తొఱ్ఱియిండ్ల దలదూర్చితివంటే
చాకలిమంగలి చాపెనతో బ
ల్చలిగాలిని వడిచంకబెట్టుకొని
పందిరిపాకల సందుదూరితివ
ముదివగ్గుల మామూలతిట్లతో
దరుగవు పెరుగవు ధర్మజీవనా!
సస్యశ్యామల! సాధుజీవనా!
మాకేటటకు లోకపావనా!
నీదర్శనమగు నీరసావనా!
మాటునదాచిన తాటిగొడుగులును

పల్లెబాబుచే బట్టించెదవోయి.
కమతగాండ్ర కరికెంతముగూర్తువు
గొల్లవారితలగొంగళ్లిడెదవు
అటునిటుపనికై యరిగెడుసతులకు
చేటలునెత్తిన దీటుగొలిపెదవు
కఱ్ఱపెత్తనముగల పెద్దలకును
గుడ్డగొడుగు గీల్కొలుపుదువన్నా
కొమ్ములుదిరిగిన కోటీశ్వరులకు
చెప్పులుచేతికి జేర్చికులికెదవు
మూలనమూల్గెడు ముసలమ్మలకును
దంతాలూడిన తాతయ్యలకును
పేలాలనుదిన ప్రీతిగొల్పెదవు
చిఱుతిండ్లన్నను జెవుల్గోసికొను
పసిపాపలకును భ్రాంతిగొల్పెదవు
చుంయిచుంయిమను జొన్నరొట్టెలూ
గుడబిడగోడిన గోదుమకొరడులు
చిందివెల్లనగు కందిబొంగులును
పొరలూడ్చిన లేవరిపేలాలూ
కానుకనిత్తుము కరుణించుమా మా
పిల్లనిత్తుమూ ప్రేమించుమా మా
పొలముబుట్టలను పోషించుమా ఈ
తరుణములో మముదర్శించుమా.
నోములుముదరా నోతురులేమలు
కాన్కలిచ్చెదరు గౌరీపూజకు
పాలబొండ్లములు పాయసములు లే
పూలగుత్తులును పునుగుసెజ్జలును
పరవడిదినముల బసరుపొలంబుల
కుంటగట్లపై గుఱ్ఱలతోసహా
వానదేవుడా? వర్షిలజేయుము
ఆరగింపవే యమృతాన్నంబని
కర్షకవర్యులు గనుప్రార్థింతురు
జాలిలేద మాచేలువట్టువడె
గడబిడజేతువుగాని కురియవే
పేరుకుదగినటు పెత్తనమేదీ?
చిల్లరచినుకుల జిటపటగురిసియు
పాపలనిండ్లకు బరువెత్తింతువు
చుట్టమునీవును సూర్యోదయమున
అడుగువెట్టితిర మిడుకుదురేనీ
కన్నబిడ్డలే కర్షకులూ వా
రున్న దేశ మత్యున్నతమూ మా
యున్న స్వర్గవిరాయన్నలచే సం
పన్నిలయంబగు భారతమూ.

## స్రావణి

సహదేవ సూర్యప్రకాశరావుగారు

౧

శ్రావణచంద్రికామధురశాలల నీతెలివాలుకన్ను రా
గావిలమై చలింప, విరికాంతుల జాలులజాలువార్చి, పూ
దీపలు మ్రోడువోయి తరితీపులువోయిన స్వప్నవాటి, ని
ద్రావిరతిన్ వినీలచికురాలపదాలనిడూర్పుబుచ్చెడిన్.

౨

ఏవలపన్నినావొ కలగింపులువోవనినాయెడంద బం
ధావిలమైతపించి కలతన్ నిసిజింతలువారె, రాగమున్

ప్రోవులువడ్డజీవితపథమున్ మసివారిచిపోయినావు ఈ
శ్రావణయామినీహృదయరాగములన్ వసివాళ్లువార్చుచున్.

౩

ఏ వెలిదమ్మిపూవుకృశియించిన నావిరహాశ్రుపాళికా
జీవిక, జీరవారిన విశీర్ణహృదంతరశోకవేదనన్
రేవెలుగేని మ్రోయదు, దరిద్రము; శూన్యము; పాడువల్లకా
డీవిధిహస్తచాలితము ఈ బ్రదుకెట్టిసమాప్తి కోరునో.

౪

నేనువిషాదగీతికల నీపదసన్నిధి పాడినాను, కా
నీ, నిదురాలసాన బరువెత్తినకన్నులుపత్క్మలించి స్వ
ప్నాన రహస్స్మృతిస్పృహాల వ్రాలినవల్లికవై హసించినా
వీనిసిమాధురిన్ కలగివేగను నాయనుభూతసౌఖ్యముల్.

౫

ఈ వెలివెన్నెలన్ ఎదనటింపులువోయినతీయకోర్కె నె
త్తావి, నిశాసితాంబుదపథమ్ముల అంచులతూగిపోవు ఏ
వో విధురామరప్రణయపూరితవిశ్వవియోగరేఖకన్
ప్రోవులుప్రోవులై విరిసిపోవును నాబ్రదు కార్చిపోవగన్.

౬

నీయనురాగగీతిక కనీనికలన్ తరళించి; శ్యామికా
చ్ఛాయలతేరితేరి, కలసజ్జల తొట్రిలి మాసిపోయె; శో
కాయతనాన నేనెరుధిరాశ్రులనింపిన జీవపాత్ర నీ
వే యమరామృతస్నపితపీథికజార్చితి సన్నసంజగా.

౭

మ్రోయదురాగవీచిక విముక్తహృదంతరవీథి, నీలవై
హాయసవీథినిగ్గుల రెూర్చదు వెన్నెలపుల్గు; తారకా
ప్రేయసికంటినీరు నునువేడితలంపులతారులాడ, కై
సేయకయేనశించు వలిసిగ్గుతోరంగిన నీలినీడలన్.

౮

తెలినురుగుల్లువోవుచు నదీమణి గాతమిసాచికొన్న యా
సలు సకలాశలన్ విరిసి సాగరమేఖలవై లయింప నీ
వెలితికవుంగిలింతల నివేటిపదమ్ములో మూగవోయె; వే
నలికోసలార్చుచీకటికణాల నటించుదు శోకమూర్తినై.

# వర్షఋతువు : శరీరరక్షణ

శ్రీమతి సి. వి. రమణమ్మగారు

## ఋతుచర్య : ఆరోగ్యనియమములు

వర్షఋతువుయొక్క ప్రకృతిసౌందర్య మెంతమనోహరమైనను మానవుల ఆరోగ్యమునకు హానికరమైనందుల కీఋతువు వైద్యశాస్త్రమునందు విశేషము నిందాస్పదమైనట్లు తెలియుచున్నది. కవివరు లనేక విధముల పొగడినను మిగిలిన ఋతువులకంటె వైద్యకదృష్టిచే నిది అధమముగ పరిగణింపబడుచున్నది. వర్షాకాలమున వేలకొలది వ్యాధులుత్పన్నములగుట సామాన్యము గాన వైద్యవేత్తలు 'రోగఋతువు' యని దీనికి నామకరణ మొనరించియుండిరి. వసంతఋతువునందును, వర్షఋతువునందును వ్యాధులు మనదేశమున సామాన్యముగ నంకురించును. వసంతకాలమున ప్లేగు, సన్నిపాతము మొదలగునవియు; వర్షాకాలమున కలరా, మలేరియా, అజీర్ణము, అతిసారము మొదలగునవియు జనులను తఱచు బాధించుచుండును. కాని వసంతఋతువునందు కంటె వర్షఋతువునందు వ్యాధులు హెచ్చుగసంభవించుటచే నిది మిక్కిలిభయంకరమైనదని చెప్పుటకు సందేహములేదు. ఇంతియేగాక ఈఋతువునందు వ్యాధులు శీఘ్రముగ శాంతముగూడనొందవు. పరిపూర్ణారోగ్యవంతులగు యౌవనులకుగూడ ఈకాలమున కొద్దిగనో గొప్పగనో అనారోగ్యము గలుగుననుటకు సందియము లేదు. ఇందుచే నాబాలగోపాలమును ఆహారవిహారములయందు ఆరోగ్యనియమములను పాటింపవలయును. శిశిరకాలమునందును, వసంతగ్రీష్మకాలములందును సూర్యునిగతి ఉత్తరాయణమునైపు జనుచుండుటవలన భూమియందలినీరు ఆర్చుకొనిపోవును. ఇందుచే మనుష్యుని శరీరమందు వేడిమి, వాయువు ఉత్పన్నములగుచున్నవి. శరీరబలము తగ్గి జఠరాగ్ని మందమగును. ఈమందమైన జఠరాగ్ని వర్షఋతువునందు ఇంకను మందమైపోవును. వర్షాకాలమున మేఘములు వర్షించుటచేత భూమిచల్లబడినదై దూషితజలవాయుసమ్మేళనముచే మానవుని వాతాదిదోషములు ఒకేసారిచెడి అతనిశరీరమందు వాయువృద్ధి అధికమైపోవును. గ్రీష్మఋతువునందు ఎంతబలము తగ్గిపోవునో అంత వర్షఋతువున వాయువృద్ధియగును. ఇందుచే మనవైద్యశాస్త్రమున ఈకాలమున వ్రతములను, ఏకాహారము మొదలగు యనేకప్రకారములగు వ్రతవిధానములను నిర్దేశించియున్నారు. ఇప్పటికి చాలమంది వ్రతములనాచరించుచున్నను ఇందలి వాస్తవికప్రయోజనమును కొద్దిమందియే గుర్తించియున్నారు.

### వర్షఋతువునందు పాటింపవలసిన విధులు

శ్లో॥ వర్షాస్వగ్నిబలేక్షీణే, కుప్యంతిపవనాదయః।
తస్మాత్ సాధారణః, సర్వోవిధిర్వర్షాసుచేష్యతే॥

అనగా వర్షాకాలమున అగ్నియొక్క బలము క్షీణించి వాతాదిదోషములు కుపితములయి శరీరారోగ్యమునకు భంగముకలిగించును.

శ్లో॥ వర్షాసువ్యాకులేవన్నా, భోజ్యమక్లేదివాతజిత్
పరిశుష్కంలఘుస్నిగ్ధం, ముష్ణామ్లలవణంచయత్॥

అనగా వర్షఋతువునందు శరీరమందుండెడి అగ్ని మందముగానుండుటవలన జలభాగమధికముగాగల పదార్థములను; వాతనాశకములైనట్టియు, సులభముగజీర్ణమగునట్టియు సాధారణభోజనము అత్యంతహితకరము.

శ్లో॥ వర్షాసుప్రబలోవాయు, స్తస్మాన్మిష్టాదయుస్త్రయః
రసాఃసేవ్యావిశేషేణ, పవనస్యోపశాంతయే॥

అనగా ఈ ఋతువునందు వాయువు ప్రబలముగనుండుటచే మధురములగు పదార్థములును, పులుపు పదార్థములును, ఉప్పని పదార్థములును వాయుశాంతి కొఱకై సేవింపవలయును. ఈకాలమున పులుపుపదార్థములు హానికరములని కొందరి యభిప్రాయము. ఉప్పనివియు, తియ్యనివియు వాయుశాంతి కెంత లాభకరములో పులుపుగూడ నట్లేపని చేయునని మాపాఠకులు గ్రహింతురుగాక. పైనవ్రాసిన చొప్పున మధురములేయని విస్తారముగ మిఠాయి మొదలగు తినుబండారములుగాని, ఎక్కువ పులుసుగాని ఎప్పుడును తినకూడదని నేను సవినయముగ ప్రార్థించుచున్నాను. ఇంతియేగాక కటుతిక్తములగు రసపదార్థములుగూడ సేవించినలాభకరము.

శ్లో॥ భవేద్వర్షాసువిపులః, క్లిన్నత్వంయద్విశేషతః
తత్ క్లేశశాంతయేసేవ్యా, అపికద్వావాదయస్త్రయః॥

వర్షాకాలమున శరీరము క్లేదయుక్తమగుటచే దానినివారణకై షడ్రసములును సేవించుట యుచితము. గోధుమలు, పాతబియ్యము, పెసరపప్పు, కందిపప్పు, శనగపప్పు, నెయ్యి, పాలు, పెరుగు, మజ్జిగ, నూనె మొదలగునవియు; పొట్లకాయలు, కాకరకాయలు, ఆగాకర, తోటకూర, మెంతికూర, గోంగూర, బచ్చలి మొదలగు శాకాహారములును; అంజూరపండ్లు, నిమ్మపండ్లు, దానిమ్మపండ్లు, అరటిపండ్లు మొదలగునవియు విశేషపథ్యములు. ఇంతియేగాక తేనె నీటితోగాని, భోజనపదార్థములతోగాని సేవింపవలయును. భుజించుటకు ప్రథమమున అల్లమును, ఉప్పును చేర్చి సేవింపవలయును. దానివలన అగ్ని దీపనమొందును. జలము ఎప్పుడును ఈకాలమున శుభ్రముగానుండదు గనుక కాచి చల్లార్చి త్రాగినలాభకరము. వర్షపుగాలి స్వాస్థ్యమునకెక్కువహానికరము. కాన నిట్టిగాలిలో విశేషముగ తిరుగకూడదు. ప్రతిదినము తైలమర్దనమొనరించి స్నానము సేయుటయు, సుగంధితములగు పుష్పముల ధరించుటయు, శుభ్రవస్త్రములు ధరించుటయు నిత్యకృత్యములుగా నెంచుకొనవలయును. వర్షఋతువరుదెంచుటకుముందే శరీరమందుండెడి దోషమును వమన, విరేచనముల ద్వారా బయటకి తొలగించి శుద్ధమొనరించుకొనవలెను.

## వర్షఋతువునందుత్పన్నమగు జ్వరము

ఈకాలమున జనించు వ్యాధులలో మలేరియాజ్వరమును ముఖ్యముగ పేర్కొనదగును. ఈదుష్టవ్యాధి మూలముగ భారతదేశమున లక్షలకొలదిజనులు మరణించుచున్నారు. విదేశవైద్యశిఖామణులు దినదినమును క్రొత్త క్రొత్త సిద్ధాంతములను కనిపెట్టి నూతనములగు విశేషములను వైద్యశాస్త్రమున లిఖించుచున్నారు. మన హిందూదేశమున మాత్ర మట్టిసంశోధన లేనిదట్లుండ, పూర్వపు మహాఋషులచే రచింపబడిన సిద్ధాంతములను గూడ మరచుచున్నారు. హిందూవైద్యశాస్త్రజ్ఞులు సర్వమెఱింగినవారనియు, వారుశాస్త్రమునందెల్లను రచించియుండిరను వార్త వాస్తవమైనను మనముస్వయంకృషి చేయకపోయిన శాస్త్రీయమహత్వము మనలకెంతవరకు సహాయకరముగ నుండగలదు? ఐరోపీయవైద్యులు మలేరియాతత్వమును దెలిసికొనుటకై కఠినపరిశ్రమ యొనర్చిరి గాని పూర్ణరూపముగ మలేరియా ఏమియని ఇప్పటికిని గూడ నిశ్చయింపజాలకపోయిరి. "మలేరియా" లేటిను భాషయొక్క పదములతో చేర్పబడినది. దానియొక్క అర్థము "దూషితమగువాష్పము." ఈదూషితమగువాష్పము నాసికరంధ్రములద్వారాగాని, నీటిద్వారాగాని ఉదరమున చేరిన మలేరియాకలుగునని పాశ్చాత్యపండితులు ప్రథమమున తలచిరి. వర్షఋతువునందు నిలచిన నీటిపై సూర్యునికిరణములు ప్రసరించినచో నొకవిధమగు ఆవిరియుత్పన్నమగును. సాధారణముగ గోతులయందును, సందులయందును కుళ్లిన నీటిఆవిరియే మలేరియా జన్మించుటకు ముఖ్యకారణమని తలపబడినది. ఇది ప్రథమసిద్ధాంతము. తదనంతరము మలేరియావిషము సూక్ష్మజంతువులద్వారా శరీరమందు ప్రవేశించునని తలంచిరి. పిమ్మట మలేరియా ఒకవిధమగు దోమవలన నన్నిస్థలములయందును వ్యాపించునని వైద్యవిద్వాంసులు సిద్ధాంతీకరించిరి. మనహిందూదేశమున మలేరియాజ్వరము ప్రథమమున లేదనియు, అట్టివిషమును గలుగజేయు దోమలుగూడ లేవనియు తెలియు

చున్నది. కనుక మలేరియారోగియే ఈవ్యాధికి మూలకారణము. కాని మలేరియారోగి ప్రథమమున నెచ్చటినుండివచ్చెను అను ప్రశ్నకు సంతృప్తికరమైన ప్రత్యుత్తరము దొరకదు. భారతవైద్యులు వ్యాధియొక్క మూలకారణము సూక్ష్మజంతువులని యొప్పుకొనరు. "సర్వేషామేవరోగాణాం, కారణంకుపితామలాః". వాతపిత్తకఫదోషముల పేరు మలము. ఈమూడును తమతమ నెలవులయందు సరిగానున్నయెడల మనుష్యుడు ఆరోగ్యముగ నుండును. లేకున్న శరీరమందు నానావిధములగు వ్యాధులంకురించును. భూమిలో నీరునిలిచి జలవాయువులు దూషితములైనవెంటనే శరీరమందుండెడి వాతాదిదోషములు కుపితములై మందాగ్ని, అజీర్ణము మొదలగు వ్యాధులుత్పన్నములగును. మలినమనుష్యులను భూతప్రేతము లెట్లుసులభముగ వశముగావించుకొనునో ఆప్రకారమే మలినశరీరమును సూక్ష్మజంతువులు వశమొనర్చుకొనును. పరిశుద్ధమగు మనుష్యుని నెట్టివ్యాధియు సులభముగ వశపరచుకొనజాలదనుట నిక్కము. ఈకాలమున దూషితమగు వాయువును పీల్చకూడదు. గృహమందెపుడైనను దూషితమగువాయువు వ్యాపించుచున్నట్లయిన సుగంధితధూపముల ద్వారా పరిశుద్ధమొనర్పవలెను. తూర్పుపడమరలనుండి వచ్చుగాలికూడా దూషితమైయుండుననియే నిశ్చయింపవలెను. రాత్రియందుకూడా అధికముగ బయలున సంచరింపకూడదు. డాక్టరులు మలేరియాజ్వరమునకు క్వైనైన్ అమోఘమగు నౌషధమును తయారొనర్చిరి. జ్వరసమయమున అది విశేషముగ పనిచేయుననుట నిశ్చయము. కాని కొన్నిసమయములందు హానికూడ గలుగుచున్నది. తులసిఆకులును, మిరియములును ఈజ్వరమునకు అమోఘముగ పనిచేయుచున్నవి.

—హిందీ స్త్రీచికిత్సకనుండి యనువాదము.

## ముత్తైదువ

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

కరములఁ బైఁడిగాజులు నిగారపుఁదళ్కులనీనుచుండ నుం
గరములతీరు ముంగురులు కమ్మనితావులఁ గ్రమ్ముచుండ సుం
దరముగఁ గట్టుచీరెయు ముదంబుదలిర్పఁగఁ బేరఁటంబుకై
గరితయొకర్తు తోడిచెలికత్తెలఁ బిల్వఁగ నేఁగుదెంచెడున్.
కాటుకకన్నుల న్నగుమొగంబునఁ గుంకుమబొట్టు కమ్మనౌ
మాటలమంచియున్ బెదవి మానికపుం బెడగం జరాగమున్
మూటగఁ గట్టుచీరె కొన నోమునకిచ్చిన వాయనంబు నా
బోటికి వింతసోయగముఁ బూజ్యతఁ బొల్పెసలారఁ గూర్చెడిన్.
ఏసుకృతాత్మునాతియొకో యీసుమకోమలగాత్రి యెంతయున్
వాసియువన్నెయుం జెలఁగి భాసిలు మేనిబెడంగు నొప్పి యీ
యూసరభూమిఁ బుష్పలతయున్న విధంబునఁ దోఁచెఁ జూడ్కులున్
గాసిలుచిత్తమందుఁ జిలుకన్ సమకట్టె సుధాప్రపూరమున్.

ధవులమైశ్వర్యమెంచి మైదువలు నోచు
వ్రతము శ్రావణశుక్రవారమునఁ జేసి
తోడిసఖురాండ్రఁ బిల్వ నీవాడవెంట
నేఁగుచున్నది కాఁబోలు నీనెలంత.

# శ్రావణప్రకృతి

శ్రీమతి మంగతాయిగారు

(కాళిదాసునికృతికనుకృతి)

మ. అవలోకించితె నెచ్చెలీ! ప్రబలతృష్ణాయాసమై చాతక
ప్రవరం బంబుకణప్రసాదమునకై ప్రార్థింపగా, తోయభా
రవియల్లంబివలాహకమ్ము జలధారాపాతదుర్వారమై
శ్రవణానందముగా ధ్వనించుచు శనైశ్చారమ్ము సాగించెనన్.

మ. తతపాండుద్యుతకోమలోత్పలదళోత్తాలాబ్దసంఘాతచుం
బితశృంగాటకమున్, నిరంతరజలావిష్కారమున్, కించిదు
ద్గతనిస్తంద్రతృణాంకురవ్రజము, మేఘాలోకనోన్మాదవి
స్తృతపింఛాత్మనటన్మయూరము, మహీభృన్మాల వీక్షించితే?

మ. ధరణీభృచ్ఛిఖరాగ్రనిస్సృతము, అధ్వవ్యగ్రతారావళీ
కరమున్, కీటరజస్తృణాకులము, భేకానీకశోకారవో
ద్ధురమున్, కల్మషపాంశురమ్ము, పవనాంధోవక్రపంథాచరం
బురవేగాన్వితమై నవోదకము నిమ్నోర్వీముఖంబయ్యెడున్!

మ. చ్యుతపత్రమ్మగు పద్మమున్ వదలి మంజుస్వల్పఝుంఝుంకృతుల్
శ్రుతిపేయమ్ముగనల్పుచున్ భ్రమరముల్ ప్రోన్మీలదిందీవర
ప్రతతిభ్రాంతిని మేఘదర్శనటద్బర్హిశ్శిఖండాత్మసం
తతిమీఁదన్ విహరించుచున్నవి మదాంధత్వమ్మునన్ నెచ్చెలీ!

మ. కనుగొంటే చెలి! చందనాగురురసాక్రాంతాంగికల్ పుష్పసం
జనితామోదపరీమళీకృతశిరస్సంస్కారలీవర్షుకా
శనిఘోషాశ్రవణాతిభీతలు, ప్రదోషాత్పూర్వమే కేళికా
యనముల్ చేరగ తత్తరింతురువిభీతైణేక్షణాసంఘముల్.

మ. చిరసాద్గుణ్యమనోహరమ్ము, రమణీచిత్తాపహారమ్ము, బం
ధురనైదాఘవిశుష్కభూమిరుహబంధుప్రాయమున్, భూజనో
త్కరమోదావహమున్ చరాచరజగత్ప్రాణాయమానమ్ము, ఈ
శరదర్తుప్రవరమ్ము ఎల్లరకువాంఛాసిద్ధి గావించుతన్!!

—ఋతుసంహారము.

# శ్రావణమాసము: తత్ప్రాశస్త్యము

శ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు

శ్రావణమాసము భరతఖండమునం దన్నివైపుల సకలవిధముల ప్రశస్తికలిగి కొనియాడఁబడుచున్నది. ఈశ్రావణమాసము సహజమయిన ప్రకృతిశోభచేతను, ఐతిహాసికమహత్త్వముచేతను, శ్రుతిస్మృతులందు విధింపబడిన వ్రతవిధులనాచరించుటచేతను ఆబాలగోపాలము సంతోషప్రదమయి వెలయుచుండును. కనుక ఆవిషయములు అతిసంగ్రహముగ కొంతసూచించుచున్నారము.

౧. ప్రకృతిశోభ:— శ్రావణమాసము వర్షర్తువునందు ప్రథమమాసము. గ్రీష్మర్తువునందు జనుల మలమలమాడ్చి ఘోషింపజేసిన గ్రీష్మవాయువులు సమూలముగ నీశ్రావణమాసమునందంతర్ధానమునందును. జనుల గడగడలాడించి నిర్వీర్యులనుగానొనర్చు చలిగాడ్పుల యుపద్రవము అణుమాత్రమయినను ఉండజాలదు. సకలప్రాణిజాతమునకు ప్రాణధారణార్థ మత్యావశ్యకములగు సకలౌషధులకును, ఫలపుష్పాదులకును ఉజ్జీవనార్థము వలయునంత సువృష్టిచేత నీశ్రావణమాసము రమణీయమయి యొప్పుచుండును. భూపురంధ్రీమణి యెటుచూచినను సస్యశ్యామలశోభితయయి, వికసితలతాకుసుమగుచ్ఛయై, పరిపక్వఫలనికరవినమ్రయయి తనకుం గల రత్నగర్భావసుంధరానామముల అన్వర్థకములనొనర్చుచు ప్రేక్షకులకు సకలేంద్రియసంతోషప్రదయై వెలయుచుండును.

౨. ఐతిహాసికమహత్త్వము — ఈశ్రావణమాసమునకు ఐతిహాసికమహత్త్వము చాలగలదు. దుష్టనిగ్రహశిష్టపరిపాలనార్థము పరమేశ్వరుఁ డప్పుడప్పుడు భూమియందవతరించునని భగవద్గీతాది గ్రంథములందు

శ్లో. యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్॥

అని శ్రీకృష్ణభగవాను డానతిచ్చియున్నాడు. అందు నాల్గవతారము లీశ్రావణమాసమునకు సంబంధించియున్నవి.

౧. శ్రీకృష్ణావతారము:— దేవకీవసుదేవులకు పుత్త్రుడుగా శ్రీకృష్ణభగవానుడు శ్రావణకృష్ణాష్టమియందు రోహిణీనక్షత్రమునం దర్ధరాత్రమున అవతరించిన విషయము సుప్రసిద్ధమేగదా!

౨. బుద్ధావతారము:— బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోదనభూపాలుడు చిరకాలము పుత్త్రవిహీనుఁడయి తపముసల్పగా శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయి తానే పుత్త్రుడుగా నీకు బుద్ధుడను పేర ఉద్భవించెదనని చెప్పి యంతర్ధానమయినటుల పురాణములందుగలదు. శ్రీమహావిష్ణువు శుద్ధోదనునకు (బుద్ధభగవానుని తండ్రికి) ప్రత్యక్షమయినతిథి శ్రావణశుద్ధద్వాదశి. కావున శ్రావణశుద్ధద్వాదశికి బుద్ధద్వాదశియను ప్రథ వచ్చినటుల పురాణములందుగలదు. హేమాద్రికృత చతుర్వర్గచింతామణివ్రతఖండమునందు బుద్ధద్వాదశినిగూర్చి వెనుక వ్రాసినవిషయము వివరింపబడియున్నది.

౩. హయగ్రీవోత్పత్తి:— సంస్కృతమును చదువునట్టి విద్యార్థులందఱు పాఠమును ప్రారంభింపబోవునప్పుడు

శ్లో. జ్ఞానానందమయం దేవం నిర్మలస్ఫటికాకృతిమ్
ఆధారం సర్వవిద్యానాం హయగ్రీవముపాస్మహే॥

అని విద్యాధిదేవతయగు హయగ్రీవుని ధ్యానింతురు. ఆహయగ్రీవావతారము శ్రావణశుద్ధపూర్ణిమయందని పురాణములందుగలదు. పంచాంగములన్నిటియందు శ్రావణపూర్ణిమయందే "హయగ్రీవజయంతి"యని వ్రాయబడు చుండును.

౪. కల్క్యవతారము:—శ్రావణశుక్ల షష్ఠీ తిథియందు శ్రీమహావిష్ణువు కల్క్యవతారరూపమున నవతరింపగలడని పురాణగ్రంథములందు చెప్పబడియున్నది.

౫. నాగపంచమి:—నాగపంచమి మున్నగు కొన్ని ఐతిహాసికసంబంధముగలవి కూడకలవు కాని వానినిగూర్చి చర్చించుటకిదియదనుగాదు.

౩. మతవిషయకప్రాశస్త్యము:—బ్రహ్మక్షత్రియవైశ్యులు ద్విజన్ములనంబడుదురు. వీరికి ఉపనయనము రెండవజన్మయనంబడును. ఉపనయనమయినగాని వేదముచదువుటకు అర్హులుకాజాలరు. అట్టి వేదాధ్యయనము నీశ్రావణశుద్ధపూర్ణిమయందే ప్రారంభింపవలయును. కావున బాలకులకందఱకు శ్రావణమాసము వేదాధ్యయనార్హతను కలుగజేయునదియగుటచేత ఇంతకంటె పవిత్రతమమయినది మఱొకటి యుండజాలదు.

పురుషులకు ఉపనయనమెట్టి సంస్కారమో స్త్రీలకు వివాహమట్టిసంస్కారమని మన్వాదులమతము. నవోఢలయిన బాలికలకు శ్రావణమాసముకంటె సంతోషప్రదమగుమాసము మఱొక్కటియుండబోదు. భారతీయాంగనలు బాల్యమునుండియు భర్తృక్షేమతత్పరలయి ప్రతిపరిచర్యాపరాయణలయి భర్తకుఅర్ధాంగలక్ష్ములయి లోకసంపూజ్యలయి వెలయగలరను విధానమును స్వయముగ నాచరించి పరమశివునకు అర్ధాంగియయి అర్ధనారీశ్వరుఁడనుపేరును భర్తయగు పరమశివునకు వెలయింపజేసిన పార్వతీదేవియే మన భారతీయాంగనలకు ఆదర్శరమణీమణిగావున ప్రప్రథమమున మంగళగౌరీదేవత మనబాలికలచేత పూజింపబడు చున్నది. తద్గౌరీపూజయే మంగళగౌరీవ్రతమనంబడును. వివాహమయిన తర్వాత వచ్చెడి ప్రథమశ్రావణమాసమునందే ఈమంగళగౌరీవ్రతమును ప్రారంభించి ౫ సంవత్సరముల వఱకు నియమపూర్వకముగ ఆడపిల్లలీవ్రతము నాచరింతురు. వివాహానంతరము బాలిక(ఆడుపిల్ల)భర్తృగోత్రయగును కావున స్వద్రవ్యముతో చేసిన వ్రతాదులు సమగ్రఫలప్రదములగునను తలంపుతో ఆవ్రతాచరణమునకగుధనమును పిల్లయొక్క అత్తవారింటివారు పంపుట సంప్రదాయమయినది. దానినే శ్రావణపట్టియని వ్యవహరించుచున్నారు. ఈమంగళవారవ్రతాచరణము సర్వదేశములందు జరుగుచున్నను ఆంధ్రదేశమునందు విశేషించి పల్లెటూళ్లయందు జరుగు దృశ్యము మిగులమనోరంజకముగనుండును. గృహాగతలకు స్త్రీలెట్టి బీదవారలయినను తామెంతటి గొప్పదర్జాగలదియయినను అందఱను స్వయముగ నాదరించవలయుననియు; పిలిచినవారి అంతరమును పాటింపక పిలుపును గౌరవించి వారియింటికి పోవలయుననియు నీతి యీవ్రతమునందు క్రియారూపముదాల్చును.

ఆదికాలమునందు చారుమతీదేవియను పతివ్రతారత్నము నియమపరాయణయయి శ్రీమహాలక్ష్మిని పూజించి తదనుగ్రహముపొంది శ్రీమహాలక్ష్మినుండి వరములుబడసి స్త్రీలోకమంతయు లక్ష్మీదేవియొక్క అనుగ్రహమును పొందుటకు తగినసాధకమగు వరలక్ష్మీవ్రతమును లోకమునందు వ్యాప్తిచేసెను. ఈశ్రావణపూర్ణిమకు ముందువచ్చెడి శుక్రవారమునందే వరోపవిషత్ లేక ముత్తైదువలగు స్త్రీలందరు నీవరలక్ష్మీవ్రతమును సర్వత్ర ఆచరించుచున్నారు.

పాకయజ్ఞముల నాచరింపబోవు గృహస్థులీశ్రావణపూర్ణిమయందు 'శ్రావణి'యను నామాంతరముగల 'సర్పబలి'యను పాకయజ్ఞమును స్వస్వగృహ్యసూత్రముల ననుసరించి ప్రథమమున నొనర్చిరేని తక్కినపాకయజ్ఞముల నాచరించవలయునని సంప్రదాయముగలదు. ఇదేవిధముగ హవిర్యాగములను సోమయాగముల నొనర్చిన వారందఱు నీవర్షర్తువునందవశ్యము 'వర్షపశువు' అనుపేరుగలయాగము చేయవలయునని గలదు.

వేదశాస్త్రజ్ఞులగు విద్వాంసులందఱు అధ్యయనార్థము విచ్చేసెడి శిష్యులను పరీక్షించి చదువుచెప్పుటకు అంగీకరించి విద్యను ప్రారంభించి చెప్పునదీశ్రావణమాసమునందే.

సామాన్యులయినద్విజన్ములయినవారలు తమకువచ్చినంతవఱకు విద్య తేజోవంతమయి వెలయుటకు గాను వేదప్రచారకులగు కాండర్షులను జపతపహోమతర్పణాదులచేత తమ కృతజ్ఞతను ప్రకటించునది శ్రావణమాసమునందే గదా! ఇటుల అన్నితరగతులవారికి, స్త్రీలకు, పురుషులకు సంబంధించిన పండుగలు పర్వములు కలిగియుండుటచేతను ఐతిహాసికమహత్త్వము, ప్రకృతిశోభయున్నగునవి విశేషించి కలిగియుండుటచేతను శ్రావణమాసము మాసములన్నిటిలో మిన్నయనితలంచుచున్నాము.

## శ్రావణసుందరి

తుర్లపాటి గోవర్ధనరావుగారు

పసుపుం గుంకుమ పాదపద్మముఖసంపన్నత్వరేఖాళి ది
గ్వసరంబుం బ్రసరింప శ్రావణికళాంగీకారచెల్వమ్ము(?)న
న్వన నింటింటికిఁ బేరఁటమ్మునకుఁ దాఁ బిల్వంగ నేతేరు నం
ధ్రసతీధన్యతఁ గీర్తికన్యతఁ గవిత్వారాధనం బెత్తమే?

ఆంధ్రలక్ష్మి! నిరుటి శ్రావణావసర శు
భద కుమారోదయ సముత్సవము నందు
జనకు జదివింపుపేటంచు 'సాగి' దాల్చి
తరలుచుంటె? దీక్షావస్త్రగరిమ చాట.

అనఁగ ననంగ నంగననఁగాఁ గననయ్యెడి సుందరాంగి శ్రా
వణిని ముదమ్ము నద్దెసలఁ బ్రాకఁగ వీథికి వీథి కేగుచున్
శనగలు కుంచమంతముడిఁ జక్కబిగించి కరాబ్జయుగ్మమం
దునఁ గొని తెచ్చు మోతలను దోఁపవె కావ్యరసమ్ములాఁపఁగన్.

ఆ సవరింపు లానగవు లావగలాడుల పేరఁటమ్ము నం
దాసనెసంగఁ జేయు కవితాప్రియులానవహింప, శ్రావణో
ర్వీసరసత్వము స్ఘనిన విందగు; విందగు సత్కళాకలా
భ్యాసరతుల్ ప్రవీణులవి పాడగలారు ముదమ్ము పెంపఁగన్.

అదె గృహలక్ష్మి దిద్దుకొను నందముచందము లెంతొ సంతసా
స్పదము కులాంగనారమణి సల్పు వచఃప్రచురమ్ము విన్న సా
హృదయుఁడు భర్త వర్తిలడె యోగి పరాంబిక నెంచుభాతి శ్రీ
పదములు పద్యరత్నములఁ బాడితి మా 'గృహలక్ష్మి' సామ్ముగన్.

క్రొత్తది చీరగట్టు కులుకుం దన చక్కదనమ్ము చూచుకో
నత్తరి శేకుణానివహమంతయు తక్కుచు తారుచున్ బ్రమో
దాత్తమనస్కతొచు కనుదమ్ములఁ బడ్డ కవిత్వలేఖినిన్
బత్తిఁ దలిర్ప నిత్తు నొకవాయున మాచిగారాకుబోండ్లకున్.

## ప్రబోధనము

శ్రీమతి ఓలేటి సూర్యప్రభా దేవిగారు

సోదరీమణులారా! శ్రావణమాసము సమీపించుచున్నది. ఆహా! ఈదినములలోనే గదా మనమెల్లర ముత్సాహభరితలమై వారమున కొకసారి సమావేశమగుదుము.

నూతనవధువులు నవనవాలంకారశోభితలై భర్తృదర్శనోత్సాహపూరితులై కలకల లాడుచుండుదినము లవిగో వచ్చుచున్నవి. సోదరీమణీ! స్వాగతమిమ్ము. రమ్ము. మనమందర మెదురేగి యా శ్రావణలక్ష్మి పాణిగ్రహణముచేసి తోడ్కొని వత్తము.

చూపుము. నీ నేర్పంతయు నామెనుతోడ్కొనివచ్చుటకు చూపుము. ఎట్లుపూజా మందిర మలంకరించెదవో, ఎట్లురంగవల్లికలిడుదువో, ఎట్లువివిధములైన తోరణముల గట్టెదో-కట్టుము. నీయథాశక్తి నామె నున్ముఖురాలింజేయ ప్రయత్నింపుము. సోదరీ! తూష్ణీ భావమును వహింపకుము.

నీయింట క్రొత్తపెండ్లికూతురున్నదా? నోమెడిపడతికలదా? లేకున్ననునరే. నీప్రయత్నమునుమాత్రము మానకుము. ద్విగుణీకృతోత్సాహముం జెందుము. నీవామెకరుణచే సకలసంపదలు బడయగలవు. దీర్ఘసుమాంగల్యత్వము నొందగలవు.

నూతనవధువులారా! మీఅత్తింటివారిడిన సువర్ణాభరణముల ధరించితిరా? క్రొత్త యలంకారములచే, తావులవెదజల్లు పూగుత్తులచే మీవేణి నలంకరించితిరా! ఓహో! ముద్దులుగుల్కు మీమోముదమ్ము లెట్లు వికసించినవి! దరహాసచంద్రికలచే పట్టపగలు వెన్నెలగాపించుచున్నారు మీరేనా? ఆహా! యేమి? ఈశ్రావణవాసరముల మాహాత్మ్యము?

ఏవంకజూచినను నలంకృతలై దరహసితవదనలై త్వరితగతి పదచాలనముజేయు మగువలే! ఏదెసనీక్షించినను మందగమమున గంధసింధురములలీల డీలజేయు నిందుముఖులే!

అమ్మయ్య! ఇప్పటికి బాలలయార్భాటము శాంతించినది. నుదుట నర్ధరూప్యమంత బొట్టపుడగు నెపుడగునని తల్లులప్పృచ్ఛించు తనయ లిపుడరుగో పరువులిడుచున్నారు. వీథులలో నల్లకల్లోలముగా దిరుగుచున్నారు.

అరుగో! ఎట్లు గతివేగమును హెచ్చించున్నారో! చూచితిరా? ఏమి? ఈబాలికల యుత్సాహము! ఆందోళనము! సెనగలమూటలు భారమగుటచేగాబోలును ఆచేతినుండి ఈచేతికి ఈచేతినుండి యాచేతికి నెట్లు మార్చుకొనుచున్నారో! పాపము! అమాయికలగు నాబాలికల కింటియొద్ద బరువునుదింపినచో సంతస ముండదుగాబోలును. భారవాహలనైనను నాబాలికల గమనమున మందగతిలేదే!

బాలికలారా! ఏల యట్లు త్వరితగతి నేగెదరు? శ్రావణలక్ష్మిమీకు చేయూతనొసగి యట్లు లాగికొనిపోవుచున్నదా? ఔను! ఆమెదే యాగతివేగము. ఆమెనిముసమైనను నొకచో నిలువదు. ఔను! ఎట్లునిలుచును? తన నావాహనచేసిన ప్రతియింటి కామె పోవలెను గదా?

బహువ్యాపకురాలగునామెకు మందగమన మెట్లు సాగును? సరే! అట్లయినచో పొంకు! ఆమె ననుసరింపుడు. మరల నామె వత్సరాంతమువరకు రానేరదు. బాలికలారా! మీరు ప్రతిగృహమున నామెపూజామందిరముల నీక్షించుచున్నారా? ఆమె యేగృహమున నెట్లలంకృతమై నదో చూచుచుంటిరా? మీభారవాహకత్వముతో మీరివియేమియు జూచుటలేదా? అట్లెన్నడు మాత్రము జేయకుడు. ప్రతియింటను నామెను దర్శించి నమస్కరింపుడు. అంజనమును ధరింపుడు. మరువకుడు. పేరటమునకు బోవుటలో ముఖ్యోద్దేశమదియే. శ్రావణమాసవ్రతకథలో దానివిషయమేయున్నది. ఆయంజనమును అంధులైన అత్తమామలు ధరింప దివ్యాక్షులరైరట. మీరుకూడ నట్లు పవిత్రమైన భావోపేతలుకండు. తొలుత నీనోమునోచిన స్త్రీయొక్క పూతభావమే యామెయత్తమామల కట్లుపకరించినది. ఆమెయొక్క పూతభావమే నిర్జీవుడైన యామెభర్తను సజీవునొనరించినది. కథ మీకందరకును తెలిసినదే. కావున నట్టిభక్తియే గలుగవలెను. భక్తిలేనిపూజ పత్రికిచేటనునట్లు భక్తిలేమిచే వ్యయప్రయాసములేకాని ఫలములేదు. కావున మీరెల్లరు భక్తివినమ్రలై పూతచరిత్రలై కొలువుడు. ఆదేవి మీయీప్సితార్థము లొసగగలదు. ప్రసన్నురాలుకాగలదు. సందియములేదు. లెండు. ఉత్సాహభరితలుకండు. శ్రావణమాసము గడచిపోవును. అతిత్వరితముగ గడచిపోవును. అన్నిమాసములలో నిదిమిక్కిలి వేగముగలది. అన్నిమాసములలో నిదియుత్తమమైన వ్రతములకు మూలకందము. మిక్కిలి విలువగల ఈనాలుగు మంగళవాసరములును నాలుగు అమూల్యరత్నములు. వీనియొక్క విలువ వివేకవతులందరును తెలసుకొని కర్తవ్యమాచరింపుడు. మీవిధిని నెరవేర్చుకొనుండు.

ఓ శ్రావణమాసమా! నీవెంతధన్యవు. నీరాకకై స్త్రీలందరును అమితోత్సాహభరితలై ఆనందమయులై యుందురుగదా! ఏలొకో? నీలోగల ఈనాల్గుమంగళవాసరముల కింతఘనత! ఏలొకో? పూర్ణిమముందరి శుక్రవాసరమున కంతప్రాశస్త్యత! ఎద్దియో ఘనతమమైన మహత్వముండబోలు. లేనిదే వానికంతవిలువయుండునా? ఉండదు. ఉండదు. ముమ్మాటికినుండజాలదు. మేము తెలిసికొనజాలని అపూర్వమైనదెద్దియో మహత్తు నీలో గలదు. నిక్కము. నిక్కము. కావుననే చిరకాలము క్రిందట నీనోముపుట్టినది. ఆహా! ఏనా డీనోముపుట్టినదో! ఏనా డేసతీమతల్లిక యీనోమునాచరించి సఫలీకృతమనోరథయైనదో! ఆనాటినుండి యొక్కతీరుననే నిరాఘాటముగా నందరచేతను నాచరింపబడుచున్నది గదా! ఏమి యీశ్రావణసోమవాసరమునాటి సందడి? స్త్రీలందరును పేరటమునకు బిలువ బోవుతరి ఏమట్లు తొలకరించుట! కడుంగడు నాశ్చర్యము. స్త్రీలందరు నామాత్రపు జిన్కులకు జంకుదురనియా యట్లువర్షించుట? జంకరు. జంకరు. కార్యదీక్షితలును గౌరీపూజానిమగ్నహృదయలునునగు స్త్రీలా జంకువారు? జంకరు. కాని వారినిబరీక్షించు నాలేజిన్కులెంతయు బ్రశంసనీయములు.

స్త్రీరత్నములారా! జడియకుఁడు! మీపూనికయు మీభక్తియు మీవ్రతదీక్షయు బరీక్షింపనెంచివచ్చిన యీయాపత్తుపారమునకు వెనుకంజవేయకుఁడు. చిన్నచిన్కలకు గూడ దడిసెడు చీనిచీనాంబరములను ధరింపకుఁడు. ధరించి వానియార్ద్రతజూచి మీ యశ్రుల నార్ద్రములుగానీకుఁడు. ఎంతజడిసైనను లక్ష్యపెట్టని శుద్ధఖద్దరునే పరిశుద్ధహృదయలగు మీరుధరింపుఁడు. దాన మీలావణ్యాతిశయము లినుమడించుటలో సందేహములేదు. సందేహింపకుఁడు.

తరుణులారా? నేనిట్లు చాదస్తముగా జెప్పినందులకు నాపై నాగ్రహింపకుఁడు. నా మాటలలో దోసగులున్నయెడల క్షమింపుఁడు. మరియు నీనోములోగల ముఖ్యవిషయమును కొంచెము చెప్పెదను. ఏమియు ననుకొనవలదు. సాధారణముగా స్త్రీలు కొంతమంది పేరటమునకు వెళ్లి వారలు కొంచెముగా వాయనములిచ్చిరనియు, వీరు మంచితివాసీలు వేయలేదనియు తప్పులుపట్టుచుందురు. అది చాలతప్పని నేను నిశ్చయముగా జెప్పుచున్నాను. ఏలనన ఎవరికెక్కొలది వారు బాగుగనే వ్రతమునొనరింపదలంతురు. కొందరు పేదరికముచే నట్లుచేయజాలరు. ఆవిషయమై వారేకించనొందుచుండ చూడవచ్చిన పేరటాండ్రుకూడ వారినట్లు తప్పులెన్ని వారిమనములనొప్పించుట భావ్యముగాదని నాయభిప్రాయము. సోదరీమణులారా! వినుచుంటిరా? మీరుకూడ నాతోనేకీభవించి ఎంతబీదవారల ఇండ్లకైనసరే వారుపిలచినచో నేగి వారిని తప్పులుపట్టక వారినానందింపజేసి మీరానందింపవలెనని నాప్రార్థన. కొందఱు శ్రీమంతురాండ్రు తాముపేదవారిండ్లకు పేరటమునకేగినచో తమ గొప్పదనమునకు తక్కువయనితలంతురు. అదితప్పు. భక్తప్రియమగుభవాని ఏయింట భక్తురాండ్రుకలరో అచ్చటనే సదాయుండగోరును. మనము పేరటమునకు బోవుట యెందులకు? భక్తప్రియయగు భవానిని దర్శించుటకా? ఫలహారములకొఱకు సెనగలు పోగుజేసికొనుటకా? నేనిట్లంటినని నాపై మీరుకినియవద్దు. నిజముగా జెప్పుచున్నాను. నేనట్టిస్త్రీలను గొందరనుజూచుటచే నిట్లు వ్రాయవలసివచ్చినది. అట్టివారు నామాటలయందలి గౌరవముచే తమ స్వభావమును మరలించుకొందురని నాయాశయము. కాని వారు నాపై నాగ్రహాయత్తలైనచో నేను జేయునదేమియునులేదు.

కాబట్టి సతీమతల్లులారా! పిలువనివారియెడల కోపమునువదలుట, పిలిచిన పేదవారి గృహంబులకైననునేగి వారిమన్ననలంది వారినిసంతసింపజేయుట ఈరెండును నీమానమున నాచరింపవలసిన ముఖ్యవిధులు. అట్లు మనవిధులను మనము నెఱవేర్చుకొన్నచో శ్రావణలక్ష్మిని మిక్కిలి సత్కరించిన వారమగుదుము. ఆమె దయకు పాత్రలమగుదుము. అదియే మనయందరకోరికయునని నేను చెప్పనక్కరయేలేదు. మనమందఱమిట్లు ప్రార్థించి సెలవు తీసికొందుము.

"పసపుకుంకుమచే నిన్ను భక్తిభావ<br>
భరితలై పూజలొనరించుగరితలకును<br>
సదమలైశ్వర్యములనిచ్చి సాకుమమ్మ<br>
కొమ్మ! వరలక్ష్మి! వందనమమ్మ జననీ!"

# శ్రావణమంగళవారముల పాట

(సంపాదకురాలు) శ్రీమతి జరుగుమిల్లి రామాబాయిగారు

ఈశ్వరాపుత్రునకు, గజావతారునకు, పార్వతీ తనయునకు, భక్తితోను, వాక్కుశుద్ధినిచ్చు వైభోగ రాయునకు, శారదాంబకును నేమసన్నుతింతూ, జయ మంగళా, నిత్యశుభమంగళా॥

మంగళాగౌరికథా, మహిమీదవెలసినా పాట గావించెదా భక్తితోనూ. మహిమీద నకరాజసంతా నం లేక సౌభాగ్యపడవితానేలుచుండె. జ॥

పరమేశ్వరుడుతనఆత్మలో హర్షించి ఇహపరాదులు వారికి త్తమనుచు లింగమ్ము తానునక జంగమాకారమై గురుధర్మఘోరాండమనుచువచ్చె. జ॥

మేడమీదనుంచి దిగివచ్చియాసతో బంగారుపళ్లె ముతో నా కెనుగనూ పణతిరాగాజూచి పరమేశ్వరు డుతాను నిమిషంబునిలువక పోయెనపుడూ. జ॥

ఇదియేమిసోద్యమో యెరుగంగవలెననీ మరుదినము నాటికీ ముందుగాను మరుగుచోటునీ యపుడుకాచు కొనియుండగా గంటలూ మ్రోగుచూవచ్చెశివుడు. జ॥

వచ్చినజంగాన్ని పోనీకపట్టుకొని ఇదియేమికా రణం అనియడిగెను పుత్రపౌత్రులులేరు మీచేతి భిక్షంబు హరహరా అంటరాదనిపలికెను. జ॥

మాకేమిగతియని సతిపతులుఇద్దరూ సాష్టాంగ మొస గిరీ శివునికపుడూ పరమేశ్వరునిగూర్చి తపస్సుచేయ మని అనతిచ్చిపోయె ఆజంగము. జ॥

సతిపతులిద్దరు రాజ్యమ్ములువిడచి పరమేశ్వరుని గూర్చి తపస్సుచేయ వారిభక్తికిమెచ్చి పరమేశ్వరుం డపుడు ప్రత్యక్షమాయెను రాజుకపుడూ. జ॥

ఇచ్చితినివకవరము మెచ్చితినిపొమ్మనుచు స్త్రీజ న్మమో పురుషజన్మమనగా ధర్మపతియైనట్టి పుణ్యసతి నిస్తునా పదహారుహర్షములనుతునిస్తునా. జ॥

సతిపతులిద్దరుసమకూర్చుకొనివారు పరమేశ్వరుని తో భాషించిరి ధర్మపతినీచూచితాళలేమూ మేము పుణ్యమేమెంగానిపుత్రుండకెను. జ॥

ఊరికిముందరా కాళికాగుడివెనుక మామిడివృక్షము నందుఫలమున్నదీ ఆఫలము తెచ్చుకొని భుజియింప మనిచెప్పి అంతర్ధానమాయెనే ఆక్షణమూ. జ॥

ఆరాజుహర్షమున ఆవృక్షమెక్కియుఆఫలములన్ని యుకోసితెచ్చి పణతిముందరపెట్టి విప్పిచూడంగానే ఒక్కటేఫలమయి ఒప్పుచుండె. జ॥

ఈశ్వరుండిచ్చినా ఫలముప్రాప్తియింతే అధికఫల మూవచ్చునాఅతివమనకూ అనుచుభుజియించంగ అతి వగర్భమునిలచి నవమాసములునిండె నాతికపుడు. జ॥

సూర్యతేజంబులతో ఒప్పేటిసుతునికి పుత్రోత్స వంపెట్టిపుణ్యశాలి సంతోషమునరాజు నామకరణం వ్రాసె నారాయణాయనినామమిడిరీ. జ॥

రాజకుమారునకు రమణులందరుగూడి ఉగ్గులమరా పెట్టి వొప్పుమీర దృష్టితాకకుండ చుక్కబొట్టుపెట్టి శిరసంటితొట్టిలోనుంచిరపుడూ. జ॥

బాలప్రాయమువాడు బాలతోడుగులతోడగి ఆట ప్రాయంబునా ఆటమానీ నాటపెంచినవానిమాటపెం చీనట్టు కాశియాత్రకుచాలధనముక్రటీ. జ॥

కాశీ పోదామనచుధనముతో యిద్దరు కాశిపట్నాని కేవచ్చిరీ ఆవనానికిపోయిచాలబడలికగొని పరమేశ్వ రాజ చేనిలచిరపుడూ. జ॥

శ్రావణామాసాన సోమవారముునా మంగళాగౌ రునూపూజింతురూ అంగనలు తామరాపూలుకొ య్యారాగా రాజకుమారుపచ్చెరమణీవెంట. జ॥

పుణ్యాంగనలెల్ల పూలుకోనుకురాగ సంవాదపడి రాజానదుమునిలచె సత్యవతీకన్య మాంగల్యావతియనీ చెరుకుమడివేసుకొని శీఘ్రముగనూ. జ॥

ఆరాత్రినగరులో ఆకన్యవధువరులు నిలచితోటా లోనుయుండగాను అక్కడికిచనుదెంచి తన్నంతనిమి షమున తోడుకూపోయిమధుపర్కమిడిరి. జ॥

తాజదువుశాస్త్రాలు అన్నియునుగావించి రాజ హోమమువేల్చెరమణితోనూ అగ్నిసాక్షిగపెండ్లి ఆడి నాసతిగూడి సప్తఋషులకుమ్రొక్కిసంభ్రమునగనూ. జ॥

వధువరులయిద్దరికి ఒప్పుతో బువ్వంబుచేయించి రచ్చోటు శీఘ్రముగను రాజులందరుతాము రమ్యముగ భుజియించి కరములుకడుగుకొనిగద్దెనుండె. జ॥

చిత్తరవు వ్రాసినా చవికలోపలనుంచి పట్టెమంచ మువాల్చి పరుపుపరచీ కస్తూరిపునుగు జవ్వాజిమెండ లుగదెచ్చి ఒప్పుతోనిలిపిరీవధువరులకూ. జ॥

గిన్నెలలోపాలు చక్కెరతేనియు ఘృతములు ఆరగించాబెట్టిరీ కర్పూరబాగాలు పచ్చలాచెంబుతో పన్నీరుదెప్పించిఉంచిరపుడూ. జ॥

దంపతులిద్దరూయింపుతో భుజియించి సంతోషము గనుతాంబూలమెసగీ సతితొడమీదనూ పాదమూనిచి గిన్నెభక్తితో వుంచెనుగుర్తుగాను. జ॥

తూగుటుయ్యాలపైదంపతూలిద్దరూ శయనించినిద్రలుపోయగానె కాలమృత్యువువచ్చి కాలసర్పంబయి బాలకునిగరువంగజొచ్చెనపుడు. జ॥

మంగళాగౌరమ్మ మగువస్వప్నామందు నీపతికినీ గండసమయమిది మాంగల్యవతి నిద్రశీఘ్రముగ మేల్కొని కనులుబాగుగతెరచి కలియజూచి. జ॥

సుమాంగల్యవతి నిద్ర శీఘ్రముగ మేల్కొని కన్నులూతెరచీ కలియజూచి కృష్ణసర్పముజూచి కిలకిలా నవ్వుచూ స్వర్ణకలశముదెచ్చి యునిచెనపుడూ. జ॥

బాలభక్తికిమెచ్చి నాగేంద్రుడప్పుడూ కలశంబులోప్రవేశించెనపుడూ చుట్టముట్టుకుఅతను పవళించి యుండప్రదక్షిణంతాజేసిమ్రొక్కినిలచె. జ॥

ముత్యాలుకూర్చినారవికతానూవిడచి వాశినాకట్టుకొనియెదుటనిలిచె పతిప్రాణమెత్తుకొనిపంకజాక్షీ తాను తిరిగిశయనించికడునిద్రపోయె. జ॥

అరుణోదయంవేళ ఆరాజుమేల్కొని నేటిగండముమనకుగడచెనిపుడూ యెవ్వరితొచెప్పకాయిద్దరూ తల్లి కాశికిచేరిరీశీఘ్రముగనూ. జ॥

తెల్లవారంగానే యెల్లప్రజలూలేచి పన్నీరుచిల్కిముగ్గులుపెట్టి రత్నాలగద్దెలురమణులూవుంచిరీ వధువరుండెచ్చినిలచిరపుడూ. జ॥

పెళ్లికూతుర్ని లేపి శృంగారములుచేసి రత్నాలగద్దెపైవుంచగానే తప్పకావధువరుని ముఖముతానూ జూచి తనపతికాడనితలచెనపుడూ. జ॥

లేచిమేడామీదకూర్చుండి చింతించి జాణలైనట్టియూసఖియలెల్ల నేర్పుతో నీపతీ అవునీఅందరూ తల పోసితెలిపిరాసఖియలెల్ల. జ॥

సత్యవతియూకన్య తనతండ్రినీబిలచి నామాటవినియునన్నాదరించూ నీపుత్రము నేడునిజము గానడిపితే భక్తితో తాంబూలమిత్తునేను. జ॥

కాశిచేరియువారు గంగస్నానముచేసి కాలభైరవుల దర్శనముచేసిరీ అన్నపూర్ణనుచాలఅతిభక్తితో వేడికొని విశ్వేశ్వరునిగూడదర్శించిరీ. జ॥

మణికర్ణికాదేవి తిరువేణిదర్శించి బిందుమాధవు దర్శనముచేసిరి భాగీరథునిచాలభక్తితో వేడుకొని తిరిగివచ్చిరివారుసీమకపుడూ జ॥

కాశిచేరిరివారు గంగస్నానముచేసి కాశిపట్నానికేవచ్చిరపుడూ మహారాజసత్రానమామలల్లుళ్లు తమరు గంగాడించినిలచిరపుడూ జ॥

ఆరదేశపరదేశి రాజులువిప్రులు భుజియించి తాంబూలమందుకొనగా వీరేలవల్లరనిపరిచారకులు పోయి తోడుకుపోయి రాజసముఖమునకు. జ॥

వచ్చినావారిని భుజియింపుడంటేను వెల్లమనివారితో పలికిరపుడూ స్వయంపాకమందుకొని యిద్దరూ భుజియించి నిలచిరీనిమ్మాలనీడాలోనూ. జ॥

కర్పూరపాగాలు కాంతతానిచ్చెను అక్కడికి వేంచేసె అందునుండి కాశివాసులకేలకర్పూరబాగాలు వల్లమనివారితో పలికిరపుడు. జ॥

రాజసముఖముమీదరమణితాగూర్చుండి నాథుడూ వచ్చేటిరాకచూచి తాను మనంబునా చాలసంతోషించి తాంబూలమిచ్చితా కరముబట్టె. జ॥

తాంబూలమూయిచ్చి కరముతాబట్టి ఆనంద బాష్పములుకురిపించెనూ ధన్యురాలనయితి దరిచేరితిని నేను రాజుకూముద్దుకూతురునైతిని. జ॥

ఇదిఏమిపోద్యమో వెరగుపడిచూచుచూ హాశ్చర్యపడిరాజుఅడుగగానే నీకు గుర్తులుగలవునీలకర్ణుడవు నీవుసత్యముగ తెల్పుమీవృత్తాంతము. జ॥

కాశికిపోదామనుచు కాంక్షతో నిదరము నిలచి తోటాలోనేయుండంగనూ అక్కడికివేంచేసి పన్నెంక నిమిషమున మధుపర్కమిచ్చి కళ్యాణమందే. జ॥

పణతినాతొడమీద పాదంబుయూగిన్నె హత్తుగా నిల్పెనూగుర్తుగానూ సువర్ణకలశంబుదెచ్చిదేదీప్యమా నమైవెలుగ బుజ్జగింపుచుకంఠమాలవేసె. జ॥

ఆకాశమంతానుపందిళ్లుగావేసి భూమియంతయు అరుగుగానుజేసీ తోరణములుగట్టి నగరుశృంగారించి కళ్యాణవేదిగాగాజేసిరపుడు. జ॥

గోదానముజేసి భూదానముజేసీ సువర్ణదానము జేసి సొంపుగాను అశ్వదానముచేసి గజదానముజేసి కన్యదానముజేసెఘనముగాను. జ॥

ఆరాత్రినగరిలో ఆకన్యవధువరులు తల్లిదండ్రాదులనుతలచుకొనెను అనిబుజ్జగింపుచూ మామతో అల్లుడు శీఘ్రముగశీమకువెళ్లవలెనూ. జ॥

ముద్దుకూతురికిచ్చె ముత్యాలపల్లకీ పచ్చలాపల్లకీ భాగీరథీకినీ కోటివేలుచేయుఉత్తమాశ్వమునిచ్చి అల్లునికూతురినిఅంపించెను. జ॥

తెలిసివాఘలమెల్ల గ్రక్కునావెడలెను భక్తితో
గూడనిబాలుడాను గంగనిముందరనుంచుకొనితనసీమ
చేరి తనక్షేమములు చెప్పంపెనూ. జ||

తనతోటిజనమెల్ల తత్క్షణంబెడలగా భక్తిగానీబా
లుడొచ్చెననుచూ పుత్రుడని చెప్పగానుత్సాహమును
పొంది ఆలింగనముచేసిఅతివతోనూ. జ||

ఏమినోమునోచితే వ్రతేముచేసితి పుత్రభిక్షముబెట్టె
పుణ్యశాలీ సత్యమ్మదప్పనిమాంగల్యములుగలా మంగ
ళాగౌరునూపూజించితీ. జ||

భాగీరథీచాలభక్తితో పూజిస్తి మీవంటిఅత్తమామ
లుగలుగనూ ఎక్కువరాజ్యమ్ము మిక్కిలిసంపదా తర
గనిఅయిదువతనము సౌఖ్యమూ. జ||

ఎవ్వరీపూజిస్తె మాంగల్యములుగలవు మంగళా
గౌరునూపూజ స్తేస్ ఈకథపాటపాడినవారికి విన్నవా
రికినై నవిధంబులూ. జ||

ఇష్టసంపదలిచ్చు ఈరాజ్యపదవిచ్చు సత్యసంపద
లిచ్చు సర్వేశురాణి. జ||

# శ్రావణి

చేబోలు చంద్రశేఖరశర్మగారు

శా. ఏరాజిల్లెడు కారణమ్మునను యీయిందీవరాక్షీగణం
బారన్ నీవరుఁదెంచినట్టిసమయంబందున్ నేకతంబిందుగా
రా! రా! శ్రావణియంచునిన్ను బిలువన్ రంజిల్లు శ్రీదేవతా
గౌరీపూజలుఁ జేయబూనెదరు నీకళ్యాణమేపారగన్.

సీ. సాంధ్యకాలారుణచ్ఛవి మోదమొసగుచు ధరణికి వింతయందముఁగడింప
బాలికాపదముల పసపుపారాణియు నడుగులువేయగా నదికొనగ
బొట్టెలసిగలందు బూదండ లవనిపై లీలానిలములచే వ్రాలిపడగ
అమ్మనాకిమ్మంచు నడిగిబిడ్డలుకొన్న సెనగలు భూమిపైఁ జెదరిపడగ

తే॥ గీ॥ మెరగుబంగారుజీర నెమ్మేనదాల్చి పసపుపారాణిదాల్చి పుష్పములుదాల్చి
వాయనములిచ్చు బాలికావళులభంగి భూపురంధ్రీవతంసంబు పోలుపుఁగాంచె.

శా. మేఘచ్ఛన్నతయందు నింద్రధను నెమ్మొంజాలగాఁగొల్వ నీ
కీఘుమ్మధ్గతి హెచ్చుగాడసరె నంచీవెంతువే నిద్వదీ
యాఘూపాకరణప్రశస్తసమయోద్యత్కామినీవస్త్రపా
ళీ ఘృష్యాభ్యత తక్కశద్యుచుల హేళిందగ్గునీమవ్వమున్.

సీ. అమరక్రొత్తగపెండ్లియాడినదంపతుల్ నీరాకకై మదిం గోరుచుంద్రు
శ్రావణశుక్రవాసరమందు నూత్నవధువునకు పట్టీలుఁ దొడరివచ్చు
అత్తవారంపెడు క్రొత్తశ్రావణపట్టి కాసులోరత్నాలో కానుపించు
అత్తవారంపిన యాషాఢపట్టీలకంటె శ్రావణపట్టి నంపువారు.

తే॥ గీ॥ ఆరువేలెంతోకట్నంబు లందుకొనియు
నొంటికాసునుబంపిరి నోసరటంచు
పెదవివిరచెడు వియ్యాలవెలఁదిమిన్న
లెందరోయుంద్రు శ్రావణియందు నిటుల.

# శ్రావణలక్ష్మి

కల్లూరి వేంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు

ఆకాశలక్ష్మి మాద్యన్నీలజలదసంతతి నీలమణివితానంబుగప్ప
వరదిశాలక్ష్మి సుందరబలాకావళి రమ్యకల్యాణతోరణముగట్ట
సర్వంసహాలక్ష్మి సకలసరిత్పావనాంబువు లర్ఘ్యపాద్యములఁగూర్చ
వనలక్ష్మి మృదులశాద్వలపంక్తి మొలపించి వైడూర్యరత్నకంబళులుపరచ
నెమ్మి పురివిచ్చి నాట్యచిత్రమునుజూప
భవ్యవిభ్రమ విభ్రాంతప్రకృతికాంత
జలదగంభీరభాషల స్వాగతంబు
వలికె శ్రావణవరలక్ష్మి వచ్చువేళ.

అడుఁగువెట్టఁగఁబోలు నదె పద్మవనరాజి త్రపచేత తలవాంచితపముబూనె
తనుకాంతివెలయింప గనిమెఁగాఁబోలు విద్యుల్లత దిక్కులఁదూలిపాఱె
మోముజూపఁగఁజూచి మోమోటపడియెఁబో శశి తెఱచాటుగా సంచరించె
గతివిలాసముచూపెఁగాఁబోలు రాయంచ కొలముపర్విడి క్రౌంచబిలముదూఱె.
నిరుపమతదంగవిభ్రమోన్మేషములకు
సాటిగాకుంట నిట్టులజ్జానుభావ
ప్రకటనముసేసి సాదృశ్యవస్తువితతి
దెలిపె శ్రావణలక్ష్మివితీర్ణసరణి.

కాంతుందుర్దినముల్గ్రసించెనని దుఃఖాక్రాంతయై పద్మినీ
కాంతారత్నము వానలంజివికి యేకాగ్రంబుగా నీటదు
ర్దాంతాత్యంతకఠోరశ్రావణవ్రతప్రారంభముం జేసెనాఁ
గాంతల్భర్తృసుఖైకవృత్తి వ్రతముల్గావింపరే శ్రావణిన్.

తొలివార మిదియెకావలయు వియ్యాలవారంపిరా తగవులంచనుగువారు
తగవులలోలేమియగు కూతులంగంటిమమ్మ మేమని మేలమాడువారు
ఆచారమటులేక యంత్యవారానబంపఁదలచిరని బదుల్వలుకువారు
కథముఖ్య మదినీకుఁగడఁదాకవచ్చునే చెప్పుమంచపుడె ప్రశ్నించువారు
నై నిరంతరసౌభాగ్యమభిలషించి
మంగళాలయనర్చించు నంగనాస
మాజ మన్యోన్యప్రణయసంబంధభావ
ప్రచురవాగ్రచనామోదపదవిఁగూర్చె.

జలకమార్చినకురుల్నవరించి యటునిటునడలిపోకుండ కీల్జడఘటించి
పసుపునిగ్గులఁదేరి మిసమిసలాడు నెమ్మోముపైఁగుంకుమబొట్టుదీర్చి

పాదాంబుజములపై బరువునజీరాడు ప్రభలీను పసిఁడిదువ్వలువఁగట్టి
చెన్నుమీఱెడు క్రొత్తచెంగల్వపూవన్నె రవణించునునుమించు రవికదొడిగి

పసుపుఁబూసిన మృదుపాదపంకజముల
రాగరంజకమైనపారాణిరేక
దీర్చి,వరలక్ష్మినర్చింపదివ్యమూర్తు
లను ధరించిరి నవవధూలక్ష్ములంత.
సురభిమంజులపుష్పమంజరులనెత్తి
భక్తిరసభావబంధురప్రథితగీత
ములనుశ్రుతిగూర్చి విశ్వసమ్మోహనముగఁ
బాడి పూజించిరద్దేవి భద్రములిడ.

వరలక్ష్మినేమనివరముగోరితివన్న తలవాంచుఁజిఱునవ్వు మొలకలెత్త
అత్తవారేమంపిరమ్మ దెల్పుమటన్న వరహాలపేరుపైఁ బరపుఁజూపు
మగఁడునీకేమంపె నగలన్న చెలిని బంగారువాల్జడయెత్తి గనరికొట్టు
తొలినోము ఫలియించుఁ దొందరపడఁబోకుమనఁ జూపులంగోపమభినయించు

హావభావాభినయకళాభ్యాసమునకుఁ
బ్రథమరంగంబు మాధుర్యంబు బయలువఱచు
నారితేరినప్రౌఢ లిట్లాడువేళ
సిగ్గునంబలుకనేరని చేడెమిన్న.
అద్భుతానందసందోహ మడరనిట్లు
శాంతశృంగారభవ్యరసాంతరముల
ద్వైతభావంబువాపి యద్వైతసుఖము
నొసఁగె శ్రావణలక్ష్మిమహోదయంబు.

## శ్రావణసంధ్య

తుమ్మలపల్లి వేంకటసీతారామారావుగారు

సదమలంబగు శ్రావణసంధ్యలందు
మణిమయోజ్వలభూషలమేనదాల్చి
నింపొసగునొయ్యారంబుతో నిండ్లదెసల
కరుగుచున్నారు పడతులు కలిమిమెఱయ.
పాదములనంటి జీరాడు పయ్యెదలను
నొడుపుగానవరించుచు పీకుచుండు
పూలసరములసరిజేసి పురమునందు

వాయునంబులగ్రహియింప వరుసదీరి
వెడలుచున్నార లువిదలువేడుకలర.
ధగధగద్యుతులీనెడుధాళధళ్య
శోభితంబగు నొక్కకిశోరమధ్య
శిరమునందక్షతలదాల్చి చెలులగూడి
పోవుచున్నది శ్రావణదేవివోలె.

# శనగ

డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

హిందువులు శనగలను శుభకార్యములందును, నువ్వులను పితృకార్యములందును ఉపయోగించుట ఆచారము. శ్రావణము శుభములపుట్ట. పండగలు, పబ్బములు, వ్రతములు, నోములు అమాసముపోడుగుననుగలవు. వీనియందు శనగల ఉపయోగము విస్తారము. కావున ఈశ్రావణసంచికయందు శనగలనుగూర్చి ముచ్చటించుట సమయోచితముగనుండును.

దీనికి సంస్కృతమున చణకః, బాలభోజ్య, హరిమంత అనిపేర్లు. ఇది హిందూదేశమునందంతటను సాగుచేయబడుచున్నది. తుప్పగ బెరుగును. శాఖలు విరళము. పచ్చియాకు ఓషధి. చెట్టున చిరునూగుఉండును. ఆకులు కొనలుదేరి విభాగములై అంపమువలెనుండును. నిడుపువాటు. నూగుకూడనుండును. పూవులుమిక్కిలిచిన్నవిగానుండును. పుష్పగర్భము గిన్నెవలెనుండెను. ఆగిన్నె అయిదుపొడుగైన ఈకెలఅలుగుఆకారముగానుండే కొనలుకలిగియుండును. రంగు తేలికయైన పాటలవర్ణముగానుండి సీతాకోకపురుగుయొక్క ఆకారముగలిగియుండును. కర్ణికలు పదివరకుండును. కాయగర్భము బలముగానుండును. ఒక్కొక్క గుంటలో ఉబ్బిన ఒకటిరెండు గింజలుండును.

ఔషధోపయోగమునకు గింజలు, శనగపులుసు, శనగఆకులు వాడబడుచున్నవి. శనగపులుసులో అగ్జాలిక్, అసిటిక్ ఆసిడ్లుగలవు. మాలిక్ఆసిడ్డుకూడ ఉండనోపు. ఒక ఔన్సు పులుసులో పదునాలుగు గింజలయెత్తు నైట్రోజనుగలదు. శనగగింజలో నూటికి పిండి (Starch) 59 పాళ్లు, అల్బుమినాయిడ్సు 20 పాళ్లు, కొవ్వు 4 పాళ్లు, నార 1 పాలు, బూడిద 2 పాళ్లు, ఫోస్ఫారిక్ ఆసిడ్ 1 పాలు, నీళ్లు 11 పాళ్లు గలవు.

శనగ సాధారణగుణముల నరయుదము. శనగఆకుకూర కొంచెముపుల్లగ వెగటుగనుండును. పైత్యమును కఫమును పోగొట్టును. వాతముజేయును. గురుత్వముగనుండును. మూత్రపుసంచిలో రాళ్లుపుట్టించును. శనగలు పచ్చివి (ఎండకుండ పచ్చివిగానుండునవి) తేలికగనుండును. కఫమును బుట్టించును. దేహపుష్టినిచ్చును. వాతముజేయును. మూత్రపుసంచిలో పుండుపుట్టించును. వేయించని ఎండుశనగలు వేడిజేసిఆర్చును. బలము దేహపుష్టి జేయును. రక్తపైత్యమును శమింపజేయును. వాతము, చలవ జేయును. కఫమునుగొట్టును. తేలికగానుండును. మదమునణచును. స్త్రీలకు పాలుపడజేయును. తెల్లదబ్బకు, నల్లదబ్బకు బలమిచ్చును. శరీరమునందలి సహజమైన కాకకు బలమిచ్చును. కార్జము తెల్లదబ్బ గురదాలు వీటినిశుభ్రపరచును. గడ్డలకు మేలుజేయును. పొట్టనుమృదువుపరచును. మంచిరక్తమును బుట్టించును. ఆకలిబుట్టించును. ఇది మంచి ఆహారము. అప్పుడే వేయించిన శనగలుతినిన మంచిపైత్యమునుపుట్టించును. వీర్యపుష్టిజేయును. ఋతురక్తమునుజారీచేయును.

మూత్రబద్ధమునుమాన్పును. కడుపుబ్బును నివారించును. భోజనాత్పరమందు వీటిని మితముగ బుచ్చుకొనిన అన్నమును చక్కగజీర్ణముజేయును. శనగపప్పువండినది పైత్యము మేహము వాతము శీతపైత్యముజేయును. రుచిగానుండును. శ్వాసబుట్టించును. కడుపుబ్బును మిక్కిలి అపానవాయువునుదెచ్చును. సర్వరోగములకు అపథ్యమైనది. శనగపప్పు వేయించినది వీర్యపుష్టిజేయును. దగ్గునణచును (దీనిని తినినవెంటనే నీళ్లుత్రాగకూడదు. త్రాగిన కడుపుకుబ్బజేయును. నీళ్లవిరేచనములగావించును.) శనగపులుసు (అనగా శనగ చెట్లమీద సన్నబట్టబరచి తీసినమంచునీరు) వాతమును పైత్యమును శమింపజేయును. అన్నము జీర్ణముగావించును. జఠరాగ్నినివృద్ధిబొందించును. రక్తములోని వేడినణచును. కొన్ని ఔషధములలో అనుపానముగ నివ్వతగియుండును. శనగఉండలు (బెల్లముపాకము పెట్టి వేయించినపప్పు వేసిచేసేవి) పైత్యమును మేదస్సునుఅణచును. వీర్యవృద్ధిని దేహపుష్టిని ఇచ్చును. శనగసత్తు (వేయించివిసిరిన సెనగలపిండి) బలమిచ్చును. కడుపు పొంగించును.

గృహవైద్యమున శనగ ఉపయోగములివి. జ్వరములందు ఇదివాడబడుచున్నది. ఋతుశూలరోగమునందు ఇది ఉపయోగింపబడుచున్నది. పచ్చిశనగమొక్క వేడి నీళ్లయందుంచి దానిపై ఆవిరిఈరోగికి పట్టుదురు. శనగగింజలు అతిసారమునందు వగరుకొఱకీయబడును. శనగజంటగింజలు వాయుహరములు. వెచ్చచేసిన శనగఆకులు బెణుకులయందును, అంగములు బెసుకుటయందును పైకట్టుకు ఉపయోగించిన మంచిగుణమిచ్చును. శనగపప్పుకాఫీ వాయుహరము, మూత్రబద్ధము గావించును. దీనిసమూలమువేసి కాచిన నీళ్లఆవిరి రహస్యస్థానములయందు పట్టించిన ఋతుబద్ధము నివారణముగును. శనగలు యొక రాత్రి సిరకాలోనానబెట్టి వాటిని ప్రొద్దుటపుచ్చుకొని ఆదినము మరిఏమియుపుచ్చుకొనకయుండిన కడుపులోని క్రిములన్నియు చచ్చిపోవును. శనగలు నీళ్లలోనానబెట్టి పచ్చివిదినవలెను. ఆశనగలు నానబెట్టినసీళ్లలో తేనెకలుపుకొనిత్రాగవలెను. ఈలాగున 20 దినములుతినిన పోయినపుంస్త్వము తిరిగివచ్చును. (ఇటుల మేహకాకతత్వములుకలవారే చేయతగినది.) శనగగింజలు రుబ్బితయారుచేసిన ద్రవము రసాయనము. వమనమునుకట్టును. కుత్తుకపడిశమున కాల్చినశనగలు రాత్రిపూటతినినిచ్చి గోరువెచ్చనిపాలు వెంటనే త్రాగించిన మంచిగుణమిచ్చును. శనగపిండిఉడికించి తేనెతోగలిపి కొరుకుపుండుకు పలాస్త్రి వేసిన అదిమెత్తపడును.

పాకవిషయమునకూడ శనగ ఉపయోగముహెచ్చు. శనగలు నానబెట్టి వడపప్పుగా నుపయోగింతురు. నానబెట్టివాడవేసి వేయింతురు. పులుసుఅన్నమునందును వీనినుపయోగింతురు. వడియాలుపెట్టుదురు. రొట్టెపిండికలుపుటకుగాను కావలసిన పుల్లనీళ్లను శనగలు నానవేసి తయారుచేయుదురు. శాండోలకు శనగలు మంచిఆహారము. శనగలు

కొబ్బరితో కలిపి తిరగమోతలయందువాడుదురు. వడపప్పు, మసాలవడ, వడియములు, మజ్జిగపులుసు, ఒబ్బట్లు (పోళి), సుఖీలు, కూటు, పకోడీలు, యిడ్డెనలయందు శనగపప్పు ఉపయోగము సుప్రసిద్ధమే. శనగపిండి లడ్డు, మైసూరుపాకు, కారాబూంది, కారపుపూస, పకోడీలు, బజ్జీలు మొదలగువానియందు ప్రధానవస్తువు.

పచ్చిశనగల్లకు విరుగుడు గసగసాలచూర్ణము. పొట్టలో వాతము బుట్టించినను కడుపులో భారముగనుండినను విరుగుళ్లు కారపదార్థములు, ముల్లంగిదుంప, తెల్లఉత్తరేణిక్షారము, గులకందు, పాజీర, గసగసాలు, సికింజబీను. శనగసత్తుకు విరుగుడు మితాయి.

## వర్షాగమము

కవితావినోద అల్లంశెట్టి అప్పయ్యగారు

శీతలసమీరణమువారి శీకరముల
మబ్బువిడచినయెండ లుమ్మలికనించె
ప్రాణులకుఁ బ్రాణభూతమై ప్రభవవర్ష
వార్షికదినంబు లరుదెంచె వార్షికముగ.

ప్రకృతిసీమంతినియు ఝుకీపటచయంబు
మెల్లమెల్లఁ దనంతన యల్లుచుండఁ
బుడమి నిండారి వెలయునూల్పోగులట్లు
గాటమై వానకురిసె నాకసమునుండి.

తొంగలిపూగుత్తులెంతయు ముదముఁగూర్చె
కడిమిలుం బొగడదండ లెల్లెడలనిండె
సాటిలేనిముదంబిడె నీటిగాలి
భోగములకాస్పదంబు వర్షాగమంబు.

చారుశైలాగ్రఝురులు పొంగారి వెడలి
పిల్లకాలువలంజేరి పెద్దవగుచు
సాగరుఁజేరె తమకృతజ్ఞతను నెరప
నిందుల జడస్వభావ మొక్కింతకలదె?

బకవిహంగమములు నభోభాగమందు
సంచరించెడుచాయయో, జలధరముల
చాయయో యెఱుంగక కేకిసముదయంబు
నవ్యగతిఁ బింఛములు విప్పి నాట్యమాడె.

పుట్టచివరను ప్రభవించి పుడమిజనుల
కద్భుతానందసంధాయియై చెలంగి
గగనరంగంబు రంగులసొగసునింపి
పశ్చిమాశను నింద్రచాపంబువొలిచె.

పర్వతాగ్రంబు లందెగఁ బ్రాకి ప్రాకి
దక్షిణాశకు బయనించి తమముఁ బెంచి
ఘుమఘుమారావములు దిగంతములనించి
భయదజీమూతసంఘంబు ప్రబలెమింట.

కుసుమగుచ్ఛభరంబునఁ గొంత వ్రాలి
నవజలకణంబులందాల్చి నమ్రములయి
మారుతాఘాతమున నొక్కమారు నేల
కొరిగి చీకాకుఁబొందె ద్రుమోత్కరంబు.

ఉరుములున్ మించుటీఁగ లొక్కొక్కమాటు
భయము, మిఱుమిట్లుఁగొల్ప వర్షంబుఁగాంచి
తెన్నుఁగానక యిల్లుఁగూర్చి దేవులాడు
భయసమాశ్లిష్టహృదయుఁడై పాంథుఁడొకడు.

వంటచెఱకులభింపమి నింటివారు
మునుఁగుఁగొనియుండ నాడిరొంతొక సిమసంగి
శ్రోత్రజనువారివీరిని తోడుజేసి
యతిథిసత్కారములనెల్ల నటుమటించె.

గౌరవర్ణంబుఁగలయట్టి గడ్డిమొలక
లింద్రగోపంబులును ధారణేందిరకు, న
లంకరణములపోల్కి విలాసమొసఁగెఁ
బకులకుం గర్షకాళికిఁ బ్రమదమయ్యె.

ప్రొద్దుఁగానక దినమెల్ల భోజనంబు
విడుచువారును భుజియించి వేళతెలియ
కేదిరొట్టులొనర్చుటో యెఱుఁగకునికి
నాతురతఁజెందుచుండువారైరి జనులు.

# సమస్యాపూరణము

“కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్”. [సమస్య:........ఇవి యథామాతృకములుగ ప్రచురితములు. —సంపాదకుడు.]

౧

మానవతీలలామ పతిమన్ననలందక, సౌధసీమలం
దానువసించుచున్, బహువిధమ్ముల సౌఖ్యములొందుచున్న గా
నీ, నిఖిలమ్ము భారమగు నిక్కము ప్రేముడిజూపునాథుతో
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—సామవేదం సీతారామమ్మ.

౨

దీనజనావనంబె నిజదీక్షగఁ గైకొని మానసంబునన్
మానితకీర్తిసంపదల మక్కువసేయక కార్యశీలుఁడై
పూనిక నెల్లదేశములు పొందుగఁ గ్రుమ్మరు కర్మయోగికిన్
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—కనుపర్తి వరలక్ష్మమ్మ.

౩

పూని, సమస్తభూతహితమున్మదిగోరుచు, స్వార్థలాభమున్
మానుచు, సత్యధర్మముల మానసమందుననిల్పి, ద్వేషమున్
గానక, కర్మనిష్ఠను జగద్ధితకార్యము జేయువారికిఁ
కానలుగావు శైలములుగావు పయోధులుగావు భారముల్.

—దేశిరాజు భారతీదేవి.

౪

మానవజన్మమాభరము మాయయుపాధివివేకశూన్యయ
జ్ఞానతమోమయంబగుట గాన; భవాబ్ధినిదాట బ్రహ్మవి
జ్ఞానుఁడుకూడ కష్టపడునన్న గృహస్థుఁడు దాటగాకడున్
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.
కానగ దేశసేవకుడు మాన్యము; త్యాగము; మాతృదేవతా
జ్ఞానభిమానభక్తిసువిధాన; వివేక; మమానుషక్రియల్
మానవమాన్యగాంధిఘనమాన్యుఁడుగాకితరుండుచేయుగా
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—ఆచంట సత్యవతమ్మ.

౫

దీనత స్వీయజాతి పరదేశ్యః శృంఖలశృంఖలాయుత
గ్లానినుడింబడన్ కనులఁగాంచుచు స్వార్థముసార్థకంబుగా
మానిసినంచు నెంచు నభిమానిభరంబగు గాని ధాత్రికిన్
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—కె. రామసుబ్బమ్మ.

౬

ఆనవమాసవేదనల నంది మనోహరనేత్రకౌముదీ
తానకమై భ్రమించు శిశుదాగని ముద్దులవెల్లిముంచు వా
త్సానవమాతృవత్సలత చాలగ భారములేవి భూమిరో!
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.
కానుచు గర్భవాసమున, గాఢపుప్రేమలసాకుతొమ్ముపై,
సానలతీర్చి దిద్దు నునుచక్కెరబొమ్మగ ముద్దుకూతు, నా
జ్ఞానమువచ్చి యీడెరినకన్యకభర్తకు! భార మమ్మకున్
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.
మానముపోవు ఈ బ్రతుకు మానుము దేశముగౌరవంబుగా
కానలనుంటలెన్న! యటుగాక అధోగతి బానిసత్వశృం
ఖానుభవమ్ము దుర్భరము! ఆజియొనర్పుము దేశముక్తికై
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—సామవేదుల చిరంజీవమ్మ.

౭

కానివికర్మబంధములు కానివియాశ యసత్యవాక్యముల్
కానివి యీషణత్రయము కానివి లోభముకామక్రోధముల్
కానివి జన్మకెప్పుడును కానివి యీనవకష్టముల్ ధరన్
కానలుకావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—మానాప్రగడ సీతాయమ్మ.

౮

దానముభోగమున్గనక ద్రవ్యము సర్వముదాచుకొంచు లో
భానచరించువాడొకఁడు స్వార్థముకోసమబద్ధమాడుచున్
ప్రాణములన్వహించిన దురాత్ముడు నొడురు భూతధాత్రికిన్
కానలుగావు శైలములుకావు పయోధులుకావు భారముల్.

—కర్రి కమల.

# శ్రావణదృశ్యములు

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు

ఆషాఢమాసంబు అల్లునికిఁబ్రీతి
శ్రావణమాసంబు చేడెలకుఁబ్రీతి
అల్లుళ్లలాంఛనము లలవిలేవెన్న
ఆడపిల్లలవారు హతమగునట్టి
జామాతబహుమతులు చాలగాకలవు
ఆషాఢపట్టీలు అల్లునికిబంపి
శక్తిగాఅల్లుని సంతోషబరచ
తలచిలాంఛనములు జరిపినాగాని
తృప్తియన్నది మొదలె లేదల్లురకును.
శ్రవణనక్షత్రాఖ్య శ్రావణంబనగ
నక్షత్రనామంబు నమరెమాసముకు
ఆమాసమాబాలవృద్ధులకుప్రియము
రైతు లూహ్నులతోడ నతికష్టపడెదరు
ప్రకృతి పచ్చనిగరిక నాకృతులతోడ
చిగురుఆకుల నవనవోన్మేషయగుచు
రంగురంగులపూలగుత్తులనుదాల్చి
మబ్బురంగులనీను మసకాంబరమున
మిణుకుమిణుకనుకాంతి మిలమిలామెరయు
తారకావళుల మేన్ధరించిమిగుల
శోభస్కరంబుగ సొంపారుప్రకృతి.
శాలిశుక్రవారంబు సువాసినీప్రియము
భౌమ్యవాసరనోము బాలికానందం
పురుషులకు పౌర్ణమిపుణ్యగాయిత్రి
నూతనయజ్ఞోపవీతధారణకు.
శ్రావణమువచ్చెనని చేడెలందరును
బూజుబుత్రులుదులిపి బూయించివెల్ల
గడపలకు పసుపుకుంకుమలమరపెట్టి
ఆనందకరముగా అలంకరింత్రు.
శ్రావణంబున మొదలె శ్రీగౌరీవ్రతము
నోముపట్టినవారు భామలనుపిలువ
సోమవారమునందె శృంగారవతులై
వాయినంబులనంద వరబంధుచెలుల
పిలచివత్తురు కడుప్రియముమీరగను
పెండ్లిపేరంటముల కాబాలలాపిలుపు
చాలదని అలిగిరాకుందురాచెలులు
పలుసార్లుప్రేమతో పిలచినారారు
శ్రావణామంగళాశ్రీగౌరినోము
సిరిశుభంబులుగాన చిన్నతనమవదు
పసుపుకుంకుమలకు పదియామడలును
పడతులేగుటకడుభావ్యంబుఅనుచు
బాల్యస్నేహితులను బంధులందరిని
కలసి ఆనందవేడుకలందుసమయ
మదియదను మనకనుచు మంగళవారమున
కడువేగపనులు కావించుకొనిచెలులు
విలువచీరలురైక వస్తువులదాల్చి
సిగల కుసుమములతో సింగారమొప్ప
జట్టుజట్టుగకూడి ముచ్చటలాడుచును
వాయినంబులనునందివచ్చెదరువెడలి
పసిపిల్లబాలాది పరుగులెత్తెదరు
ఇట్టిపేరంటములకెందు పురుషులును
స్త్రీలకాటంకంబు చెప్పరదివింత.
శుక్రవాసరమునను శుభలక్ష్మిప్రీతి
స్త్రీలబద్ధకములెల్ల తొలగునాదినము
దేహగేహారోగ్యదీప్తిపొందించు
లందులోనీమాసశుక్రవాసరము
చారుమతిఅనియేటి చానసుశీల
బీదరాలగుగాని బుద్ధిమతి నాతి
ఆమె సౌశీల్యంబుకలరి శ్రీలక్ష్మి
కలలోనకనబడి నిలచెప్పెవ్రతము.
ఆవ్రతముచేసి యావనితలక్ష్మిచే

వరములనుపొంది ధరసిరులపెంపొందె
వరములొసగుట లక్ష్మి వరలక్ష్మియనగ
చారుమతిచేసినా శుక్రవాసరము
శ్రావణాపౌర్ణమి ముందునదిగాన
తొలిశుక్రవారము స్థలయశంబందె
ఇండ్లువాకిండ్లలికి పండ్లుపుష్పముల
నవపిండివంటలను చవిరొప్పజేసి
విఘ్నముల్ రాకుండ విఘ్నేశునిలిపి
కాసుపీసము తెచ్చి కలశంబునిల్పి
తలయంటుకొని భక్తితత్పరతతోడ
వరలక్ష్మినామములు సహస్రములతో
శక్త్యానుసారంబు అష్టోత్తరముతో
బూజగావించియో భూసురుల కెలమి
భోజనాతాంబూలదక్షిణాలొసగి
తోరంబుదాల్చవలె శుభకరములకును.
నూతనాంబరముల ప్రీతిగాదాల్చి
కలకలలాడుచు కాంతలుండెదరు.
భక్తితో చేసిన పనులువృథగావు
పరమేశుగొల్చేటివారు వృథబోరు
భారతావని వీరకర్మదేశంబు
భగవంతుభక్తికిపెట్టినదిపేరు
వేదవేదాంతాది విజ్ఞానభూమి
ఆమాతకడుపునా అవతరించిన
ఆవ్యక్తులకిట్టి వనాదినుండి
శుభవ్రతకర్మలు చేయముఖ్యములు
స్మృతిగాను అందరికినంటు నీవ్రతముల్.
ఏటేటమనకివి యింపుగూర్చుచును
భక్తిశ్రద్ధవివేకభావముల్ పుట్టు
భక్తితప్పినగానిఫలముతప్పరాదు
వాక్కుతప్పినగాని వ్రతముతప్పదు
సర్వకర్మలధార సర్వేశ్వరునకె.

## వర్షాకాలము

వారణాశి లక్ష్మీనారాయణశాస్త్రిగారు

ధరణిమనుజులు గ్రీష్మసంతాపమునను
బొందరానట్టి యాపదలొంది యిప్పు
డాకసంబున నొకచిన్నయాపదంబు
గాంచి సంతోషపరవశగాత్రులైరి.
చెలఁగిజీవనదానము సేయుఘనులు
మానసోత్సాహ మొనఁగుసన్మార్గచరులు
తోయదము లాలసించుటనోయనంగ
నదులుకలుషాన్తరంగలై నడుపఁదొడఁగె.
రాజువెలియయ్యె మఱిగ్రహరాజు మాటు
పడియె ననలుంశులోలోన నడఁగియుండె
ఘనబలంబులుమింటిపైఁ గ్రమ్ముకొన్న
నెంతవారలకైన సహింపనగునె?
ఎక్కడెక్కడివారలు నిల్లుచేర
నినునిఁగానక పద్మిని వనరసాగెఁ
జండకరుఁడయ్యు ఘనతిరస్కారమొంది
మాటుపడియెనుగద కాలమహిమచేత.

"నోచినవారికిసొమ్ములవి నోమనివారికి కగ్గనేర్చునే"

అను అర్థాంతరన్యాసమువచ్చునట్లు పద్యముపూరించి స్త్రీలు ఆగష్టు 15-వతేదీలోపున మాకు పంపిన గృహలక్ష్మిలో ప్రచురింతుము. స్త్రీలలో కవితాజిజ్ఞాస పెంపొందించుట కిది ఉద్దేశింపబడినది.

—సంపాదకుడు.

# బాలవిజ్ఞానశాఖ

౧. పాటలు

## గౌరీపూజ

(సంపాదకురాలు) శ్రీమతి పిల్లుట్ల కనకదుర్గామహాలక్ష్మమ్మగారు

భక్తితో నీపాదములకు
వత్తిసేవ చేసేనమ్మా
చిత్తగించి మమ్మేలుకో
శివకాము సుందరమ్మ
విన్నపంబుమాదొక్కటి
విని వుద్ధారించావమ్మా
చెన్నుమీరా మామనవి
చేకొనిరక్షించావమ్మ
పణతిరో నీపాదాములకు
పసుపు ఒప్పాపూసేమమ్మా
ముదితరో నీముద్దులానుదుట
కుంకుమమరా పెట్టేమమ్మా
కలికిరో నీ కన్నూలపోక
కాటుకమరా పెట్టేమమ్మా
చంద్రకావి పట్టూచీర
చెలియనీకు కట్టేనమ్మా
పంచవన్నె పట్టూరవిక
పణతినీకు తొడిగేనమ్మా
పంచభక్ష పాయిసాన్నం
భక్తితో నయివేద్య మిచ్చేనమ్మా
అల్ల అంతట నిలిచేనమ్మా
ఆకుమడచి యిచ్చేనమ్మా

అద్ద మమరా చూపేనమ్మా
మురహారులకు తగినకొమ్మా
భూలోకపావనీవమ్మా
సిరులిచ్చి రక్షించవమ్మా
చాల కరుణించు కరుణాలవాల
ముక్కంటుడీమోహనాంగీ
చాల మ్రొక్కెదను కోమలాంగీ
బాలసుందరపాలవల్లీ
చెన్నంగ విఘ్నేశ్వరునికన్నతల్లీ
భక్తితో నీపూజలన్ని
చాల భక్తికలిగుందు నీయందు
శృంగార వరలక్ష్మి
బంగారు వరబొమ్మ
పసిడిపుత్తడి బొమ్మ
రంగుమీరి హంసరాజరత్నావళీ
శ్రీనరసింహునకు చక్రచూడామణి
సందయా అనిపటి ఆవులమందమీద
అతివ నీవుందువే
పసిబిడ్డలమీద పణతినీవుందువే
చూలాళ్లమీద సుదతి నీవుందువే
జేజే శ్రీలక్ష్మి శరణు శరణు.

# శ్రావణశుక్రవారపులక్ష్మిపూజపాట

(సంపాదకులు) ఆదూరి వేంకటరామారావుగారు

మ్రొక్కేను నాపాలి శుక్రవారపులక్ష్మి
ఒక్కచిత్తంబున హృదయమందు
చక్కగాకూర్చొని సౌభాగ్యములువొసగు
అక్కరకు, రావమ్మా ఆదిలక్ష్మి!
పెక్కువన్నెలముగ్గు ప్రేమతోగద్దెపై
చక్కగాపెట్టేను సరసిజాక్షీ!
చుక్కవలెపాదజూపి గ్రక్కుననుగద్దెపై
యెక్కినిలవవె శుక్రవారలక్ష్మీ!
పసుపుకుంకుమను పన్నీరుమర్దనం
పసుపుకస్తురిబొట్టుపొందుగాను
శశిముఖి! నీకిపుడు తెచ్చిఅమరించిన
ఒప్పుతో ఓశుక్రవారలక్ష్మీ!

మల్లెలూ మొల్లలూ మంచిసంపెంగలూ
మల్లెముగ మొగలాకు మల్లెవిరులూ
అన్నిజాతులైన నాజాతిపుష్పములు
కోమలాంగికి కొప్పుపెట్టెరిపుడు
గాజంగులుజాజంగులు సర్వాంగసమొగలిపువ్వులు
వాసనంకురువేరు దవనమ్మును దేజముతో
కూర్చొని నినుపూజజేసిన
ఒప్పుతో ఓ శుక్రవారలక్ష్మీ!
పాలవల్లికి నిమ్మపండ్లు దానిమ్మపం
డ్ల నేరెడుపండ్లరటిపండ్లు
వెలగకిచ్చిలిపండ్లు, వెలయుబంగారు
పండ్లు సరిపోవె మాలక్ష్మి వేడుకటిండ్లు.

[ప్రతిచరణము చివర 'జయమంగళం, శుభమంగళం' అని అనుకొనవలెను. ఈపాట శ్రావణశుక్రవారమున లక్ష్మిపూజకు ప్రారంభమున పాడుదురు.]

# వరలక్ష్మి పిలుపు

లక్ష్మి! రావే మాయింటికి క్షీరాబ్ధిపుత్రీ! వరలక్ష్మీ! రావేమాయింటికి (ల॥)
లాలితముగ చేలాకొన్న సూక్ష్మదేహధారివి సుందరి బృందావనధారి (ల॥)

కుంకుమ పచ్చకర్పూరం
అంకితముగ నలరుగంధం
సంచితముగ సాంబ్రాణిధూపం
మాతా! నీకుప్రీతితో ప్రఖ్యాతిగా
సమర్పించెదమమ్మా! ల॥
సన్నజాజు లమరంగాను
తీరైనగాజంగిరేకులు
మేలైన పారిజాతములె

కోమలాంగిరో నీకు
భక్తితో సమర్పించెదమమ్మా! ల॥
అందాముగ గవ్వాక్షుల చీర
కుందానుపు పూవులరవిక
మందగమనా గై కోహరీ
ఇందూవదనా! పట్టపురాణీ!
పండువెన్నెలలో సముఖము
పద్మాక్షీ! నిన్నే పూజింతు. ల॥

# శ్రావణశుక్రవారపుపాట

(సంపాదకులు) ఇనుమర్తి వీరభద్రరావుగారు

కైలాసగిరిలోను కల్పవృక్షముక్రింద
ప్రమదాదిగణములూ కొలువగానూ
పార్వతీపరమేశ్వర్లు బాగుగాగూర్చుండ
పరమేశ్వరునియడిగె పార్వతప్పుడు
ఏవ్రతమునసంపదలు ఎలిమితోడుతనిచ్చు
ఏవ్రతము కామితార్థములనొసగు
ఏవ్రతము పుత్రపౌత్రాభివృద్ధులనొసగు
అనుచుపార్వతి యీహరునడిగెను
కుండినిఅనియేటి పట్నంబులోపల
చారుమతిఅనియేటి చేడెగలదు
అత్తమామలసేవ అతిభక్తితోచేసి
పతిభక్తికలిగుండు భాగ్యశాలి
వనితస్వప్నమందు వరలక్ష్మితాబోయి
వోచారుమతితాలెమ్మని చేయజరచె
చరచినప్పుడులేచి తల్లిమీరెవ్వరని
నమస్కరించిపలికె నలినాక్షిరో
వరలక్ష్మినే నేను వరములీయవచ్చేను
నేలోకనవె చారుమతి గొబ్బునాను
కొలిచెనప్పుడుమెచ్చి కోరినరాజ్యములు
వరమప్పుడిచ్చేటి వరలక్ష్మిని
ఏవిధంబుగపూజ సేయవలెననుచునూ
చారుమతిఅడిగెనూ శ్రావ్యముగనూ
ఏమాసంబున ఏపక్షంబున
ఏవారమునాడు ఏప్రొద్దున
చేయవలెనో పూజచెప్పుమనెమె
శ్రావణామాసాన శుక్లపక్షమునందు
శుక్రవారమునాడు మునిమాపునా
పంచకల్వలుదెచ్చి బాగుగాతనునిల్పి
సువర్ణకలశమున శోభితముగ
చారుమతిలేచి యీశయ్యపై గూర్చుండి
బంధువులఖిలిపించి బాగుగానూ
స్వప్నమున శ్రీమహాలక్ష్మి చక్కగవచ్చి
కొల్వమనిపల్కెనో కాంతలార!
ఏవిధంబునపూజ సేయమనిఅన్నదో
బంధువులుఅడిగిరీ ప్రేమతోను
యేమాసంబున యేవారమునాడు
యేపొద్దునా చెయ్యవలనో మాకుచెప్పవమ్మా
శ్రావణామాసాన శుక్లపక్షమునందు
శుక్రవారమునాడు మునిమాపునా
పంచకల్వలుదెచ్చి బాగుగాతనునిల్పి
భక్తితో పూజింప మనిచెప్పెనూ
అపుడుశ్రావణమాసమందముగ వచ్చెనని
భక్తితోపట్నము అలంకరించిరి
వన్నెతోరణాలు సున్నమూ జాజులూ
చెన్నుతోనగరు శృంగారించిరి
వరలక్ష్మినోమనుచు వనితలందరూ
పసుపాడి పట్టుపుట్టములుకట్టి
పూర్ణంపుకుంకుములూ పాయసములు,
స్నానములు
ఆవశ్యముగ నైవేద్యములు వేసెదరు
కంద్రిమండీగలు మండిగలుదండిగ
నెంచివండినకుడుములు ఘనవడలునూ
దండిగా పళ్లేల ఖర్జూరఫలములూ
ఇవి వేగ నైవేద్యములు పెడుదురు
నింమబిందెలతోను నిర్మలవుదకమూ
పుండరీకాక్షునకు వారబోసి
తొమ్మిదిపోగుల తోరమొప్పగ సి
తల్లికికడుదురూ సంభ్రమమునావో!

వేదవిదుడయినట్టి విప్రునిపిలిపించి
గంధమక్షతలిచ్చి కాళ్లుకడిగి
నవపిండివంటలూ తోరమొప్పుగపెట్టి
బ్రాహ్మణునకు పాయసంబెట్టెనూ.

౨. కథలు

## శ్రావణమంగళవారముకథ

శ్రీమతి వామరాజు శేషమ్మగారు

అనగా అనగా ఒకరాజు. ఆరాజుకి సంతానములేదు. పరమేశ్వరునకు ఈరాజునకు సంతానముకలుగ జేయవలెనని దయగలిగి ఒకజంగమువేషము వేసుకొని రాజుగారిఇంటి దగ్గరకువచ్చెను. ఈజంగమునకు ముష్టి వెయ్యవలెనని రాణిగారు మేడమీదనుండి దిగివచ్చెను. వచ్చేలోగా ఈజంగము ముష్టిపుచ్చుకోకుండా వెడలి పోయెను. రెండవదినమునకూడా ఆలాగునవేవచ్చి ఆమెవచ్చుసరికి వెళ్ళిపోయెను. మూడవదినమున ఈరాణీ గారు తలకట్టుకొని పండుకొనెను. రాజుగారువచ్చి పడుకొనుటకు కారణంఏమిఅని అడిగెను. అప్పుడు రాణి ఇట్లుచెప్పెను: రాజా జంగమువాడువచ్చి ముష్టి పట్టకుండ వెడలిపోవుచుండెను. మరునటిదినమున మరల జంగమువచ్చుసరికి సతీపతులు ఇద్దరు రత్నములు ముత్యాలు చేతపట్టుకొని తలుపుచాటుననిలబడిరి. ఈజంగము వచ్చినతోడనే వారిద్దరు రత్నములు ముత్యాలు జంగము ఒడిలోవేసిరి. పుత్రపౌత్రులులేరు. మీచేతిభిక్షము హర హరా అంటరాదని పలికెను. అప్పుడు మాకేమిగతియని సతీపతులు ఇద్దరు సాష్టాంగ నమస్కారములుచేసిరి. ఆజంగమునకు దయగలిగి ఆయుష్షులేని కొడుకుకావలెనా అయిదవతనములేని ఆడది కావలెనా అని అడిగెను. ఆయుష్షులేని కొడుకుకావలెననిరి. అప్పుడు ఆజంగము ఊరుచెలపల కాళీ ఆలయము వెనకాల ముంతమామిడిచెట్టున్నది. ఆచెట్టున ఒకఫలము కోసుకొని భుజింపుమని పలికి అంతర్ధానమై పోయెను. అంతట ఆరాజు ఆవృక్షమెక్కి వడినిండా కోసుకొని చెట్టుదిగిచూడగా ఒకఫలమైయుండెను. మనకిప్రాప్తముయింతే అనుకొని ఆఫలముతీసుకొని వచ్చి భుజింపుమని భార్యకు ఇచ్చెను. అంతట ఆమె ఆఫలమునుభుజించెను. తరువాత తొమ్మిదిఘడియలకే పుత్రుడుపుట్టెను. పుట్టగానే యమదూతలువచ్చి మాపిల్ల వానిని మాకు ఇమ్మనిరి. అంతట పురుడుచూచేమా పుణ్యముచూచేమా అనిరి. అప్పటికివెళ్లి వారు తరువాత వచ్చిరి. ఆటచూచేమా పాటచూచేమాఅనిరి. ఆట పాట అయినతరువాత వచ్చిరి. చదువుచూచేమా పడుగు చూచేమా అనిరి. అప్పటికి వారు వెడలిపోయిరి. అప్పుడు మేనమామనితోడు ఇచ్చి కాశీయాత్రకు ప్రయాణముచేసిరి. అంతట పిల్లవానికి తలఅంటుచు తల్లి ఏడ్చెను. ఆమెకంటినీరు పిల్లవాని తొడమీదపడెను. అప్పుడుపిల్లవాడు అమ్మా ఎందుకు ఏడ్చెదవు అని అడిగెను. నాయనా నీవు వరప్రసాదివి. అనిఈజరిగిన వృత్తాంతమంతయుచెప్పెను. అప్పుడు ఆపిల్లవాడు అమ్మా నేను ఒకతులసిమొక్క నాటెదను, దానికి నీరు పోయుచు పెంచుచుండుము, ఆమొక్కవాడినయెడల నేనుపోవుదునని అనుకొనుము, ఆమొక్క బాగుండిన యెడల నేనుబాగుగావున్నానుఅని అనుకొనుముఅని చెప్పెను. తరువాత కావలసినసామగ్రిఇచ్చి కాశీయాత్రకు పంపివేసిరి. కొంతదూరముచెళ్ళుసరికి వారికి అలసటవచ్చి ఒకతోటలోదిగిరి. ఆదేశపు పట్టపురాజకొమార్తెకు వీరువెళ్ళిన మరునటిదినమున వివాహముజరుగును గావున ఊరంతయు అలంకరించిరి. తోటలో బసచేసిన మేనమామ మేనల్లుడు వివాహముచూచుటకై ఆగిరి. పెండ్లికొమార్తె చెలికత్తెలతో తోటలోనికి పువ్వులు కోసుకొనుటకు ఏగి యాత్రవెళ్ళుచూ వారుబసచేసినచోటునకే ఈపిల్లయువెళ్లెను. చెలికత్తెలందరు వడినిండా పువ్వులు కోసుకొనిరి. రాజకుమార్తెగావున పువ్వులు కోయజాలక కొంచెము పువ్వులు కోసుకొనెను. చెలికత్తెలు ఈముండ చప్పునిరాదు మనము వెళ్ళిపోదము అని వెడలిపోయిరి. అంతట రాజకుమార్తెకు కోపము

వచ్చి నాకు పెండ్లిఅవుతుంది, మాఅమ్మ నాకు శ్రావణమంగళవారమువ్రతము ఉద్యాపనచేసుకుంటుంది, నన్ను ముండాయని తిట్టెదరా అని పువ్వులు విసరివేసెను. ఏచెట్టున ఏకొమ్మనికోసినపువ్వులు ఆచెట్టుకొమ్మని వెళ్ళి అంటుకొనెను. ఈపిల్లవాని మేనమామచూచి ఈపిల్లని మాపిల్లవానికి పెండ్లిచేసినయెడల ఈగండము గడచి పోవునని తనలోపల అనుకొని ఆరాజకుమార్తెను తనదగ్గరకుపిలచి పిల్లవానిని ఒకతొడమీద ఈరాజకుమార్తెను ఒకతొడమీద కూర్చుండపెట్టుకొని వీరిఇద్దరి చెంగులను పువ్వులుముడివేసి ఇద్దరిచెంగులు కలిపి ముడివేసి పువ్వులు వీరిఇద్దరినెత్తిమీద వుంచివేసెను. చెంగులు ముడివిప్పివేసి రాజకుమార్తె ఒడినిండపువ్వులు కోసివేసి పంపివేసెను. తరువాత రాజకుమార్తెకు పెండ్లివారు మేళతాళములతో జయజయధ్వనులతో ఊరంతయు ఊరేగుచు పెండ్లికివచ్చుచుండగా పెండ్లికుమారుడు పల్లకీలో ముద్దఅయిపోయెను. అప్పుడు పెండ్లివారు పెండ్లికొమారుడు ఈఊరులో ఎక్కడనైనను ఈరాజుకు ఎరువుదొరుకునేమో యని వెదకుచు వచ్చిరి. ఈతోటలోనికిరాగా కాశీయాత్రచేయువారు వీరిద్దరు కనబడిరి. ఈపిల్లవానికి పెండ్లిఅయినదా అని ఆపిల్లవాని మేనమామను అడిగిరి. పెండ్లిఅవలేదని మేనమామ బదులుచెప్పెను. అప్పుడు వారు మాపెండ్లి కొమారుడు పల్లకీలో ముద్దఅయిపోయెను ఈరోజుకు మీపిల్లవానిని ఎరువుఇమ్మని అడిగిరి. అంతట ఆయన నగఎరువుఉండును బట్టఎరువువుండును గాని పెండ్లికొడుకు ఎరువువుండునా అని అనెను. వారు చాలగా బతిమాలగా వప్పుకొనెను. ఈపిల్లవానికి అలంకరించి పల్లకీలోకూర్చుండబెట్టుకొని ఊరేగుచు పెండ్లికివెళ్ళి పెండ్లి చేసుకొనిరి. పెండ్లిఅయినది. స్థాలీపాకమువేళ పెండ్లికుమార్తెకు తల్లి పదమూడుజోడాల అరిసెలు రవికలగుడ్డ ముట్టెలు మంగళసూత్రము అరిసెలుకుండలోపెట్టి వాసినరవికలగుడ్డకట్టి లడ్వాలుమోరుండలువేసి పెండ్లికొమార్తెకు వాయనమిచ్చెను. తరువాత ఆరోజునసే రాజులు గర్భాదానముచేయుదురు గావున రాత్రిగదిలోనికి పంపిరి. ఆమెనిద్రపోవుచుండగా కలలో శ్రావణమంగళవారముమహాలక్ష్మి ప్రత్యక్షమై నీభర్తకు గండము. నాలుగుతలల నాగేంద్రుడువచ్చి నీమగనిని కాటువేయును. నీవుభయపడక మీఅమ్మ వాయనమిచ్చిన కుండను కాటువేసినతరువాత నాగేంద్రునిఎదుటపెట్టుము. ఆనాగేంద్రుడు ఆకుండలోప్రవేశించును. వెంటనే రవికలగుడ్డపైన వాసినకట్టుము. తరువాత లడ్వాలు మోరుండలు కాటువేసినచోటవేసికట్టుము. తరువాతనాగేంద్రుడు ప్రవేశించిన కుండను నీకు వెలిసి అందనియెడల నీభర్తతొడపై ఎక్కి బోర్లించుము అనిచెప్పి అంతర్ధానమై పోయెను. వెంటనే మేలుకొనెను. తరువాత ఆనాగేంద్రుడువచ్చి కాటువేసెను. మహాలక్ష్మిచెప్పినట్లుగా రాజకొమార్తె ధైర్యముతో అన్నియుచేసెను. తెల్లవారుజామున భర్తలేచి ఎంతనిద్రపోతినే అనెను. నేను కాశీయాత్రకువెళ్ళి ఒకసంవత్సరములో వచ్చెదను. అంతవరకునీవు నీతండ్రిని సత్రవువేయించమని చెప్పుము నీవు దక్షిణతాంబూలము లిచ్చుచుండుము నిన్ను తెల్లవారినతరువాత పలుగులువలిచెదము అని, ఊరేగించెదము అనిలేపెదరు నీకుఅక్కరలేదు అనిచెప్పుము. మేనమామయు అల్లుడును కాశీప్రయాణమై వెళ్ళిపోయిరి. ఈమెను అందరునులేపిరి. నాకుఏమిఅక్కరలేదు. నాభర్తకాశీయాత్రకు వెడలిపోయెను. ఒకసంవత్సరమునకు వచ్చును. నీవుసత్రవుపెట్టించుము. నేనుదక్షిణతాంబూలములిచ్చెదను అనితండ్రితో చెప్పెను. ఆపెండ్లివారు వెడలిపోయిరి. ఆమె అట్లుచేయుచుండెను. ఒకసంవత్సరమునకు ఆమెభర్తయు మేనమామయు కాశీయాత్ర చేసుకొనివచ్చిరి. ఆరోజున రాజకుమార్తె అభ్యంగనముచేసి తలఆర్చుకొనుచు మేడమీద నిలబడి భర్తను చూచెను. వారిద్దరు భోజనము అయినతరువాత ఈమెదక్షిణతాంబూలములుఇచ్చి తనభర్తచెయ్యిపట్టుకొనెను. అంతట రాజకుమార్తెను నీవుఏమిఅనవాలుచూపగలవు అనిఅడిగెను. తరువాత ఆమె తనవ్రేలివుంగరము భర్తవ్రేలికి పెట్టగా సరిపోయెను. నాకాలిలో తామరపద్మము ఉన్నది. అదినాభర్తతొడపై ఉండును. నేనువెలిసెలో కుండబోర్లించితిని. దానిలో ఒకసర్పముఉండును అని ఆనవాళ్ళన్ని చెప్పెను. అంతరాజును







## ఆశీర్వాదము

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

శ్రీలఁజెలువొందుటకు సువాసినులొనర్చు
శ్రావణశుక్రవారపూజలకు నలరు
సమ్మహాలక్ష్మి శుభదృష్టి నవతరించు
నమృతవీచిక లశుభంబు నార్చుఁగాత.

---



## కాత్యాయని

శ్రీమతి సానాపతి రుక్మిణమ్మగారు

శ్రీమదోంకారపంజరాసీనశుకము
ప్రాంచదుపనిషదుద్యానపరభృతమ్ము
ఆగమారణ్యవీథీమహామయూర
మైన కాత్యాయనీదేవి నాత్మదలతు.







# మూ గి నో ము

అధికార్ల సూర్యనారాయణ రావుగారు బి.యె;బి.యల్.

నోముపట్టితే
నోములఫలమా!
నోముపట్టితే
చెప్పవే,
సఖి
నోముపట్టితే
చెప్పవే!
కరమున గుంకపు
బరిణనుంచుకొని
తిరిగెదవిండ్లకు
జవ్వనీ,
యిటు
తిరిగెదవిండ్లకు
జవ్వనీ!
శ్రావణమాసపు
సంగతులన్ని
బరిణనుదాచితె
బాలికా!
నీ
బరిణనుదాచితె
బాలికా!
చిటపటచినుకుల
చీరతడియగా
చిరునవ్వేచటిదె
చేడియా?
నీ
చిరునవ్వేచటిదె
చేడియా!
బొట్టులు పెట్టిన
బొట్టెలమోదము
పట్టుకుపోదువె
బాలికా,
వడి
పట్టుకుపోదువె
బాలికా!
బిత్తరిచూపుల
క్రొత్తకోడలా!
అత్తయెవ్వతో
చెప్పవే,
నీ
యత్తయెవ్వతో
చెప్పవే!
వ్రతముపేరు నీ
వలచినఫలంబు
బ్రతిమాలుదునే
తెల్పవే,
చెలి
బ్రతిమాలుదునే
తెల్పవే!
మగనిరాకయో
మనసునవలపో
మరియేశుభంబు
కోరితే?
సఖి!
మరియేశుభంబు
కోరితే!
ముసిముసినగవుల
మోముత్రిప్పెదవు!
మూగినోమటే
జవ్వనీ!
యిది
మూగినోమటే
జవ్వనీ!
పనసతొనలవలె
తనయులగనుటకో?
చెక్కులగులాబి
చిన్నెలుండుటకో?
కన్నుల బ్రణయపు
కళలురగులుటకో?
పట్టినదెల్లను
బంగారౌటకో?
యేమికోరితే
నోములఫలమా?
నోమెందులకో
తెల్పవే!
చెలి
నోమెందులకో
తెల్పవే!



తక్కినవారును సంతసించిరి. పిమ్మట భూదేవిఅంత అరుగువేసి ఆకాశమంతపందిరివేసి మహా చాలా వైభవముతో వివాహముజరిగెను. అల్లుడకును కోమటిసెట్టు కానుకలిచ్చి పేళితాళముతో ఆత్తవారిఇంటికి పంపివేసెను. ఇరుగుపొరుగువారుఅందరును మీకొడుకుకోడలు వచ్చుచున్నారుఅనిచెప్పిరి. అంధురాలై అత్తగారు వారలకు ఈమెవెళ్ళి కండ్లకు కాటుకపెట్టగా కండ్లువచ్చినవి. కౌగలించుకొనగా వడుముచ్చినది. కాళ్ళకు నమస్కారముపెట్టగా కాళ్ళువచ్చినవి. అష్టఅయిశ్వర్యములువచ్చినవి. ఈనోముపట్టినవారందరు సిరిసంపత్తులతో తులతూగుచుందురు. కేశలోపమైనా వ్రతలోపము కారాదు. భక్తితప్పినా ఫలముతప్పరాదు. వాయనతప్పినా వ్రతముతప్పరాదు. అయిదుయేండ్లు నోముపట్టవలెను. మొదటిఏడు అయిదు వాయనములు, రెండవఏడు 10, మూడవఏడు 15 వాయనములు, 4వ ఏడు 20 వాయనములు, 5వ ఏడు 25 వాయనములు ఇవ్వవలెను. ఈనోమునకు ఉద్యాపనగలదు. అది ఈఅయిదుసవత్సరములలో నెప్పుడైనను ఇతరుల వివాహసమయమున చేసికొనవచ్చును. ఉద్యాపనసమయమున పుణ్యస్త్రీపూజ, బ్రాహ్మణసమారాధనము ఇతరవ్రతములందువలె వానియుద్యాపనలందునువలె ముఖ్యము. ఈనోము తొలుతనోచిన అరాజకన్యకకు అప్పుడు ఎంతటిమహత్తరఫలము కలిగినదో భక్తితో నోచువారికి ఇప్పుడు కూడ అంతటి మహత్తరఫలముకలుగునని పెద్దలందురు. ఆస్తికభావముకలవారికివి ప్రమాణవచనములు.

## శ్రావణభాద్రపదములు

శ్రీమతి క్రొత్తపల్లి శారదాంబగారు

(హాస్యరచన)

[లోభయ్యశాస్త్రిగారును భార్య అమాయకమ్మగారును ప్రవేశించుచున్నారు.]

లో:—ఔనే యింటిదాన! యింకానిద్రేనా? తెల్లవారుచున్నది. కొంచెము మెళుకువ తెచ్చుకో.

అ:—రాత్రితెల్లవారులూ నల్లులు దోమలుకుట్టినవి. సరిగా ఒకఘడియయైనను నిద్రపట్టలేదు. కంటి రెప్పయినావాల్చలేదు. ఇప్పుడిప్పుడే కొంచెము కునుకుపట్టుచుండినది. ఏదోపుట్టిమునిగినట్లులేపుచున్నారు. మెళుకువవచ్చినది. ఏమిటో ఆచెప్పేది చెప్పండి.

లో:—తెల్లవారుచున్నది. నేను నదికిస్నానానికిపోవాలి గాని రెండుముక్కలు మాట్లాడుకుందాము సరిగా మెళుకువ తెచ్చుకో.

అ:—(ఊ ఊ అని ఊకొట్టును)

లో:—అయితే నేను దేశాటనంచేసి యేదో కొంతడబ్బు సంపాదిస్తేనేగాని యీసంసారం సాగేటట్టులేదు గనుక నేను యీఆషాఢమాసంలోనే ప్రయాణంకట్టదలచినాను. ముందుశ్రావణభాద్రపదములు వచ్చును. అప్పుడు వానలుగాన పప్పులు అవీ కావడంకష్టము. ఇప్పుడే అంతసామగ్రి జాగ్రత్తపెట్టుకుంటే శ్రావణభాద్రపదాలు వచ్చినప్పుడు హాయిగా మన మెవరిని అడుగకుండా ప్రతిరోజా పిండివంటలతో భోజనం చేస్తూహాయిగావుండవచ్చును. కనుక యీపదార్థములన్నియు నేను జాగ్రత్తపెట్టి వెడతాను. మైళుర్చుకు సొమ్ముసంపాదించుకొనివస్తాను. ఇది సంగతి. ఏం? తెలిసినదా? నిద్రేనా?

అ:—ఆ. ఏమిటి? యేమిటి? ఏవూరన్నా వెళ్లి డబ్బుసంపాదించితెస్తారా? సరే. ఇప్పుడు ప్రస్తుతం నాచేతిలో పైసాఅయినాలేదు. ఎప్పుడో డబ్బు సంపాదించితెస్తానని చెప్పి మీపాటికి మీరువెళ్లితిరా, నాకు జరిగేది కష్టం. కాన కొంతసొమ్మునాకిచ్చి మరీవెళ్లండి. మరల ఎన్నిరోజులకు వస్తారు?

లో:—అయ్యో! ఆదేమిటే అలామీద బుస్సుమనిపడతావు. ఏదో కొంతసొమ్ము యివ్వకుండ వెళతానా?

అ:— సరే ఏదో అన్నాను కానివ్వండి.

లో:— వెళ్లేది పునహాసతారాలు. అక్కడ యీఅమ్మవారి జాడ్యాలవల్ల శవవాహనం పని విరివిగా దొరుకుతుంది. మారంపెడతానుగనుక యెంతత్వరగా రావలెనన్నను కొంతఆలస్యము అవకమానదు. మన తాత గారిసొమ్మా, అబ్బగారిసొమ్మా అక్కడ సిద్ధముగావుండ డానికి? ఏదో పదిగోదానాలు పదిశవవాహనములు పని దొరకవలెను. మనకడుపునిండవలెను.

అ:— అయితే ప్రయాణముహూర్తం యెప్పుడు పెట్టినారు. శ్రావణశుద్ధవిదియ రోజునే బాగుంటుంది. కేవలం ఆషాడమాసం శూన్యం అని పెద్దలంటారు. అందుచేత ఈనెలలో ప్రయాణం మనకుకలిసిరాదు."

లో:— అయ్యో తెల్లవారినది. నేను స్నానమునకు పోవుచున్నాను. నావిభూతిబుఱ్ఱ యెక్కడ వున్నది? [అనుచు నిష్క్రమించును.]

అ:— "సరిలెండి. నాకు ప్రొద్దెక్కినది. వీధిపాచి చేసుకోవలెను. [అనుచు లేచి చీపురుకట్ట అలుకు గుడ్డతో వెళ్లిపోవును]

వీరి సంభాషణలు తలుపుదగ్గరపొంచుండి పొరుగూరి కొంటెగాండ్రు యిద్దరువినిరి. సరే మనపని బాగుందిరాఅని అనుకొనుచు వారు నిష్క్రమించిరి. లోభయ్యశాస్త్రిగారు పూనహసతారాలకు ప్రయాణం కట్టివెళ్లిరి. అమరువాడు యీకొంటెగాడిదలు ఆయన గ్రామాంతరంవెళ్లినట్లు కనుగొని గడుసుసోదరులు తమ పేరులు శ్రావణభాద్రపదములు అని పేర్లుపెట్టుకొని ఆప్తబంధువులవలె కపటవేషములనుధరించి అమాయ కమ్మగారి యింటికరుదెంచి తలుపుతట్టిపిలిచిరి. ఇంటిలోనుంచి అమాయకమ్మగారువచ్చి తలుపుదీసి మీరెవ రని అడిగిరి. "అమ్మా! మేము మీకు అపూర్వబంధువులము. మాపేర్లు శ్రావణభాద్రపదములు" అనేటప్పటికి "నాయనలారా! రండి. మాఅయినమీరువస్తారని చెప్పినారు. ఊరికివెళ్లి నాలుగురోజులయినది"అని జాగ్రత్తగా ఉపచారము చేయుచు భోజనసత్కారములుచేయుచు ప్రతిదినమునను పంచభక్ష్యపరమాన్నములతో భోజనములు పెట్టుచుండెను. తనభర్త చెప్పినప్రకారం యేలోటురాకుండా శ్రావణభాద్రపదములకు మర్యాదచేయు చుండెను. శ్రావణభాద్రపదములు రెండుమాసములును అధితులిద్దరు అధికసత్కారములను బొందుచు అమాయి కమ్మగారికి ఆప్తులై అతిసంతోషముతో కాలక్షేపముచేసిరి. భాద్రపదమాసాంతము ముందు అమ్మగారిదగ్గర శెలవుగైగొని తమ గ్రామములకు వెళ్లిపోయిరి. లోభయ్యశాస్త్రిగారు ఆశ్వయుజమాసారంభమందు పునహా సతారాలనుంచి స్వగృహమునకు దయచేసిరి.

అ:— (భర్తతో) ఏమండో! శ్రావణభాద్రపదాలువచ్చినారు. రెండుమాసములనుంచి మనయింటిలో వున్నారు. మీరురాలేదని మిమ్ములను చూడాలని కలవరించినారు. కాని మీరెంతవరకు రానందువలన వారు వెళ్లిపోయినారు. వారు చాలామర్యాదస్థులు. మంచిమనుష్యులునుమండీ. మీరుచెప్పినప్రకారంగా నేనువారికి బహుజాగ్రత్తగా చూచినాను. ఇంట్లోనిలవవున్న పుగ్రాణపుకొట్లోని సామగ్రి అంతయు వీరి ఫలహారములకు పిండివంటలకు అంతరించినది. డబ్బుయేమాత్రం సంపాయించినారు?

లో:— శ్రావణభాద్రపదములు యెవరే? మనకు చుట్టాలెవరే? నీఅమాయకము తగలబడిపోను. ఇల్లు గుల్లచేసినావే? పైగా యెంతసొమ్ము తెచ్చినారుఅని అడుగుచున్నావే? శ్రావణమాసము భాద్రపదమాసము అని నెలలపేర్లు. అవి వర్షఋతువుదినములు. వర్షములగుటచే వంటకు కట్టెలుయెండువిదొరకవు. వడ్లుదంపుటకు ఎండలుండవు. కనుక అంతసామగ్రియు ముందుగా జాగ్రత్తగా వుంచుకుందామని చెప్పినాను గాని యిదేమి పాపమే? నాలాటిలోభికి ఖర్చుయెక్కువ. నీలాటియేభ్రాసికి పనియెక్కువ; అనేమాట నిజమయినదే [అని యిటుల విచారించుచు భార్యాభర్తలు దిగులుపడిరి.]



## శ్రావణమాసము : గౌరీపూజా ప్రాధాన్యత:—

"ప్రతిసంవత్సరమునను నీశ్రావణమాసపుదినములు 'విదుపతినము'ను కాంక్షించుచు గౌరీపూజాతత్పరలై తత్సంబంధములగు నుత్సవములు వేడుకలు వెలయ హైందవయువతులెల్ల రొండొరుల గృహంబులకు వెడలుచు గౌరీదేవికి పూజలొనర్చుచు మంగళహారతులు పాడుచు నన్యోన్యశుభసౌభాగ్యాదుల పరామర్శించుకొనుచు పూజాసంభ్రమముతో గడపుదీక్షాదినములు. గౌరీపూజ హైందవగృహిణి నిత్యమును చేయవలసినదే. కాని ముఖ్యముగ హైందవబాలిక పెండ్లియైన తరువాత ఐదుసంవత్సరములు తప్పక శ్రావణమాసమున మంగళవారముల నధికమగు శ్రద్ధతో గౌరీపూజను గావించి యైదువరాండ్రకును ముత్తైదువలకును పాదములకు భక్తితో పసుపురాచి పారాణితీర్చి దిద్ది వారికి కుంకుమతిలకమిడి నానబోసిన శనగలు కొబ్బరిముక్కలుగాని కదళీఫలములుగాని యుపాహారము (వాయనము)గానిడి చందనతాంబూలములిచ్చి సత్కరించి యవ్విధమున తన గౌరీపూజలను సఫలీకృతముగఁజేసికొని ధన్యయగును. రుక్మిణి గౌరినిపూజించి తాను మనమునవరించిన కృష్ణుని భర్తగాఁ బడయగల్గెను. ఏనాటినుండి వచ్చెనోగాని పెండ్లిలో కన్యచే గౌరీపూజచేయించుట వివాహపుతంతులో ప్రాముఖ్యమగు సాంప్రదాయాచారమైనది. భర్తలతోడిదె లోకమని యెంచి నమ్మి వారి యారోగ్యైశ్వర్యముల నాకాంక్షించుచు తమకును, తమభర్తలకును ఎల్లప్పుడుశుభపరంపరలుగలుగ గౌరీపూజలనుచేయు హైందవమహిళలు ధన్యలు. ఇట్టిపూజలు, వ్రతములు పాశ్చాత్యవనితలకులేవు. దాంపత్యమున స్త్రీపురుషుల కిరువురికును శుభములుగలుగుటకై యిట్టిపూజలు, వ్రతములు యాచారములుగ యుగయుగముల నుండి వచ్చుచున్నవి గదా? ఈగౌరీపూజలు మన హైందవసోదరీలలామలు సలిపి తాముధన్యలై గౌరీప్రసాదమును బడసి ప్రస్తుతదుర్భరదేశకాలపరిస్థితులను కూడ మార్పునొందించి లోకకల్యాణమునకు తోడ్పడుదురుగాక! దేనివలనగాని నెరవేరనిపనులు ప్రార్థనవలన నెరవేరునని టెన్నిసనుమహాకవి వ్రాసియున్నాడు."

—ఆకుండి వేంకటశాస్త్రి.

## శ్రావణమాసము పేరంటముల మాసము:—

"మాసములలోనికెల్ల శ్రావణమాసము శృంగారవినోదముల కాటపట్టు. ఈనెలలో జూచు వింతయేదనగా క్రొత్తగా వివాహమైన ముగ్ధరాండ్ర ముద్దుపూజలే. పేదసాదవిపక్షతలేక సౌభాగ్యవతులగు హిందూనారీమణులెల్లరును అందుముఖ్యముగా క్రొత్తగా వివాహమైనవారును తమ సౌభాగ్యాభివృద్ధికై ఈనెలలో మంగళవారము గౌరీవ్రతమును, శుక్రవారము వరలక్ష్మీవ్రతమును సల్పుదురు. శ్రావణమాసములోఁ బ్రతిమంగళ

వారము రేపనగా వివాహమైన బాలికలందరు సోమవారము మధ్యాహ్నమే మంచివస్త్రములనుధరించి తమకుఁ గల యలంకారములను పెట్టికొని దమబంధువులలోను, స్నేహితులలోనుగల పుణ్యస్త్రీలనందరిని రేపు తాము చేసికొనుపూజకువచ్చి వాయనములందుకొని పొమ్మని పిలుతురు. మంగళవారముదయమున వేలేచి స్నానమాచరించి పలురంగులుగల పూలతోను, పత్రిలతోను గౌరీపూజనుజేసి నానబోసిన శనగలను దేవికి నైవేద్యముపెట్టి ముందుగా పెద్దపుణ్యస్త్రీలకు వాయనమిత్తురు. మధ్యాహ్నము గ్రామములోగల పుణ్యస్త్రీలందరు విలువగల దుస్తులను నగలనుధరించి అత్తరు పన్నీరుపూసికొని తమ్ము పిలిచిన వారిండ్లకుఁబోయి వాయనములందుకొందురు. ఇట్లీమాసము పేరంటములమాసమై గ్రాలుచున్నది."

—సమయమంత్రి రాజ్యలక్ష్మి.

## శ్రావణము: స్త్రీపురుషులకు ఉత్సాహప్రదము:—

"సంవత్సరములో వచ్చుమూడుకాలములు మానవుని జీవితమునకు మూడువిధములగు ఫలములొసఁగుచున్నవి. వానిలో వర్షాకాలప్రారంభము గ్రీష్మతాపముచే బరితపింపబడిన ప్రతిజీవికిని అమృతప్రాయమై ఆనందదాయకమగుచున్నది. ప్రకృతి సౌందర్యము నభిలషించువారిని నీలజీమూతములచే నిండిన నీలాకాశము పచ్చిక బయళ్లతో నొప్పుచున్న పృథివి శైత్యసౌరభ్యములతో గూడిన మారుతములు సంతోషవీచికలఁదేలించుచున్నవి. వర్షాకాలపు మాసములలో మొదటిదగు శ్రావణమాసము గౌరీదేవికి మిగుల ప్రీతికరమైనది. ఈమాసములో వచ్చుమంగళవారములు గౌరీదేవిపూజకును, శుక్రవారములు మహాలక్ష్మీపూజకును ప్రశస్తములైనవి. పౌర్ణమి రోజున బ్రాహ్మణులు జందెములను మార్చుకొనెదరు. క్రొత్తగా వివాహమైన బాలికలకు అత్తవారు శ్రావణపట్టితెచ్చి వారిచే వ్రతముచేయింతురు. అట్టి బాలికల సంతోషమునకు మేరయుండదు. స్త్రీజనమునకంతటికి అత్యంతసంతోషకరమైన మాసము యిదియొక్కటియేనని నొక్కిచెప్పవచ్చును. ఏవీథిని జూచినను రేబజారున తిలకించినను తండోపతండములు గావచ్చుచున్న సువాసినీసమూహములం గాంచిన మంగళగౌరీదేవి మానవరూపముల ధరించి వీథులవెంట విహరించుచున్నదాయనునట్లు చూపఱకు నేత్రానందము కలుగఁజేయును. సామాన్యముగా పేరంటమునకువెళ్లని ముసలిముత్తైదువలుకూడ శనగలమూటల చంకనిడుకొని విసుగులేక పిలిచినవారందరియిండ్లకువెళ్లడము చూడ యీమంగళవారముల యందెంతమహాత్మ్యమున్నదో యని తలపకమానరు. శ్రావణశుక్రవారములలో పూర్ణిమకు పూర్వమువచ్చువారము శ్రీవరలక్ష్మీదేవి నారాధించెదరు. స్త్రీల భాగ్యసౌభాగ్యముల నభివృద్ధిపొందించుట కేర్పడిన వ్రతములలో నీవ్రత మగ్రస్థానమలంకరించునని చెప్పనొప్పును. ఈమాసములో వచ్చుపర్వములలో శ్రీకృష్ణజయంతి ఒకటి. వైష్ణవులు స్మార్తులుకూడ మిగుల శ్రద్ధాభక్తులతో జయంత్యుత్సవమును జేసెదరు. బజారులలో పందిళ్లువేసి ఉట్ల వేడుకలును హరికథాకాలక్షేపములనుచేసి శ్రీకృష్ణజననమును ప్రతివ్యక్తికిని తెలియునట్లు చేయుదురు. ఈ కారణమువలన నీమాసము స్త్రీలకేకాక పురుషులకు గూడ నుత్సాహకరమైనదైయున్నది."

—ఎమ్. వేదవల్లి తాయారమ్మ.

## శ్రావణమాసపు పండుగలు:—

"మాసములలో శ్రావణమాసము శుభప్రదమైనది. ఈమాసమంతయు పర్వదినములచేత ప్రకాశించుచుండును. శ్రవణానక్షత్రముతోగల పూర్ణిమగలదగుటచే దీనికి శ్రావణమని పేరువచ్చినది. యిదివర్షఋతువుకు ప్రారంభముగలదైయున్నది. శ్రావణమాసపు ప్రకృతిసౌందర్యము చూచియానందించదగినదైయున్నది. అప్పుడప్పుడు తూర్పుగాలి వీచుచుండును. ఉత్తరదిశయందు విద్యుల్లతాకాంతులు మెరయుచుండును. దక్షిణాభిముఖ

ముగా కారుమబ్బులు క్రమ్ముచుండును. ఆకాశమున పడమటివైపు నొకప్పుడు యింద్రధనస్సులు కాన్పించుచుండును. వర్షములచే నదులు పొంగిపొరలుచూ చూపరులకు భయంకరములుగ నుండును. ఆకాశము మేఘావృతమై సూర్యుని కాంతిహీనునిగ చేయుచుండును. తరచు సంతతధారాపాతవర్షంబులు కురియుచుండును. మేఘగర్జనలు, కప్పలబెకబెకలు, నెమళ్ల కేరులు వినబడుచుండును. భూమియందు పచ్చిక తివాసీ బరచినట్లుండి చూపరుల కానందము గొలుపుచుండును. వేడిరైన గ్రీష్మఋతువు అంతరించిన తర్వాత వర్ష ఋతువులో తరచువ్యాధులు వచ్చుచుండును. కావున కాచివడకట్టిన నీటినిద్రాగుటమంచిది. తేలికగా జీర్ణమగు ఆహారమును భుజించుచూ ఆరోగ్యముగనుండుట మంచిది. ఈశ్రావణమాసమందు స్త్రీపురుషాదులకు పనికివచ్చు పండుగలు పెక్కులుగలవు. 1 చూడికుడుతనాంచారి తిరునక్షత్రం. 2 మధుశ్రవావ్రతం. 3 నాగచతుర్థి. 4 గరుడపంచమీవ్రతం. 5 సూర్యషష్ఠి. 6 కౌమారీదేవిపూజ. 7 దధివ్రతారంభం. 8 వేదవ్రతారంభం. 9 పుత్రదయేకాదశీవ్రతం. 10 దామోదరద్వాదశీవ్రతం. 1 వరాహజయంతి. 12 శ్రావణపూర్ణిమ. 13 అశూన్యశయనవ్రతం. 14 రాఘవేంద్రతీర్థానం పుణ్యదినం. 15 సంకటచతుర్థీవ్రతం. 16 కృష్ణాష్టమి. 17 కామికయేకాదశీ వ్రతం. 18 పోలకాంబావ్రతం. ఈవ్రతములు యీనెలపొడవుననూ ఉన్నవి. కాని శ్రావణమాసపు వ్రతములన్నిటిలోనూ మంగళగౌరీవ్రతమున్ను, వరలక్ష్మీవ్రతమున్ను, శ్రావణపూర్ణిమవ్రతమున్ను అనేకులచేత ఆచరింపబడుచున్నవి. వీనినిగూర్చి విస్తరించుట అనవసరము. పోలకాంబావ్రతమును గూర్చి కొంతముచ్చటింతును. శ్రావణబహుళ అమావాస్యనాడు సాధారణముగా స్త్రీలు పోలకమ్మ పూజచేసికొందురు. కందచెట్టును ప్రాణప్రతిష్ఠచేసి షోడశోపచారములతో పూజింతురు. తమకు కలుగుసంతతి నష్టపోకుండా వృద్ధినొందుటకు ఈవ్రతమాచరింతురు. కందచెట్టును పూజించుటయెందుకనగా కందదుంప పిలకలను బెట్టినటుల తమ గృహము పిల్లలతో నిండవలెననియు సదా ఆరోగ్యవంతులు కావలయుననియు కోరుచూ ఈపూజచేయుదురు. ఇట్లు శ్రావణమాసము ప్రకృతిసౌందర్యములోనూ, పండుగపర్వములచేతనూ, నోముల వ్రతములచేతనూ ప్రకాశించుచూ పుణ్యస్త్రీలకు ప్రియకరమైనదిగానున్నది. ఎక్కువ శుభదినములచే ప్రకాశించు శ్రావణమాసపువిశేషము విశేషశ్రవణయోగ్యమైనది."

—సుసర్ల లక్ష్మీనరసమాంబ.

### శ్రావణమంగళవారవ్రతము: ఆరోగ్యవర్థకము:—

"శ్రావణమంగళవారమునోములో ఐదు జ్యోతుల వెలిగించి దేవతయగు గౌరినిబూజించి యాజ్యోతులపైన కాటుకను బారించి దానిని పేరంటాండ్రకొసంగి తాను పెట్టుకొనవలయును. ఆజ్యోతులకు పమిడిపత్తియు ఆవునెయ్యియు గావలయును. ఇప్పటి ఆంధ్రఆంగ్లవైద్యు లెల్లరు కంటిజబ్బులయందు పమిడిపత్తి వృక్షమొనర్చు సాహాయ్యమును బాగుగ గుర్తించియున్నారు. కంటిజబ్బులకు పమిడిపత్తివృక్షము కల్పవృక్షమనియే చెప్పవలయును. అట్టి కాటుకను ధరించుటచేతనే భారతదేశనారీరత్నములు కండ్లజబ్బులు లేక సుఖముగనున్నారట. ఇప్పుడిప్పుడు నవనాగరికతమీరిపోయి ఆంగ్లపాఠశాలల చదువు బాలికలు కండ్లజోడులధరింపవలసివచ్చుట యిట్టి మహత్తరమైన ప్రాచీనాచారమును తిరస్కరించిన గతమునకే యని జ్ఞప్తియందుంచుకొందురుగాక. ఇక రెండవవిషయమేమన నానబోసిన పచ్చిశనగలయందు వైటమినులను ప్రాణపోషకబలవర్ధకపదార్థములుగలవు. దైవప్రసాదమనిన దానిని మనము స్వీకరింతుమని యెఱింగి పెద్దలట్లు శనగలను వాయనములీయ నియమించిరి. ఇయ్యది అపక్వాహారస్వీకరణము."

—పులవర్తి కమలావతీదేవి.

## శ్రావణపట్టీ:—

"సాధారణముగా మన హిందువులలో మాఘాదిపంచకమందు వివాహములు జరుపుచుందురు. అనగా మాఘమాసమందు ప్రారంభించి జ్యేష్ఠాంతముతో వివాహముహూర్తములుపూర్తిఅగును. ఆషాఢమాసము శూన్యమాసముగాన శుభకార్యములు జరుపుకొనుటకు పనికిరాదందురు. క్రొత్తగా వివాహమైన వధువుకు శ్రావణమాసము ప్రవేశించగానే పుట్టింటివారు శ్రావణమంగళవారవ్రతము చేయించెదరు. శ్రావణమాసములో పూర్ణిమకు ముందువచ్చెడి శుక్రవారంనాడు వరలక్ష్మీవ్రతము పెండ్లికూతురుచే చేయించుకొరకు అత్తవారు తమకు ముఖ్యబంధువులచేతగాని లేక పురోహితులచేతగాని శ్రావణపట్టీని పెండ్లికూతురునిమిత్తం పంపుదురు. తమ తమ శక్తికొలది బంగారుకాసులు, పసుపు, కుంకుమ, చీరెలు, రవికలు, బెల్లము, పండ్లు, తమలపుఆకులు, వక్కలు, సుగంధద్రవ్యములు, వివిధములగు బొమ్మలు, పుష్పములు పంపుదురు. ఆరోజున వధువుపుట్టింటివారు పెండ్లికూతురుచేత వరలక్ష్మీవ్రతము యథావిధిగా చేయించెదరు. మిత్రబంధులందరిని విందుకు పిలచెదరు. భోజనానంతరమందు శ్రావణపట్టీని దెచ్చినవారికి నూతనవస్త్రసన్మానమును చేతురు. ఇట్టి శుభప్రదమైన వరలక్ష్మీవ్రతముచేయు సుదినమందు వధూగృహము వేడుకలతో శోభాయమానమై ప్రకాశించుచుండును. వ్రతాంతమందు వరలక్ష్మీదేవికి భక్తురాలగు చారుమతీదేవియొక్క చరిత్రను పురాణశ్రవణము గావింతురు. ఇందుల ఫలితార్థమేమనగా చారుమతీదేవి భర్తయందు భక్తికలిగియుండి అత్తమామలకు శుశ్రూషజరుపుచుండును. విద్యావంతురాలు. ఇంపుగా మాట్లాడును. నిర్మలమైన అంతఃకరణగల సాధ్వీమణి భక్తురాలు లక్ష్మీదేవిని పూజించి సమస్తవరములు సంపాదించినది. చారుమతీదేవివలె పెండ్లికూతురుకూడ, సన్మార్గవర్తియై, సద్గుణనిధియై ప్రవర్తించవలెనని పెద్దల యభిప్రాయమైయుండవచ్చును. ఇదియిటుండ వరునికి వియ్యాలవారు ఆషాఢపట్టీని పంపనందున శ్రావణపట్టీని బంపలేదని కొందరందురు. ఈ ఆషాఢపట్టీ విశ్వామిత్రసృష్టియని యనతగినదైయున్నది. ఇది కలియుగనారదులచే కల్పించబడినదని కొందరనెదరు. ఆషాఢపట్టీ పంపనివారికి శ్రావణపట్టీనిపంపుట కొందరు విరమించుచున్నారు—ఇట్టి విపరీతచేష్టలచే పురుషపక్షీవారు స్త్రీవియ్యాలవారికి తరుచు వింతయు చింతయు కలిగించుచుండుట గలుగుచున్నది."

—కోటమర్తి రాజేశ్వరమ్మ.

## శ్రావణమాసము : ఆచారవ్యత్యస్తము:—

"పూర్వము మనహిందూనారీమణులు వివాహమైనపిమ్మట శ్రావణమాసమందు మంగళవారమని, గరుడపంచిమి అని, దీపాలఅమవాశ్యయని వ్రతములు పట్టువారు. అట్టితఱి క్రొత్తపెండ్లికొమార్తెను అత్తవారింటికి మాధ్యమిలేకుండ జూచి పిల్చుకొనివచ్చి మంగళవారమువాడు అభ్యంగనముచేయించి పసుపుతో గౌరిదేవిని చేసి ఒకకొబ్బెరగిన్నెలో గౌరమ్మనుఉంచి ఒకపీటను పసుపుతో అలికి కుంకుమబొట్లుబెట్టి దానిపై కొంచము తండులములుఉంచి ఒకపట్టురవికబెట్టి దానిపైని గౌరమ్మనుబెట్టి మంగళవారపుకథ జెప్పి నోమించెదువారు. ఆసందర్భమున పెండ్లికొమార్తె తల్లికి చీరరవిక పప్పుతోచేసినకుడుములు ఐదు వాయనమిప్పించుట పిల్లకు చీరరవిక ఇచ్చుట వాడుకరైయుండెను. దీనికే శ్రావణపట్టి అనిపేరు. శ్రావణపౌర్ణమికి క్రొత్తఅల్లుని పిలిపించి తొలిశ్రావణమని నూలువస్త్రములిచ్చుట వాడుక. ఇప్పుడవి యజ్ఞోపవీతమిచ్చి ఓయిబాబో వెండిగంపకు లాహీలిస్తారా కప్పు సాసర్లిస్తారా అనిప్రశ్నలు. వచ్చినప్పుడల్లా నాకేమిస్తారన్న మాటేగాని పెండ్లిపిల్లకు ఒకనూలు రవికైనకానరాదు."

—కంకిపాటి రుక్మిణమ్మ.

# గ్రంథపరిచయము

## శ్రావణగీతములు:—

'శ్రావణమాసమునందు నవవైవాహితలగు సువాసినులకు నవసరంబైన మంగళశుక్రవారవ్రతవిధాన కథలు' పద్యములుగాను, పాటలుగాను ఈగ్రంథమున ప్రస్తరింపబడినవి. గ్రంథముతుదిని శ్రావణమంగళగౌరీ పూజాకల్పము చేర్చబడినది. స్త్రీలకు శ్రావణమాసవ్రతాచరణసందర్భమున ఈగ్రంథము చక్కగనుపయోగింపగలదు. తమస్వంతగ్రంథసముచ్చయమున వ్రతపరాయణలగు స్త్రీలీగ్రంథముప్రతినొకదాని నుంచవలెను. గ్రంథకర్త గంధం సీతాపతిశర్మ. 1931-వ సంవత్సరమున గుంటూరు శ్రీవేంకటేశ్వరముద్రాక్షరశాలయందు ముద్రితము. చిన్నసైజు. 40 పుటలు. వెల రు 0-2-0. వలయువారు: గంధం సీతాపతిశర్మగారు, లింగంగుంటపాలెం లేక పునులూరు (వయా) పొన్నూరు, గుంటూరుజిల్లా అనివ్రాయునది.

## శ్రీద్వాదశనామసహస్రాష్టోత్తరస్తోత్రరత్నాకరము:—

గణపతి, గాయత్రి, విష్ణు, శ్రీరామ, ఆంజనేయ, వెంకటేశ, శివ, సుబ్రహ్మణ్య, లలిత, లక్ష్మి, అన్నపూర్ణ, కాళిక అను పండ్రెండుగురు దేవతల సహస్రాష్టోత్తరనామావళీవివరముగల గ్రంథము. పూజాతత్పరులకు మిక్కిలి ఉపయోగకరము. కర్నూలు చంద్రమౌళీశ్వరముద్రణాలయమందు ముద్రితము. 1931. చిన్నసైజు. 716 పుటలు. చక్కని కాలికోమార్బులు బైండు. వెల ప్రతి ఒక్కంటికి రు 1-8-0 బి. జె. కృష్ణశాస్త్రి, హాలహర్విపోష్టు, బళ్లారిజిల్లా అను విలాసమునకు వ్రాసిన గ్రంథము బడయగలరు.

## సునందని:—

గ్రంథకర్త్రి శ్రీమతి ఆచంట సత్యవతీదేవి. శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు దీనికి పీఠిక వ్రాసియున్నారు. క్రౌనుసైజున 178 పుటలు. వెల రు ౧-౦-౦. దొరుకుచోటు యస్. శేషాచలము అండ్ కంపెనీ, పుస్తకవ్యాపారస్థులు, మచిలీపట్టణము. సునందిని యొక నవల. స్వకపోలకల్పితము. రసవంతమగు శైలిగలిగి భారతనారీమణులకు గుణపాఠము నేర్పజాలెడిదై యున్నది. కథాంశమును విస్తరించి విశాలమగుభావములను వ్యక్తీకరించివ్రాయుటలో కర్త్రిజూపిన శక్తిసామర్థ్యములు వర్ణనాతీతములు. ప్రకృతిసౌందర్యము కన్నులగట్టినట్లు చిత్రించబడినది. ప్రథమప్రయత్నముననే యిట్టియుద్గ్రంథమునుకల్పించి ఆంధ్రభాషామతల్లికి భూషణముగా సమర్పించిన శ్రీసత్యవతీదేవిగారెంతయు ధన్యురాలు.

—కుర్రా వేంకటసుబ్బారావు చౌదరి.

## సత్యభామాపరిణయము:—

ఇదియొకఆంధ్రనాటకము. నీలాపనిందాపరిహారమను నామాంతరముగలదు. కర్త వింజమూరి వీరరాఘవాచార్యులవారు. వీరుసంస్కృతాంధ్రకవితావిచక్షణులు. ఈనాటకము శ్రీమత్పనప్పాకము అనంతాచార్యులవారి వైజయంతినుండి పునర్ముద్రితము. డెమ్మిసైజున 74పుటలు. గ్లేజుకాగితములు. వెల 8 అణాలు. నీలాపనిందలు కలుగకుండునట్లు ప్రతిసంవత్సరము వినాయకచతుర్థీదినమునందు సత్రాజిదుపాఖ్యానము చదువుదురు. దానికిగాను ఈగ్రంథముచక్కగనుపయోగపడును. శైలిసాంస్కృతికము. గ్రంథములు వలయువారు: టి. రాజగోపాలాచారి, లేక్‌సైడు, కీల్పాకము, మదరాసు అనివ్రాయునది.

### లోకములు, లోకాంతరములు :—

మొదటిభాగము. దీనియందు ౧. లోకములు, లోకాంతరములు తద్యాత్ర; ౨. భూతభౌతిక సృష్టివివరణము ౩. చతుర్దశమన్వంతర వివరణాదికము అను మూడుప్రకరణములుగలవు. ఒంగోలు మిషన్ కాలేజి సంస్కృతాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిలవారిచేత శ్రుతిస్మృతిపురాణజ్యోతిస్సిద్ధాంతగ్రంథములు పరిశీలించి వ్రాయబడినది. స్వధర్మప్రకాశిని పత్రికనుండి పునర్ముద్రితము. 1931. డెమ్మీ సైజు. 189 పుటలు. గ్లేజుకాగితములు. వెల రు 1-0-0. గ్రంథము అపూర్వవిషయములకు గనిగానున్నది. ఇందు వర్ణితములైన భూలోకము నచటివిశేషములకేమిగాని దృశ్యములుకాని భువర్లోకాదులు నచటివిశేషములు చదువదగియున్నవి. విశేషమేమన నలయుతావుల నవీనశాస్త్రములనుండి ప్రమాణములు చూపబడినవి. ఈఉత్తమగ్రంథమును విలిచి దీనిరెండవభాగముయొక్క త్వరప్రచురణమునకు తోడ్పడుదురు గాకయని ఆంధ్రమహాశయులనుగోరెదము. దొరకుచోటు: క. మార్కండేయ శర్మగారు, ఎడిటరు, స్వధర్మప్రకాశిని, నెం. 82 పూనమల్లిహైరోడ్, బృందావనము, కీల్పాకుపోస్టు, మదరాసు.

## పత్రికాపరిచయము

### కాంగ్రెస్ :—

పలుకుబడిగల తెలుగువారపత్రికలలో నొకటియగు కాంగ్రెసు పూర్వసంపాదకులు మద్దూరి అన్నపూర్ణయ్యగారింకను జయిలునందుండగానే ప్రస్తుతసంపాదకులు క్రొవ్విడి లింగరాజుగారు నిర్బంధితులగుటచే వారిస్థానే రామచంద్రుని వెంకటప్పగారు సంపాదకత్వము వహించినారు. పత్రికయథారీతిని నిర్వహించుచున్నారు. దినేశుని అస్తమయము మొదలగు ఇతర తెలుగుపత్రికల కందనివిషయములతో పదియవ సంపుటములోని ఈపదునారవసంచిక క్రాలుచున్నది. ఆంధ్రులింకను విశేషముగ నీపత్రికను ప్రోత్సహింతురుగాక! సంవత్సరచందా రు 3-0-0 మాత్రమే. వలయువారు కాంగ్రెస్, సీతానగరము, వయా కొవ్వూరు, గోదావరితీరము అనివ్రాయునది.

### విద్యానంద :—

శ్రీదిగంబర విద్యానంద అవధూతస్వాములవారి సంస్మరణార్థము ప్రచురింపబడుచున్న మాసపత్రిక. నాలగవసంపుటము మూడునాలుగుసంచికలు మాకార్యాలయమునలంకరించినవి. సారస్వతసమితి సామిత్యులగు ఆకుండి వేంకటశాస్త్రిగారు, పండిత బులుసు రామజోగరావుగారు, ఉభయభాషాప్రవీణులగు బులుసు నరసింహశాస్త్రిగారు మున్నగు ఆంధ్రవిద్యాధికుల పద్యవ్యాసములతో సంచికలు ఒప్పుచున్నవి. సంపాదకులు శ్రీసాధు వేంకటేశ్వరశాస్త్రిగారు: దొరకుచోటు విద్యానందప్రెస్, 13 సుబ్రహ్మణ్యమొదలివీధి, పరశువాకము, మద్రాసు.

### ఆంధ్రవైద్యసమ్మేళనపత్రిక దశమవార్షికసంచిక :—

ఆంధ్రవైద్యసమ్మేళనపత్రిక ఆంధ్రవైద్యమండలిపక్షమున ప్రచురింపఁబడు మాసపత్రిక. బాలారిష్టములను అతిక్రమించి ఈపత్రికాపుత్రికకు పదిసంవత్సరములు నిండినశుభావసరమునకు ఉచితమగునట్లు ఈదశమవార్షికసంచిక ప్రచురింపబడినది. భిషగ్వర వేటూరి శంకరశాస్త్రి ఏ.ఎం.ఏ.సి. గారు సంపాదకులు. సంచిక క్రౌనుసైజున 180 పుటలు. గ్లేజుకాగితములు. చందాదారులకు సంచిక వెల అ 10. ఇతరులకు రు 1.

సంచిక చిత్రపటశోభితము. ఆయుర్వేదోద్ధారకులు, అపరధన్వంతరులునగు వైద్యరత్న పండిత డి. గోపాలాచార్యులవారి త్రివర్ణచిత్రము దర్శనీయము. ధన్వంతరి చిత్రములు రెండు. నేటి ఆయుర్వేదవైద్యలోకమునకు నాయకులగు డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారియు; గిరీంద్రనాథముఖర్జీ, గణనాథసేన్ సరస్వతిగార్లయు తదితరులయు చిత్రములు ఏబదిరెండు సంచికను శోభస్కరము గావించినవి. వ్యాసములు విషయగౌరవముగలిగి పఠనీయములుగనున్నవి. డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి 'నాసందేశము' అనువ్యాసము జాతికి 'తుష్టి, పుష్టి, ఆరోగ్యము, ఆయుష్యము' చెప్పుటయెట్లో సమాలోచించునదిగానుండి స్తవనీయమైయున్నది. మధువునుగూర్చి వేటూరి చంద్రశేఖరశాస్త్రిగారును, సాంక్రామికరోగములనుగూర్చి ములుగు విశ్వేశ్వరశాస్త్రిగారును, మానవసృష్టి: త్రిధాతువులనుగూర్చి ఇంద్రగంటి వేంకటేశ్వరశర్మగారును, త్రిదోషములు ద్రవ్యములనుగూర్చి ఎ. దామోదరరావుగారును వ్రాసిన వ్యాసములు ప్రత్యేకము ప్రశంసింపదగినవి. వైద్యవిద్యాభిమానులకు ఈసంచిక మిక్కిలి ఉపయోగకారిగా నుండగలదు. చిరునామా: ముక్త్యాల, కృష్ణాజిల్లా.

## సమదర్శిని ప్రజోత్పత్తియుగాది సంచిక:—

సమదర్శినీబాల కిది నాలుగవయుగాదిసంచిక. ప్రథమబ్రాహ్మణేతరకాన్ఫెడరేషను అధ్యక్షులుగ నుండిన లెఫ్టినెంటు కర్నల్ సర్ మహారాజా వెలుగోటి శ్రీగోవిందకృష్ణయాచేంద్రుల బహదూరు కే. సి. ఐ. యి. వేంకటగిరిమహారాజావారి గౌరవార్థముగ ప్రచురితమైనది. సంపాదకుని ప్రస్తావనతో సంచిక ప్రారంభమగుచున్నది. అది అతివిస్తరముగాదు. నాతికఠినము. పొంకముగానున్నది. నారీజనోద్యమమును గూర్చి అందు ఈసువర్ణాక్షరములు పొదుగబడినవి: "చేపువచ్చినపాలను చిఱుతలకిడుమండు పచ్చిబాలెంతలు గూడ నుద్యమరంగమున కుఱుకుచుండుటఁగాంచియే బ్రిటనులోని లేబరుమంత్రివర్గము తమప్రతికక్షుల నెదిరింప సాహసించిరి. భారతనారీమణులయం దింతయుత్సాహమేనాఁడుగలిగెనో యానాఁడే యీయుద్యమ మనివార్యమని ప్రపంచమెఱుఁగవలయునని ఘంటాపథముగఁ బల్కు ధైర్యము బ్రిటిషుప్రభుత్వమునకుఁ గలిగెను. ఈయత్యద్భుతమహిళాజనప్రబోధమునకు మేమిదే చేతులెత్తి జోతలొనరించుచున్నారము." పద్యవ్యాసములలో త్రిపురనేని రామస్వామిచౌదరిగారి 'కవిరాజగీతాలు' జాతీయభావప్రేరితములై తెనుగుతనమును కీర్తించుచున్నవి; వడ్డాది సుబ్బారాయకవిగారి 'శ్రీకృష్ణస్తవము' భక్తిభరితము; వడ్లమాని అప్పారావుగారి 'బ్రతుకు' మనోజ్ఞము; ఓలేటి సీతారామమూర్తిగారి 'ప్రేమమూర్తి' 'నిస్తులమాధురి' నొల్కుచు 'చవులూరజేయు' చున్నది. గద్యవ్యాసములలో వేమవరపు రామదాసుపంతులుగారి 'రెండుబేబిలు సమావేశము: కట్టుదిట్టములు' చదువదగియున్నది; తాపీ ధర్మారావుగారి 'రాజ్యాంగ సంస్కరణములు' రాణదేరిన వారి రాజకీయవిషయరచనమును సూచించుచున్నది; భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి 'ఖద్దరు' వ్యాసము 'రాట్నమే బంధవిమోచనసాధన' మని తేల్చుచున్నది; గూడపల్లి రామబ్రహ్మముగారి 'అరయుడు- విప్పర్లవారు' వారి పరిశోధకజ్ఞానమును ప్రదర్శించుచున్నది; నరహరిశెట్టి వేంకటరత్నముగారి 'వలపుకాన్క' జిజ్ఞాస రేపుచున్నది. ఈసంచికయందు స్త్రీరచితవ్యాసములు రెండేయుండుట శోచనీయము. ఛాయాచిత్రములు పెక్కు. త్రివర్ణచిత్రములు నాలుగు. అందు గాంధిగారి పటమును, ప్రణయపరిరంభమును సుందరములు. ఆంటిక్ కాగితములమీద ఫుల్ స్కేప్ పెద్దసైజున సుందరముగ ముద్రింపబడి ఈసంచిక క్రాలుచున్నది. 120 పుటలు. ఈసంచిక వెల చందాదారులకు రు. ౧-౦-౦. ఇతరులకు రు ౧-౮-౦. పోస్టుఖర్చులు ౦-౫-౦ అణాలు ప్రత్యేకము. వలయువారు సమదర్శినీకార్యాలయము, 14, మౌంటురోడు, మద్రాసు అని వ్రాయునది.




**గుంటూరు ఆంధ్రమహిళాసభ:—**

ఈసంవత్సరము గుంటూరునందు జరిగినది ప్రత్యేకమైన అయిదవఆంధ్రమహిళాసభ గాదు. ఆసభ నవంబరునెలలో జరుగనున్నది. గతపదునెనిమిదేండ్లనుండియు జరుగు నాంధ్రమహాసభతోబాటుజరుగు మహిళాసభయే జూనునెల 26-వ తేదీనిజరిగినసభ. ఈసభకధ్యక్షురాలు సుప్రసిద్ధదేశసేవికామణియగు గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు. ఆహ్వానసంఘాధ్యక్షురాలు నడింపల్లి శ్రీమహాలక్ష్మమ్మగారు సభయందెంచదగిన విశేషములులేవు. సభ అవ్యవధిగా జరుగుటచే కాబోలు ప్రెసిడెంటుగారి యుపన్యాసము లిఖితరూపమునగాక ఆశువుగా చెప్పబడినది. ఉపన్యాసమందంతటను రాజకీయవిషయములపాలు అధికము. మఱియు నొకవిశేషమేమన ప్రతివత్సరము జరుగు సాంఘికవిద్యావిషయములు ఇందు నిషేధింపబడినవి. ఆవిషయములు చర్చించుటకు ప్రత్యేకముగా రాష్ట్రీయమహిళాసభయున్నది కావున నిది రాజకీయమహిళాసభగా మార్చబడినది. కాన ఇందు చేయబడిన తీర్మానములన్నియు ఆంధ్రరాష్ట్రీయాదిరాజకీయసభలలో చేయబడిన తీర్మానములకు సమానాలే. అందు హిందూస్థానీసేవాదళపుబోర్డువారి యాజమాన్యమున దేశసేవికాసంఘములను ప్రతిపట్టణమునందు స్త్రీశాంతిసైనికశిక్షణము బడయునట్లు యేర్పాట్లు గావింపవలయుననియు, అఖిలభారత స్త్రీశాంతిసైనికదళశిక్షణకొఱకు కాకినాడపట్టణమున యేర్పడు శిక్షణాలయమున రాష్ట్రములోనిస్త్రీలందరువచ్చి పాల్గొనవలయుననియు, హిందీకి ప్రాముఖ్యతనీయవలెననియు, ఆంధ్రదేశములో స్త్రీల జ్ఞానాభివృద్ధికై ప్రత్యేకవారపత్రిక యుండవలయుననియు, స్త్రీల నిమిత్తమై స్థాపింపబడిన దేశీయసంస్థలను పోషించుటకు దేశీయులందఱు తోడ్పడవలయుననియు చేయబడినతీర్మానములు ముఖ్యమైనవని చెప్పవచ్చును. 30-వ తేదీని మరల స్త్రీలకొక బహిరంగసభ జరిగినది. ఇందు తీర్మానములేమియులేవు. దాదాపు అయిదారువందల మంది సభనలంకరించిరి. రాజకీయము, విద్య, దేశీయపరిశ్రమలు, కార్మికులు, హిందీ, పాతివ్రత్యము మున్నగువిషయములనుగూర్చి దాదాపు పదిమందిస్త్రీ లుపన్యసించిరి. స్త్రీలకై ప్రత్యేకముగా ఆంధ్రసభలతోపాటు గుంటూరునజరిగిన సభలివియే.

**గుంటూరు ఆంధ్రసభలప్పటి ప్రదర్శనములు:—**

ఇక ప్రదర్శనముల నుగూర్చి కొంచెము తెలుపవలసియున్నది. ప్రదర్శనములు పారిశ్రామికప్రదర్శనమనియు, ఖద్దరు ప్రదర్శనమనియు రెండుగానున్నవి. పారిశ్రామికప్రదర్శనమునందు మనదేశమునందు తయారుజేయబడిన ఇనుపపెట్టెలు, పలకలు, బొమ్మలు, సబ్బులు, పరిమళద్రవ్యములు, దంతపుసామానులు, కలములు, పెన్సిళ్లు, కత్తులు, చాకులు, గుండీలు, పటములువగైరా దుకాణములున్నవి. వీనినన్నిటిని జేర్చినను దుకాణములన్నియు పదికిలోపుగనేయున్నవి. కాని ప్రదర్శనశాలనంతయు మిక్కిలి ఆడంబరముతో నావరించినవి స్వదేశీ మిల్లువస్త్రములు అహా! వానినిగనిగ, తళతళ, వానిరంగు, వానిజిలుగు చెప్పశక్యముగాదు. పైపెచ్చు ప్రతితానుమీదను పటేలు, నెహ్రూ, సరోజనీమున్నగు దేశనాయకులపటములే. మిల్లువస్త్రములు కావలయునన్న ప్రతికుగ్రామమునందును దొరకును. అట్టివానికిట్టి గొప్ప పారిశ్రామికప్రదర్శనమునం దింతగౌరవమేలనో తెలియదు. ఈమిల్లు వస్త్రముల విభవము ముందు ఖద్దరు ప్రదర్శనమొక పేదముత్తయిదువగానున్నది. దానిని చూచినవారుమ కొలది. కొనినవారును కొలది. క్రిందటిమారు విజయవాడలో ఆంధ్రసభలు జరిగినప్పుడు పదిఖద్దరు అంగడులకు తక్కువలేకుండెను. ప్రత్యేకప్రదర్శనశాలయందుగూడ ఖద్దరుపై పలురకములపనితనములుచేసినవియు, రంగులద్దినవియు, సన్నమైనవియునుండెను. గుంటూరుప్రదర్శనమునం దట్టి పనితనములేవియు లేకపోవుటయేగాక ఖద్దరునొక్కప్రత్యేకస్థలమునం దస్పృశ్యపదార్థముగానుంచిరి ఇప్పటికే మిల్లుఖద్దరు దేశమున నతివ్యాప్తమైయున్నది. మిల్లువస్త్రములను కాంగ్రెసు ఆమోదించుటతో ఖద్దరుబలగౌరవములు చాలవఱకు క్షీణించినవి. దానికి తోడిట్టిప్రదర్శనములందుగూడ మిల్లుగుడ్డలపలుకుబడియే యధికముచేయబడినచో మహాత్మునకు ప్రియతమమైన ఖద్దరు హత్యచేయబడినట్టులే భావించనగును. గుంటూరునందు ప్రదర్శనశాలల తిలకించినప్పుడు ఖద్దరుకుగల్గిన అగౌరవము దుస్సహామనిపించినది.

**"ఆంధ్ర రాష్ట్రముతో మాకుపనిలేదు":—**

ఇదిరాయలసీమవారి వాదము. రాయలసీమవారు మహాసభలో యిద్దరో ముగ్గురో మాట్లాడినట్లుజ్ఞాపకము. కాని అందటిదొక టేపాటము. ఆంధ్రవిశ్వవిద్యాలయము విషయములో మీరు మమ్ములను అన్యాయ్యముచేసినారు. మిమ్ములను చూచినమాకు అనుమానముగానున్నది. విశ్వవిద్యాలయమును ఆటిరుచేసినవారు. రాష్ట్రవిషయములో మాకు న్యాయము కలుగజేతురని నమ్మకమేమున్నది? దీనిలోగూడ నేదో లాభముపొందుటకే కుట్రపన్నుచున్నారు. మీవిశ్వవిద్యాలయమేవద్దు. మీరాష్ట్రమేవద్దు. మీతోడిపొత్తేవద్దు. మాత్రోవ మేము చూచుకొందుము. మాకృష్ణదేవభూపతిలేనిది మీకు మహారాజేలేడు. మాతుంగభద్రనీళ్లుపడకున్న మీకృష్ణకు నీళ్లేలేవు. అసలు మీరు మేము వేఱు. కృష్ణానది మనలను వేఱుచేయుచున్నది. సింహాపురినిగూడ చల్లగా మాలోకలుపుకొంటిమా తిక్క

యజ్వగూడ మావాడేయగును. ఇక యెవరినిబెట్టుకొని మీకలుకు? మొత్తముమీద సభలలోవాదించినను, పత్రికలలోవ్రాసినను రాయలసీమసోదరుల వాదమిది. ఆంధ్రవిశ్వవిద్యాలయమును మూడుభాగములుగా విభజించినట్టులేవిభజించి అనంతపురమున కొకభాగమిచ్చినటులేయిచ్చి, రాజమండ్రిలో యొకశాఖపెట్టినటులేపెట్టి, విజయవాడను కొన్నాళ్లు కేంద్రస్థానముగ చేసినటులేచేసి తుదకన్నియు బంగీకట్టి వాల్తేరుకు రవాణాచేసినప్పుడు ఆంధ్రులలోను అందుముఖ్యముగా రాయలసీమవాసులలోను నిట్టియసంతృప్తిగలుగుటలో నాశ్చర్యములేదు. కాని పశ్చిమాంధ్రసోదరులొక్కవిషయమును జ్ఞప్తియందుంచుకొనదగును. ఎవరు ప్రప్రథమమున ఆంధ్రోద్యమమును బయలువెడలదీసి ఆంధ్రులలో ప్రత్యేకవిశ్వవిద్యాలయప్రతేకాంధ్రరాష్ట్రవాంఛ నుదయింపజేసిరో ఆదేశనాయకులు ప్రత్యేకవిశ్వవిద్యాలయ మేర్పడునాటికి నిరాకరణోద్యమములో జేరియుండినకారణమున శాసనసభలకు దూరస్థులైయుండిరి. ప్రభుత్వోద్యోగులును, వారికనుసన్నలలోమెలగెడిసభ్యులును నేదియో తికమకలుబెట్టి యూనివర్సిటీని కడుదూరమునెట్టిరి. కాన దేశనాయకులీవిషయమున నిరపరాధులు. ఈవిషయము రాయలసీమవారికిగూడ తెలియనిసంగతికాదుగదా. తెలిసియుండియు విశ్వవిద్యాలయ మావిధముగా నైనదిగావున మాకురాష్ట్రమేవలదనియు, లేదా రాయలసీమ ప్రత్యేకరాష్ట్రముగానుండవలయుననియు వాదించుటన్యాయమా? తల్లి తనబిడ్డలు నల్వురు బడినుండిరాగానే తానుదాచియుంచిన తాయిలమును తలాకొంచెము తానేచేతబెట్టిన వారు కొండంతసంతోషముతో తీసికొని ఎవరిపాటికి వారుతిని ఆటలకుబోయెదరు. దానినే తల్లి యేపనిమీదనోయుండి మీరేతలాకొంచెముతీసికొనుడనుచో ఇక వారికి పాళ్లుతెగవు. నాకు కొంచెమిచ్చేవు నీవు చాలాతీసుకొన్నావని తగవులు, కొట్లాటలు, యేడ్పులు. తుదకాతినుబండము క్రిందనుమీదనుపడుటయు జరుగుచుండును. చిన్నపిల్లలుకావున వారిజగడముచిన్నదిగానేయుండును. కాని మీలోమీరుపంచుకొనుడుఅని స్వాతంత్ర్యమిచ్చినచో పెద్దపెద్దలలోగూడ నీచిన్నతనపుచేష్టలేకనుపించును. ప్రజలఇచ్ఛనుగాని సలహానుగాని కైకొనకుండ అయిదారుభాషలవారిని ఒక్కరాష్ట్రములో ఉక్కిరిబిక్కిరియగునట్లు క్రుక్కి పరిపాలనచేయుచుండ అవును కాదనుటకు శక్తిలేదు. ఒకేభాషమాటలాడువారినెల్ల నొక్కరాష్ట్రవాసులనుగా జేయనెంచితిమి యని యెవరైన పరిహాసమున కడిగినను మనవారెన్నిగిరులుగీచెదరో లెక్కపెట్టలేము. అన్నభాగ మెక్కువగానున్నదని తమ్ముడును, తమ్మునిభాగ మెక్కువగానున్నదని అన్నయు వివాదపడవచ్చును. ఏకగర్భవాసజనితులైనవారికీవివాదము సర్వసాధారణమే. కాని అది కారణముగాగొని తాము జన్మించిన మాతృగర్భమే రెండుప్రక్కలుగా జీల్చెదమనుట యేటిభావ్యము? హా! ఆంధ్రజననీ! నీకెట్టియిక్కట్టు వాటిల్లినది? ఉత్తరాదివాడేయగుగాక ఆదికవియైన నన్నయభట్టును స్మరించి నమస్కరింపని రాయలసీమాంధ్రుడుండునా? రాయలసీమ ప్రత్యేకవిశ్వవిద్యాలయమునుబడసి ప్రత్యేకరాష్ట్రమేయగును

గాక దిగ్గజములవంటి కవిపండితులఁ జేరదీసి వారిచే యాంధ్రభాషాలలామను అనంతదివ్య కవితాడోలికల నుయ్యెలలూగించిన కృష్ణదేవరాయని ఉత్కళదేశపుసరిహద్దుననున్న ఆంధ్రుఁడైనను స్మరించి ఆనందపులకితగాత్రుఁడై జోహారు లర్పింపకుండునా? ఆంధ్రు లేదేశమున నేరాజ్యమున నేఖండముననున్నను వారినెల్లర నేకోదరులనుగా జేయుచున్నది భాషగాని ప్రదేశముకాదుగదా. తమదేశమును రెండుగా విభజించినందుకు వంగసోదరులు ప్రభుత్వముతో పోరాడి మరల నొకటిగాజేసికొనియుండ తమదేశమును రెండుగా విభజించు డని ఆంధ్రులు పోరాడుట కీర్తిశోభితులగు ఆంధ్రులకెంత అపకీర్తికరము? రాయలసీమ సోదరులకుగలిగిన ఈపృథగ్భాండాశనాభిలాషను పరమేశ్వరుఁడు పారద్రోలుగాక!

## డైరి

### జూను

22:—విదేశగుప్త రామకృష్ణవిశ్వాసుగార్ల ఉరిశిక్షలను రద్దుచేయవలయునని కోరుటకై కలకత్తాయందలి స్త్రీలు గొప్పఊరేగింపు జరిపిరి.

23:—

24:—ఢక్కాలోని కుమారున్నీసాబాలికాపాఠశాల ప్రధానోపాధ్యాయినియగు సుజాతారాయిసతిగారిపైని కార్యదర్శి అక్రమముగా నిందలను మోపినందున పాలకసంఘమువారవిశ్వమ్మి ఆమెను పనినుండి తొలగించిరి. అందువలన విద్యార్థినులందరును పాఠశాలను బహిష్కరించిరి.

25:—కాశీలో ఆయుధములచట్టముక్రింద అరెస్టుచేయబడిన రాధారాణీదేవి జామీనుమీద విడుదలయయ్యెను.

:—మిస్. డబ్ల్యు. క్లర్కుకన్య యం. ఏ. ఎల్. యల్. బి. అలహాబాదు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించెను. ఆంగ్లోఇండియను స్త్రీలలో ఈమెయే మొదటిఅడ్వకేట్.

26:—బొంబాయిలో మాధవభాగునందు ఖోజామహమ్మదీయఘోషాస్త్రీలసభలో గాంధిఉపన్యసించెను.

:—గుంటూరు: ఆంధ్రమహిళాసభ. శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారు అధ్యక్షురాలు. శ్రీమతి వడింపల్లి శ్రీమహాలక్ష్మమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు.

27:—గుంటూరు. 12-వ ఆంధ్రరాష్ట్రీయమహాసభ. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు.

28:—

29:—నెల్లూరులో ఇంతవఱకు శ్రీమతి పొణకా కనకమ్మగారి నాయకత్వము క్రింద జరుపబడుచుండిన విదేశవస్త్రబహిష్కారసంఘము కాంగ్రెసుసంఘమువారివశము చేయబడినది.

30:—శ్రీమతి తణుకు నాంచారమ్మగారు మరణించిరి.

### జూలై

1:—శ్రీయుత నాళం రామలింగయ్యగారిచే 1920-వ సంవత్సరమున రాజమహేంద్రవరమున స్థాపింపబడిన వైశ్యసేవాసదనమునందు ఆంధ్రయువతీసంస్కృతకళాశాల (ఆంధ్రవిశ్వకళాపరిషత్తు వారిచే రికగ్నైజుకాబడినది.) ప్రారంభింపబడెను.

2:—

3:—కలకత్తాలో బారాబజారు కాంగ్రెసుసంఘమువారు పికెటింగు చేయుటకై ఏర్పఱచిన స్త్రీసంఘమునకు శ్రీమతి మోహినీదేవిగారు నాయకత్వమువహించిరి.

4:—బెజవాడ దేవీతంతుకారకబృందమువారి స్త్రీశాఖ వార్షికోత్సవము క్రొత్తగుళ్లలో అతివైభవముగ జరిగెను. డాక్టరు రంగనాయకమ్మగారు సభాధ్యక్షతను వహించిరి.

5:—శ్రీమతి కాళింగి శేషమాంబగారు తమపాఠశాలకు ధనముగూర్చుపూనిన నిరశనదీక్షను ధనలాభము కలుగుటచే విరమించిరి.

6:—

7:—నరసరావుపేటలో డాక్టరు తిమ్మారెడ్డిగారి సతీమణి లీలాదేవిగారిని ప్రభుత్వమువారు బెంచిమేజస్ట్రేటుగా నియమించిరి. నరసరావుపేటలో స్త్రీని బెంచిమేజస్ట్రేటుగానియమించుట కిదియే ప్రథమము.

:—శ్రీమతి మంత్రిప్రగడ బంగారమ్మగారు కొవ్వూరులో స్త్రీలసభలో కద్దరు, స్వదేశీదీక్షనుగూర్చి ముచ్చటించిరి.

8:—మదరాసులో గుజరాతి బాలికాపాఠశాల బరోడా దివానుగారు దర్శించిరి.

9:—

10:—దువ్వూరి సుబ్బమ్మగారిచే స్థాపింపబడిన రాజమహేంద్రవరమునందలి స్త్రీసనాతనవిద్యాలయమునకు నెల్లూరువాస్తవ్యులు రేబాల పట్టాభిరామరెడ్డిగారు నూటపదార్లు ఒసగిరి.

11:—శ్రీ విల్లిపుత్తూరు తాలూకా రాజకీయమహాసభ శ్రీమతి అచంట రుక్మిణి లక్ష్మీపతిగారి అధ్యక్షతను గూడెను.

12:—

13:—రాజమండ్రి ఇన్నీసుపేట విద్యాలయమున శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారి అధ్యక్షతను జరిగిన స్త్రీలసభలో శ్రీమతులు బొల్లాప్రగడ చలవమ్మ, మద్దూరి శాంతాబాయిగార్లు ఉపన్యసించిరి.

14:—గాంధిమహాత్ముని శిష్యురాలగు మీరాబాయి స్లేడుకన్యగారి తల్లి స్లేడుప్రభ్వి మృతినొందెను.

15:—లిట్టన్ ప్రభుని కూతురును ఎరను ప్రభునకిచ్చి అఖండవైభవముతో లండనులో పెండ్లికావింపబడెను.

16:—శ్రీమతి వెల్లంకి అన్నపూర్ణమ్మగారి కార్యదర్శిత్వమున ఏలూరు ఆంధ్రరత్నయువజనసమితివారి యాజమాన్యమున హిందీపాఠశాలప్రారంభింపబడెను. శ్రీమతిదామరాజులక్ష్మమ్మగారుఉపాధ్యాయిని.

17:—లండను కాక్స్టనుహాలులో ఎబర్డీన్ ప్రభ్విఅధ్యక్షత సభజరిపి పెంట్లండుసతిమున్నగువారు దొరాబు టాటాసతి మరణమునకు సానుభూతిని తెలిపిరి.

18:—రాజమండ్రిలో స్త్రీలసభలో శ్రీమతి దిగుమర్తి కృష్ణమ్మగారు ఆరోగ్యవిధులనుగురించి ఉపన్యసించిరి.

19:—కొన్ని వారములకు పూర్వము డాక్టరు బిసెంటమ్మగారు అడయారులోని తమభవనము మెట్లపైనుండి జారిక్రిందపడిరి. మోకాలికిగాయములు తగిలినవి. అవి నెమ్మదికాంచగానే ఆమెమెట్లనుదిగి క్రిందికి వచ్చి కొంతదూరము మోటారులో బయటకు వెళ్లివచ్చిరి. అడయారునందు మఱ్ఱిచెట్టుక్రింద జరిగిన అల్పాహారవిందులో పాల్గొనిరి.

---

EDITED, PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

*

*　　*

ఉద్రకుఁడు సిద్ధార్థునకు వేదవేదాంతశాస్త్రములు తర్కదర్శనములు సమగ్రముగ నేర్పెను. ఆతత్త్వశాస్త్రములు సిద్ధార్థునికి సంతుష్టి నొసంగఁజాలవయ్యెను. అప్పుడతఁడు జ్ఞానకాండమునువిడిచి తపఃకాండ ముపక్రమింపఁ దలఁచెను. ఆకాలంబున సంసారవిముఖులైన మహాపురుషు లనేకులు బ్రహ్మచర్యదీక్షాధురీణులై దారపుత్రపరిత్యాగులై పరమతపోనిరూఢులై సింహశార్దూలాదిఘాతుకమృగాకీర్ణంబు లగువనంబులకరిగి తపంబులఁజేయుచుండిరి. కొందఱు జటాధరులు, కొందఱు శిరోముండనప్రియులగుసన్యాసులు, కొందఱు కాషాయాంబరధారులు, కొందఱు దిగంబరులు, కొందఱు నిరాహారులు, కొందఱు వాయుభక్షకులు, కొందఱు జలభక్షకులు, కొందఱు కందమూలాశనులు, కొందఱు పర్ణాశనులు, కొంద ఱూర్ధ్వబాహులు, కొందఱు పంచాగ్నిమధ్యస్థులు, కొందఱు కంటకశయ్యాగతులు నైఘోరతపంబు చేయుచుండిరి. అట్టితపోనియమము దానుగూడ వహించి శరీరముశుష్కింపఁజేసియింద్రియంబుల పొగరడంచి దివ్యజ్ఞానమును సమానుషశక్తులను బడసి తద్వారమున ముక్తుఁడు గావలయునని సిద్ధార్థుఁడు సంకల్పించి యురువేలమహావనంబున కరిగెను. ఈవనమిప్పుడు బుద్ధగయకు సమీపమందున్నది. ఆవనంబున కరిగి యతఁడు భయంకర నియమంబులఁబూని యాఱుసంవత్సరములు ఘోరతపంబు చేసెను. అతనిశరీరముశుష్కించెను. రక్తమాంసము లెండిపోయెను. ఆతపము జేయునపు డతనియొద్దనైదుగురు శిష్యులుచేరిరి. ఆమహాతపము వారికిఁగూడ వెఱపుబుట్టించెను. ఒక్కొకబళమాహారముకన్న నెక్కువతినఁగూడ దనుకొని నియమము జేసికొని దేహమునకు బలమిచ్చుపదార్థము లెల్ల వర్జించి జలము మొదలగు దుర్బలపదార్థములను భుజించుచుశుష్కదేహుఁడయ్యెను. అందువలన నేనుఁగుబలముగల యతఁడు లేచినిలువఁబడఁజాలకపోయెను. శరీరమంతయు నల్లబడెను. అతనిమేన మున్ను కనఁబడుచువచ్చిన ముప్పదిరెండు కల్యాణలక్షణము లదృశ్యము లయ్యెను. ఎట్టకేల కొకనాఁడురాత్రి తెల్లవాఱుజామున శరీరదౌర్బల్యముచేత నతఁడు మూర్ఛిల్లెను. అప్పుడతఁడు తపంబువలనను దేహశోషణాదిఘోరకర్మంబులవలనను బ్రయోజనము లేదని తెలిసికొనెను. ఈతపంబులవలన దనజీవితమున నాఱుసంవత్సరములకాలము వ్యర్థమయ్యెననియు మహాతపశ్చరణానంతరమున నయితము తపమారంభింపకముందు దానెట్టిస్థితిలో నుండెనో యట్టిస్థితిలోనే యుండవలసివచ్చెననియు నతఁ డెఱిఁగెను. తపశ్చరణమువలన మోక్షములేదని యతఁడు భావించెను. అతఁడన్నములేక చావునకు సిద్ధమైయున్న యా సమయమున నొకపల్లెటూరి కాఁపువానికూఁతురు సుజాతయనునది యాతని కన్నముపెట్టి ప్రాణము నిలిపెను. ఆమె చేసినయుపకారము సిద్ధార్థుఁడు జన్మాంతరమునకును మఱువ లేదు. మరణసమయమున నయితము సిద్ధార్థుఁ డామెచేసిన యుపకారమును స్మరించి సుజాతపెట్టిన యన్నముఁ దిన్నతరువాతఁ దనకుబుద్ధత్వము సంప్రాప్తించినందున నామె పెట్టినయన్నమే యన్నమని కొనియాడెను.

—చిలకమర్తి లక్ష్మీనరసింహము.

*　　*

*

# గాంధీయుగము

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యె; బి.యల్.

౧

ఇంటిలోనా గాంధిబొమ్మ,
ఒంటిమీదా గాంధిబట్టే,
వెంటనంటే "గాంధికీజే!"
యంటెదశదిశలు!

పిల్లవారికి గాంధియాటే,
ఎల్లవారికి గాంధిమాటే,
నగరముల పల్లెలనుగాంధీ
నాయకునిపాటే!
స్పెయిను నీటోపీకినతులిడ,
రోమ్ము నీటోపీధరింపగ,
నీచరిత రోలెండు వ్రాయగ,
స్లేడు నినుగొల్వ!
అమెరికాయత్యద్భుతంబన
ఆఫ్రికా నిన్ననుసరింపగ
లోకమంతా పొగడగా ని
నైకకంఠ్యముగా!

కనులుగల భాగ్యంబు నేటికి
గాంచినామని సకలజనములు
కన్నులను నీమూర్తిపై నిడి
గాంచుచుండంగ!
కాంచెనటసీతమ్మ; బలియును
గాంచెనట! యర్జునుడుగనెనట
నాడుచెప్పిన విశ్వరూపము
నేడుచూపించి!
ప్రాతమినుకుల నిజములనియెడు
భవ్యమణులకు నూత్నకళలిడి
మెఱుగవేసితి వెల్లదేశము
లేరుకొనుచుండ!

౨

ప్రాణపద మీభరతదేశము!
భరతదేశము సమస్తమునే
సంతసంబున ధారపోతును
సత్యమున్నిలుప!

సత్యమే నాప్రాణవాయువు,
సర్వజీవప్రేమకవచము,
స్వార్థవిరహితచిత్తశాంతియె
స్వంతభాగ్యంబు!

అఖిల భారతదేశజననిన
హాంతరికసమ్మేళనంబును,
అన్యవస్తువిసర్జనమె నా
యస్త్రశస్త్రములు!

2

రామరాజ్యమె కామితార్థము,
ప్రజలసుఖమే యాశయము, విూ
కల్లమాటలు పొల్లుచేతలు
గట్టిపెట్టండి!
రండు! యుద్ధముగలదురండీ!
భండనంబిది పరమశాంతము!
త్రికరణముగ సహింపయేమన
దివ్యశరణంబు!
భండనమునకు వెరవనేలా?
దండనకు వెనుదీయనేలా?
తారుమారైనా జగంబులు
ధర్మమేజయము!
తల్లిదాస్యవిముక్తికై ఖగ
వల్లభుండమృతముగొనిరా
బూనుదీక్షనె శాంతచిత్తం
బులబిగించండి!

కత్తివ్రేటులుగావు, కార్యపు
గమ్మదనమే జయమునొందెను!
నార్తిలేని ప్రశాంతియేయగు
కీర్తులకుద్రోవ!
పశుబలముకే జగంబంతా
వశంబైతే, యాత్మబలమున
కఖిలబ్రహ్మాండంబునందూ
అడ్డమేముంది!
నాఁడుకృష్ణుడు పట్టెచక్రము,
నేఁడుపట్టితి నేనుజక్రమె,
శత్రులనుగెలిచేటిశక్తులు
సమమెరెండిటికి!
రక్తపాతములేని దైవత
భక్తి విూకిడినాఁడు బుద్ధుడు!
రక్తమొలుకని శాంతియుద్ధపు
శక్తి నేనిడుదు!

3

అనుచుబరమపవిత్రతేజః
కిరణములురలగతమంబెకలగ
గాలిచొరనిప్రదేశమైనా
లీలజొరబడుచు!

ప్రాతఘోషాతూలిపోగా
పాడుభయమూ పారిపోగా
కొత్తనెత్తురు వరదలై తరు
క్రొత్తదేహముల!
మేలిముసుగుల దొలగద్రోయుచు
కూలిక్రుంగిన యాశలెత్తుచు
మ్రోడుమనసు లనలెత్తజేయుచు

మ్రోగెనీమాటల్!
సకలదేశదిగంతముల నీ
శాంతిసమరపు సింహనాదము
స్వాంతములకుత్సాహమిడగా
సతులుపురుషులును
"క్రీడో మేలో" అనుగుటేదీ
"గెలుపో వీగో" తలచుటేదీ

గాంధియూదెను పాంచజన్యము
కట్టుడీనఘము.
అనుచు నీమృదుపదముజాడల
నంటినడచిరి భారతీయులు
అడుగువెన్క_కు వేయకే వా

రందరినిగూడి
శాంతిరణమొనరించినాడవు
స్వార్థమును సమయించినాడవు
సకలమానవహృదయపాలన
శక్తిగన్నావు!

౪

రవియుగ్రుంకని మహారాజ్యపు
రాజప్రతినిధి యిర్వినుండే
రాజితాంబరచుంబిత ప్రా
సాదరాజమున

కనులశాంతము రామరాజ్యపు
కాంక్షపలుకున పల్కు_వెనుకను
బ్రహ్మతేజము దైవబలమును
ప్రబలియుండంగ!
దశరథునిసభ గాశికునివలె
విష్ణునగరిని భృగునిపోలిక
కృష్ణువలన కుచేలువలె బహు
మన్ననలగొనుచు

సగము దేహము ముతుకగుడ్డల
సందుననుగన్పడగ ప్రభుతో
సామ్యరీవిని సంధచేసిన
సాహసపుయోగి!
ఉదధికాజ్ఞయొసంగి కెన్యూ
టాందెభంగము! భారతాబ్ధిని
పొంగిపొర్లింపంగ నిలుపగ
నీదెకాశక్తి!

౫

నాశుభగవద్గీత చెప్పెను
నేడుమాకనులార గంటిమి
స్థితప్రజ్ఞుని గుణాతీతుని
ధీరు యుగపురుషు!

నీయుగంబున బ్రతికియుండుటె
వేయిక్రతువులఫలము! నీచర
ణముల సన్నిధిగన్నవారల
దేతపఃఫలమొ?
అంగ్లులెరుగని యాత్మరాజ్యము
లందురాజై యేలగలవిక

వారిజండా చౌరనిచోటుల
ప్రబలునీధ్వజము.
కామ్యరాజ్యము రాని పోనీ!
గాంధియుగమూ గాంధిమతమూ
ధర్మరక్షణకై వెలుంగును
ధర శిలాక్షరమై!